సరస్వతీ గ్రంథమండలి :
అనుబంధమాలిక : ౧౩

# భారతకథాసారము

శ్రీమతి దేచిరాజు లక్ష్మీనరసమ్మ

**Approved by the Madras Text Book Committee for Class use, Fort St. George Gazette, Part 1-B (Edl.) No. 21-B D/ 27—5—1941, Page 153.**




సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# భారతకథాసారము

## ఆదిపర్వము

భరతవంశజాతుఁడగు శంతనుఁడను మహీపాలుఁ డొకనాఁడు మృగయావినోదంబులఁ దగిలి వనాంతరంబున సంచరించుచు, గంగాపులినతలమున నొక్క సరోజముఖిని గాంచి తన్ను వరింపుమనియడుగ నత్తన్వి "రాజా! నేనాచరించు కార్యముల కడ్డు చెప్పకుందువేని నిన్నుఁ జేపట్టి యభిమతముఁ దీర్చెద. ఎప్పు డడ్డుసెప్పిన నప్పుడు నిన్ను విడిచి చనియెద" నని చెప్పెను. శంతనుఁ డందులకొడఁబడి యామెను బరిగ్రహించెను.

అనంతర మాయువతికి సుతుఁ డుదయింప దోడనే యామె వానిని దీసికొనిపోయి గంగాప్రవాహమునఁ బడవైచివచ్చెను. శంతనుఁ డా ఘోరకృత్యమును గాంచి సహింపలేకయుఁ దాను వలదన్నచో నయ్యింతి తన్నుఁబాసి యరుగునను భయమున నూరకుండెను. ఆ లలన యట్లు సుతసప్తకమును గాంచి యందఱను వధించి యష్టమతనూజునిఁగూడఁ బ్రవాహమునఁ బడవైవఁ బోవుచుండ నుదయార్కతేజుఁడగు నక్కుమారుని గని శంతనుఁ డూరకుండ జాలక "పుత్రఘాతకీ! ఈకుమార రత్నమునైన నదీగర్భమునఁ ద్రోయక బ్రదుకని" మ్మని యామెను వారించెను. "మహారాజా! నీవు నన్ను వారించితివి

గనుక నీక నాయిచ్చవచ్చిన మార్గమున నరిగెద" నని యాసుదతి వచింప శంతనుం డామె నెడంబాయం జాలక చింతాక్రాంతుం డయ్యెను.

పిమ్మట నామె "అవనీతలేంద్రా! నీవు చింతింపక నా వృత్తాంతము సమగ్రముగ నాలింపుము. నేను త్రివనపావని యనంబరగిన భాగీరథిని. నా కుదయించిన కుమారు లెనమండ్రును వసువులు. వీరలొకనాడు పత్నీసమేతులై మేరుపర్వతమునకుం గ్రీడార్థ మరుదెంచి, యటం దపంబు నేయుచున్న వసిష్ఠమహాముని హోమధేనువగు నందినిని బట్టుకొని పోయిరి. అనంతరము వసిష్ఠమహాముని తన ధేనువును గానక వనమెల్ల వెదకి పిమ్మట యోగదృష్టింజూచి వసువు లెత్తుకొని పోయిరని యెఱింగి కోపాయత్తచిత్తుండై "మర్త్య లోకమునం బుట్టుం" డని వారిని శపించెను. అంత నావసువులు భీతచిత్తులై వచ్చి మునీంద్రునకుం బ్రణామములాచరించి "తాపసోత్తమా! ధర్మమూర్తివగు నీవు మాయపరాధము సహించి భూలోకమున మే మెక్కువకాలము జీవింపకుండునట్లు మమ్మనుగ్రహింపు" మని ప్రార్థింప మునీంద్రుడు ప్రసన్నుండై "మీరు కోరినట్లే యగును. ప్రభాసుడు మాత్రము మహాప రాధము చేసెను గావున నతడు మర్త్యలోకమునం బెక్కు కాల ముండు" నని వచించెను. అనంతర మావసువులు తమ శాపవృత్తాంతము నాకెఱింగించి "మే మెందుచోట జనింప నోపము. నీయందుం బుట్టెదము. నీవు స్త్రీరూపముందాల్చి

మమ్ముఁ గనినతోడనే ప్రవాహమునఁ బడవైచుచుందుము” అని వేఁడ నే నందుల కంగీకరించితిని. ఆ కారణమువలన నిది వఱకు జనించిన కుమారసప్తకమును నదిలోఁ బడవైచితిని. దేవవ్రతుఁడైన యీకుమారుఁడు దీర్ఘాయుష్మంతుఁ డగును. వయోవంతుఁ డగువఱకు వీనిని నాయొద్ద నుండనిమ్ము” అనుచు గంగాదేవి సమస్త వృత్తాంతము శంతనున కెఱిఁగించి యాతని నోడఁబఱిచి, నిజరూపధారిణియై యరిగెను. విషణ్ణ చిత్తుఁడై శంతనుఁడు తన రాజధాని కేఁగెను.

భీష్మాభిధానుఁడగు నాకుమారుఁడు దినక్రమాభివృద్ధుఁడై పరశురాముని యొద్ద విలువిద్య నభ్యసించి యందు నిపుణుఁ డయ్యెను. అనంతర మొకనాఁడు శంతనుఁడు గంగాతీరమునకు రాఁగా భాగీరథీదేవి యాకుమారు నాతని కొసఁగెను. శంతనుఁడు ప్రమోదభరితమానసుఁడై హస్తినాపురమున కరిగి భీష్ము యౌవరాజ్యాభిషిక్తుం జేసి సంతసముతోఁ గాలముఁ గడపుచుండెను.

ఇట్లు నాలుగువత్సరములు గడచిన పిమ్మట నొకనాఁడు శంతనుఁడు వేటకొఱకు విపినమున కరిగి, యమునా తటమున నొక కమలలోచనం గాంచి “సుందరీ! నీ వెవ్వరి దానవు?” అని ప్రశ్నింప నా సుదతి “రాజా! నేను దాశ రాజు తనూజను. సత్యవతి యనుదానను. తండ్రి పనుపున నిచ్చట నోడనడుపుచుందును.” అని ప్రత్యుత్తర మొసఁగెను. పిమ్మట శంతన భూపాలుఁడు దాశరాజుకడ కేఁగి “నీతనూజను

నా కొసఁగు" మని యడుగ, నతఁడు "అవనీతలేంద్రా! నా దౌహిత్రుని రాజ్యాభిషిక్తుం జేయ నంగీకరింతువేని నా తనయ నిచ్చెదను." అని యుత్తర మొసఁగెను. "అగ్ర తనూజుఁడు, సుగుణగణ విరాజితుఁడు నగు భీష్ముని విడిచి, సత్యవతికి జనించువాని నెట్లు భూమీశుం జేయఁగలను?" అని శంతనుఁడు చింతాక్రాంతుఁడై హస్తిపురమునకరుదెంచి మనంబున సత్యవతినే తలపోయుచుండెను.

ధర్మనిరతుఁడైన గాంగేయుఁడు తన తండ్రి చిత్తము సత్యవతిపయిఁ దగులుట యెఱిఁగి దాశునికడ కేఁగి "నేను గురుప్రయోజనార్థము నిజరాజ్య పరిత్యాగమును, బ్రహ్మచర్య వ్రత పరిగ్రహమును చేయుచుంటిని. హిమకరుఁడు శైత్యమును, భానుఁడు తేజమును, హుతాశనుఁ డుష్ణమును విడిచినను నే నీవ్రతము విడువను. సత్యవతికిఁ బుట్టెడి సుతుఁడే మహీనాథుఁ డగు!" ననుచు సకలజన సమక్షమునఁ బ్రతినఁ జేసెను. అప్పు డమ్మహనీయుని పితృభక్తికి మెచ్చి బృందారకులు కుసుమవర్షముఁ గురిపించిరి. దాశుఁడు సంతసించి సత్యవతి నొసంగెను. గంగానందనుఁ డామెను హస్తిపురికిఁ దోడ్కొనిరాఁగా శంతనుఁ డమందానంద మొంది వివాహ మాడి, తనకొఱకై సమస్తభోగములం ద్యజించిన కుమారునకు స్వచ్ఛందమరణము వరముగా నొసఁగెను.

అనంతరము శంతనమహారాజు సత్యవతియందుఁ, జిత్రాంగద విచిత్రవీర్యులను సుతులను బడసి కొంతకాలమునకుఁ

బరలోకగతుఁ డయ్యెను. సత్యవ్రతుఁడగు భీష్ముఁడు తండ్రి మరణానంతరమునఁ జిత్రాంగదుని రాజ్యాభిషిక్తుం జేసెను. అతఁ డతి గర్వితుఁడై సుర, దనుజ, మనుజ, గంధర్వాదుల నాక్షేపించుచుండఁ జిత్రాంగదుఁడను గంధర్వపతి వానియం దలుకవహించి సమరమున కరుదెంచెను. చిత్రాంగదుఁ డా గంధర్వనాథు నెదుర్కొని ఘోరముగఁబోరి తుద కాతనిచే నిహతుఁడయ్యెను.

అనంతరము భీష్ముఁడు విచిత్రవీర్యుని సింహాసనాసీనుంజేసి, కాశీరాజ దుహితలైన యంబికాంబాలిక లను యువతీ మణులం దెచ్చి యాతనికి వివాహము చేసెను. విచిత్ర వీర్యుఁడు నిరంతరము స్త్రీలోలుఁడై సంచరించుటచే నాయు క్షీణంబుగా శీఘ్రంబున- బరలోకగతుఁ డయ్యెను. అప్పుడు గంగానందనుఁడు శోకార్ణవనిమగ్నులైన మాతృదండ్రను, జన యిత్రిని నాశ్వాసించి యరాజకమైన రాజ్యము నకలంకముగ నేలసాగెను.

అనంతర మొకనాఁడు సత్యవతీదేవి భీష్మునిఁగాంచి "కుమారా! నీ విఁక వివాహమాడి సంతతిఁబడసి యీకురు వంశము నుద్ధరింపుము!" అని వచింప, దేవవ్రతుఁడు "తల్లీ! నేను గురుప్రయోజనార్థంబై సర్వజనసమక్షమునఁ జేకొన్న పవిత్రవ్రతము విడువనొల్ల; పావనమైన యీ కురువంశోద్ధర ణార్థ మేనొక్క ధర్మముఁ దెల్పెదను. ఉత్తమరాజవంశము లంతరింపనున్న తరుణమున క్షత్రియక్షేత్రములందుఁ దపో

బలె విశుద్ధాత్ములైన భూసురోత్తములచే ధర్మమార్గమున నుద్భవించి వశంకరులైన క్షత్రియు లనేకులు గలరు. ఈ విధ మున వంశము నిలువఁబెట్టుట క్షత్రధర్మము. కావున యిప్పుడు విచిత్రవీర్య క్షేత్రములందు సత్సంతానము నను(గహించునట్లు ధర్మనిరతుఁడగు నొక ధరణీ దేవోత్తముని ప్రార్థించుట కర్తవ్య" మని చెప్పెను. సత్యవతి యందుల కంగీకరించి కుమారా! నేను కన్యాత్వముననుండి తండ్రి నియోగమున యమునానది నోడనడపుచుండ నొకనాఁడు పరాశరమునీంద్రుఁ డరుదెంచి నన్నుఁ గామించి యమునాద్వీపమున, సద్యో గర్భంబునఁ, గృష్ణద్వైపాయనుఁడను సుతు నను(గహించి, నా కన్యాత్వము దూషితము గాకుండునట్లు వరమొసఁగిచనెను. "పనిగలయప్పుడు నన్నుఁ దలఁచిన వచ్చెద" నని చెప్పి కృష్ణద్వైపాయనుఁ డప్పుడే తపోవనమున కేఁగెను. ధర్మ మూర్తియు, నిత్యసత్యవచనుఁడు నగు నాకుమారుఁ డీవంశము నుద్ధరింప సమర్థుఁడని తలఁచెదనని పలుక, గాంగేయుఁడు కృష్ణద్వైపాయనుని దలఁచి కరకమలములు మొగిచి "వేదవ్యాస మునీంద్రుఁ డీ భరతవంశమును ప్రతిష్ఠించుట సకలజన సమ్మత" మనుచు భక్తి పులకితాంగుఁడై వచించెను.

అంతట సత్యవతి కురువంశోద్వాహనార్థము పారాశర్యునిఁ దలంప నతఁ డరుదెంచి భీష్మునిచేఁ బూజితుఁడై, జనయిత్రికి నమస్కరించి యామెవలన సమస్తవృత్తాంతము నెఱిఁగి కాశీ రాజ పుత్త్రికలకుఁ బుత్త్రదానముసేయ నంగీకరించెను.

అంతట సత్యవతి పెద్దకోడలైన యంబిక కడకేఁగి "ఈరాత్రి నీయొద్దకు వ్యాసముని యరుదెంచును. నీవు ధర్మవిధానమున వానివలన రాజ్యధురంధరుఁడగు సుపుత్త్రుఁ బడసి భరత వంశము నిలుపుము." అని చెప్పి యామె నొడంబఱిచి యానాఁడు సకలజనులకు నన్నదానము సేయించెను. పిమ్మటఁ గృష్ణద్వైపాయనుఁ డంబికకుఁ బుత్త్రిదానంబు సేసి సత్యవతి కడకుఁ జని "తల్లీ! అంబికకు బలపరాక్రమవంతుఁడయిన సుతుఁ డుదయించును; వాఁడు మాతృదోషమువలన నంధుఁ డగును." అని చెప్ప, సత్యవతి విషణ్ణచిత్తయై "కుమారా! అంబాలికయం దొక సుతుం బడయుము" అని నియో గించెను. అంతట వ్యాసుఁ డంబాలికడకుఁ జని యామె కొక సుతు ననుగ్రహించి వచ్చి "జననీ! అంబాలికకును పరాక్రమశాలియు, సుగుణవంతుఁడు నగు సుతు డుదయిం చును. వాఁడు మాతృదోషమువలనఁ బాండుదేహుఁడగును" అని చెప్పి తపోవనమున కరిగెను.

పిమ్మట నంధుఁడైన కుమారుఁ డంబికకును, పాండు దేహుఁడైన కుమారుఁ డంబాలికకును జనింప సత్యవతి దుఃఖితయై మరలఁ బారాశర్యునిఁ బిలువ నతఁ డరుదెంచెను. "కుమారా! అంబికానందనుఁ డంధుఁడయ్యెఁ గావున నామెకు మఱియొక సుపుత్త్రి నొసఁగుము." అని సత్యవతి నియో గింపఁ గృష్ణద్వైపాయనుఁ డంతఃపురమున కేఁగెను. అప్పు డంబిక యాముని వికృతరూప గంధములం దలఁచి కడు

ననహ్యాపడి తన దాసి నలంకరించి శయనతలమున నుండఁ బనిచెను. తాపసోత్తముఁడు దానికిఁ దనయు ననుగ్రహించి చనెను. అంత నద్దాసికి ధర్మాధర్మవిదుఁడయిన విదురుఁడు జనించెను.

అనంతరము భీష్ముఁ డంబికానందనునకు ధృతరాష్ట్రుఁ డనియు, నంబాలికా తనూజునకుఁ బాండుడనియు నామ కరణముఁ జేయించి పెంచి రాజవిద్యలు చెప్పించెను. అగ్రజుఁ డగు ధృతరాష్ట్రుఁ డంధుఁడగుటచే రాజ్యాధిపత్యమున కనర్హుఁడైనను సుగుణరత్నాకరుఁడైన పాండురాజునే సింహాసనాసీనుం జేసి తన పరాక్రమాతిశయమున రాజ్యముఁ గాపాడుచు సకల జనానురక్తుఁడై వర్తించుచుండెను.

గాంధార రాజనందన యగు గాంధారి సుతశతంబుఁ బడయునట్లు మహేశ్వరునిచే వరము నొందెనని విని గాంగేయుఁడు కురువంశము నభివృద్ధినొందింప నెంచి గాంధారపతి నడిగి యాకన్యకను దెచ్చి ధృతరాష్ట్రునకుఁ బరిణయముఁ జేసెను. పరమ పతివ్రతయగు గాంధారి తన పతి కనుగుణముగా నేత్రపట్టముఁగట్టుకొనియెను. ధృతరాష్ట్రుఁడు గాంధారినిఁ బట్టమహిషిగఁ జేకొని పిమ్మట నామె తోఁబుట్టువులను బదుగురు కన్యకలనుగూడ వివాహమాడెను. అనంతరము గాంగేయుఁడు భరతవంశమును విస్తరింపఁజేయు నపేక్షగలవాఁడై కులశీల రూపవతులగు కన్యలను బెక్కండ్రను దెచ్చి ధృతరాష్ట్రునకు వివాహముఁ జేయుచుండెను. ధృతరాష్ట్రుఁ

డిట్లు నూర్వురు కన్యలను బరిగ్రహించెను. భరత కులా లంకారుఁడైన పాండు మహీశుఁడు భీష్మానుమతి నొంది, యదువంశజాతయు, వసుదేవుని చెలియలు నగు పృథాదేవిని, మద్రరాజ నందనయగు మాద్రిని స్వయంవరవిధానమునఁ బెండ్లియాడెను.

పృథాదేవికిఁ గుంతియను నామాంతరము గలదు. కుంతి భోజుఁడనురాజు సంతానరహితుఁడై, తన మేనమామ సుతుఁ డగు శూరసేనునడిగి యాతని సుతయైన పృథాదేవిని దనకుఁ గొమరితగాఁ దెచ్చి యతిప్రేమమునఁ బెంచుకొనెను. అందు వలన నామెకుఁ గుంతి యను పేరు గలిగెను. కుంతి భోజుని గేహమునఁ బెరుఁగుచున్న కాలములో నొకనాఁడు దుర్వాస మహాముని యతిథియై రాఁ గుంతి యాతనికిఁ గోరిన యాహారము నొసఁగి సముచితోపచారములు చేయ నమ్మునివరుఁడు ప్రీతుఁడై "కుమారీ! నీకు నేను దివ్యమంత్రము నుపదేశించెదను. ఆ మంత్రముచే నీ వేదేవు నారాధించిన నా దేవుఁడు వచ్చి నీవు కోరిన కుమారుల నొసఁగును" అని చెప్పి మంత్రము నామె కుపదేశించి చనెను. అనంతర మొక నాఁడు కుంతీదేవి గంగాతీరమున కరిగి యా మంత్ర ప్రభావము నెఱుఁగఁదలఁచి యంశుమంతు నుద్దేశించి "అంబుజమిత్రా! నాకు నీయట్టి తనయునిఁ బ్రసాదింపుము." అని యా మంత్రము జపింప నాదిత్యుఁ డచటి కరుదెంచెను. ఆమె యాతనిం గని భయకంపితగాత్రయై నేను మౌనివరుఁ డుపదేశించిన

మంత్రశక్తి నెఱుఁగఁదలఁచి, యజ్ఞానినై త్రిలోకైకదీపకుఁడ వగు నిన్ను రావించితి. నాయపరాధము సహింపవలయును. కన్యనగు నేను గర్భవతి నైన గురుజనము లూరకుందురా ?" అనుచుఁ బ్రార్థింప నా దేవుఁడు కరుణాయత్తచిత్తుఁడై "సుదతీ! నా దర్శనము వ్యర్థముగాదు. నీ కన్యాత్వము దూషితము గాకుండునట్లు సద్యోగర్భమున నీకుఁ గొమరుఁ డుద్భవించును." అని చెప్పి యామెకు సుతు నను గ్రహించి చనియెను. అప్పు డామెకుఁ గవచకుండలధారియైన కుమారుఁడు జనింప "బాలార్కప్రతిముఁడగు నీ బాలు నిప్పు డేమి సేయుదు ?" నని కుంతీదేవి దుఃఖించెను. అప్పు డాదిత్యప్రేరితయై యనర్ఘరత్నవసుధరితంబైన 'మంజన' నదీప్రవాహవేగంబునఁ దన సమీపమునకు రాఁ గుంతి యబ్బాలుని దానిలోఁ బరుండఁబెట్టి నిజగృహమున కరిగెను. పిమ్మట నొకసూతుఁడు రత్నపుంజభరితమైన యా మంజసం గాంచి దానిని దెఱచి యందున్న కుమారుని నతిప్రేమున నెత్తుకొనిపోయి తన సతియగు రాధ కొసఁగెను. ఆ దంపతు లనపత్యు లగుటచే నా బాలు నెక్కువ మక్కువతోఁ బెంచిరి ఆ కుమారుఁడు కర్ణుఁడను నామమునఁ బరఁగెను.

కుంతియు మాద్రియుఁ దనకు నంతసముఁ గూర్చుచుండఁ బాండునృపాలుఁడు ప్రజారంజకుఁడై వర్తించుచు, దిగ్విజయము సేసి యపరిమితధనరాసులం దెచ్చి ధృతరాష్ట్రునిచే ననేకాశ్వమేధయాగములు చేయించెను.

అనంతర మొకనాఁడు పాండురాజు నిజాంగనలం గూడి మృగ
యావినోదార్థియై కాంతారమున కరిగి, క్రీడాసక్తమై యున్న
మృగ మిథునము నవలోకించి బాణములం బ్రయోగించి యా
కురంగద్వయమును ద్రెళ్ళనేసెను. అంత నా మిథునమునం
దల్పావశిష్టజీవంబై యొక మృగము పాండురాజు నవలోకించి
"రాజా, నేను కిందముఁడను ఋషిని. ఈలేఁడి నా సహధర్మిణి.
వినోదార్థము మే మీ హరిణరూపములు దాల్చి, యొరుల
కేమియు నపకారముఁ జేయక యిచ్చోట విహరించుచుంటిమి. నిర
పరాధుల మగు మమ్ము నిర్దయుండవై చంపితివి. కావున నీవును
భామినులను సమీపించినప్పుడు పంచత్వము నొందెదవు"
అని శపించి ప్రాణములు విడిచెను. జీవములం బాసిన యా
హరిణద్వయమును గాంచి పాండురాజు విషాదమనస్కుఁడై
యరిగి తన శాపవృత్తాంతము నిజసతులకుఁ దెలిపి, "నేనిక
సర్వసంగపరిత్యాగినై, కందమూలఫలాశనుఁడనై విపినమున
దపము సేయుచుండెదను: మీరలు హస్తినాపురమున కేఁగి,
భీష్మధృతరాష్ట్రాదులచే సంరక్షితలై యచట నుండుఁడు."
అని చెప్పెను. "మహీపాలోత్తమా! మేము నిన్ను విడిచి
హస్తినాపురమున కరుగఁజాలము. మేము నీచెంత నుండ నంగీక
రింపుము. లేనిచోఁ బ్రాణములు పరిత్యజింతుము." అనుచు
నప్పతివ్రతాశిరోమణులు బాష్పపూరితనయనలై ప్రార్థింపఁ
బాండుభూపాలుఁడు వారలఁ దనచెంత నుంచుకొన నంగీకరించి,
జటావల్కలధారియై వానప్రస్థాశ్రమము స్వీకరించి, తపస్వి

వేషములందాల్చిన నిజాంగనలను దోడ్కొని శతశృంగ పర్వత మున కరిగి యచ్చటఁ దపము సేయుచుండెను.

అట్లుండి యొకనాఁడు బ్రహ్మలోకమున కేగుచున్న తాప సోత్తములను గాంచి పాండురాజు "మునివరేణ్యులారా, మీర లెట కేగుచుంటి?" రని యడుగ, వారలు "నేఁడమ వస గావునఁ గమలజునిఁ గొలువ నేఁగుచుంటిమి. నేఁ డచటికి ఋషులును, పితృదేవతలును నరుదెంతురు," అని చెప్పిరి. అంతటఁ బాండుమహీశుఁడును భార్యాసమేతుఁడై యత్తాప సులవెంట నేఁగుచుండ వారలు "రాజా! ఇవి దేవపథములు; మీర లచటికి రాఁజాలరు. ఇట నిలువుఁడు," అని వచించిరి. అప్పుడు పాండురాజు "అపుత్రస్య గతి ర్నాస్తి" యను వచ నమును దలఁచి "తాపసోత్తములారా, నే నపుత్త్రికుఁడను. నాకుఁ బుణ్యలోకప్రాప్తి యెట్లు చేకూఱు" నని చింతింప నమ్మునులు యోగదృష్టింజూచి "రాజా! నీ వపుత్త్రికుఁడవు గావు. ధర్మానిలశక్రాశ్వినుల వరమునఁ దనూజులం బడయు దువు. సంతానార్థము యత్నము సేయుము," అని చెప్పి యరిగిరి.

అనంతర మొకనాఁడు పాండుమహీశుఁడు కుంతినిఁగాంచి "సుదతీ! పుత్త్రహీనులకుఁ బుణ్యలోకములు సేకూరవు. అన్మన్ని యోగమున, ధర్మమార్గమున నీవు క్షేత్రజులగు సుతులను బడసిన నేను బుత్త్రవంతుఁడనై పుణ్యలోకములు

వడయఁగలవాఁడను," అని వచింప, నప్పతివ్రతాశిరోమణి "దేవా! పిన్నతనమున దుర్వాసమునీంద్రుఁడు నా కొక మంత్రరాజము నుపదేశించెను. ఆ మంత్రమున నే దేవు నారాధించిన నా దేవుఁ డరుదెంచి యభిమతముఁ దీర్చు; ఇప్పు డే వేల్పు నారాధింతునో యానతీయుఁడు." అని యడిగెను. అప్పుడు పాండురాజు "తన్వీ, ధర్మదేవత నారాధింపుము," అని యాజ్ఞాపింప, గుంతి సమాహితచిత్తయై య ద్దేవు నారాధించెను. అప్పుడు ధర్ముఁడు యోగమూర్తిధరుఁడై వచ్చివరమొసఁగఁ గుంతి తత్ప్రసాదమున గర్భముఁ దాల్చి, నవమాసములు గడచినపిమ్మట శుభముహూర్తమున బాలార్కప్రతిముఁడగు కుమారునిఁ గనియె. ఆ కుమారునిఁ గాంచి పాండురాజు హర్షపరిప్లుతాంతరంగుఁ డయ్యెను. ఆకాశవాణి యా బాలునకు యుధిష్ఠిరుఁడని పేరిడెను.

అంతకుమున్నె గాంధారియు గర్భవతియై యొక్క వత్సరముగడచినను బ్రసూతికానందున నామె యుధిష్ఠిరుని జననము విని యుదర తాడనము సేసికొన గర్భపాతం బయ్యెను. అప్పుడు వ్యాసమునీంద్రుఁ డరుదెంచి "ఇట్లేల సేసితి" వని గాంధారిపయిఁ గోపించి, యామె కుదయించిన మాంసపేశి నేకోత్తరశతఖండములుగా విభాగించి వానిని ఘృతకుండములం బెట్టించి "వీనిని శీతలోదకములతోఁ దడుపుచుగా పాడుచుండుఁడు. వీనినుండి నూర్వురుకొమరులు, నొక్క కొమరితయుఁ జనింతురు," అని చెప్పి వెడలిపోయెను.

గాంధారీధృతరాష్ట్రులు మునివచనానుసారముగా నాఖండము లను గాపాడుచుండిరి.

అనంతరము శతశృంగమునఁ బాండురాజు కుంతీదేవినిఁ గాంచి " కుంతీ! అనిలదేవు నారాధించి బలశాలియగు మఱి యొక తనయునిఁ గాంచుము," అని యాజ్ఞాపింప నామె సమాహితచిత్తయై యద్దేవు నారాధించి గర్భముఁదాల్చి కుమారునిఁ గాంచెను. అశరీరవాణి యాబాలునకు భీమ సేనుఁడని పేరుఁ బెట్టెను.

భీమసేనుఁ డుదయించిన దినముననే హాస్తిపురమునఁ ఘృతఘటములోఁ బెట్టిన మాంసఖండమునుండి దుర్యోధనుఁ డనుసుతుఁడు గాంధారీ ధృతరాష్ట్రులకు జనించెను. పిమ్మటఁ గ్రమమున నాఖండములనుండి దుశ్శాసనాదితనయులు నూర్వు రును, దుస్సలయను తనూజయు నుదయించిరి.

అనంతరము పాండురాజు తన కింక నుపుత్రులం బడయ నభిమతము గలదనియు, దేవేంద్రు నారాధించి త్రిలోక విజయుఁడగు సుతు నింకొకనిఁ బడయుమనియు నానతీయఁ బృథాదేవి సురరాజు నారాధించి మఱియొక తనూజునిఁ గాంచెను. ఆ కుమారునకు దివ్యవాణి యర్జునుఁడని నామ మిడెను.

కుంతియు, గాంధారియుఁ బుత్రులం గాంచుటఁ జూచి తాను సంతానహీనయైనందులకు మాద్రి చింతింపఁ బాండు భూపాలుఁ డామె నోదార్చి, కుంతీదేవినిఁ బిలిచి "తన్వీ!

అప్పుడు దుర్యోధనుఁడు శిల్పకళావిశారదుఁడును, తనకుఁ బ్రియసఖుఁడును నైన పురోచనుఁ డనువానిం బిలిచి "చెలికాఁడా! నీ శిల్పనైపుణ్యము మెఱయ వారణావతమున నాయుధాగార సమీపమున, లాక్షాసర్జరస సమ్మిశ్రమై ఘృతతైలార్ద్రమైన మృత్తికాపుంజముతో చతుశ్శాల నతి రమణీయముగా నిర్మించి, పాండవుల నందునిచి, వారలు నిన్ను విశ్వసించి యందుఁ గొంతకాలము నివసించిన పిమ్మటఁ దగు సమయమున నాగృహము దగ్ధముసేసి పగతురం జంపి రమ్ము. శీఘ్రముగాఁ బొమ్ము" అని చెప్పి యాతని నంపెను.

అనంతర మొక శుభదినంబునఁ బాండవులు భీష్మ ద్రోణ విదుర ధృతరాష్ట్రుల దీవనలఁ గైకొని జననీ భృత్యామాత్య యుతముగా వారణావతమునకుఁ బయనమైరి. అప్పటికి యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులు క్రమంబున నిరువది తొమ్మిది, యిరువదియెనిమిది, యిరువదియేడు, యిరువది యాఱు, యిరువదయైదు వత్సరముల ప్రాయముగలవారై యుండిరి.

పాండునందనులు రథారూఢులై వారణావతమున కేఁగుచుండఁ బౌరు లెల్లఱును శోకసంతప్తహృదయులై "కుటిల చిత్తుఁడగు ధృతరాష్ట్రుఁ డేలకో యి కుమార రత్నములను బురము వెడల ననుపుచుండె! మనమును వీరలతోఁ బోయి

వారణావతముననే నివసింతము,'' అని పలుకుచు వారల వెంట రాసాగిరి. యుధిష్ఠిరుఁడు వారల గాంచి, "పిత్రాజ్ఞోల్లంఘనము ధర్మవిరుద్ధము; కావున నేను వారణావతమున కేఁగి కొంతకాలము నివసించి వచ్చెద; మీర లిచ్చటనే యుండుఁడు,'' అని చెప్పి వారలను మరలించెను. పాండవులపై విదురున కపారప్రేమము గలదు. అందువలన నతఁడు వారలతోఁ జాల దూర మరిగి పాండుమహీశునిఁ దలఁచి బాష్పపూరితలోచనుఁడై, యుధిష్ఠిరు నాలింగనము చేసికొని "కుమారా! వారణావతమున మీర లధిక జాగరూకులై యుండవలయును; ఏమఱిచో విషాగ్నులవలనఁ బ్రమాదము సంభవించును; నే నిచటనుండి దుర్యోధను దురాలోచనలు చక్కఁగ నెఱిఁగి, వానికిఁ బ్రతీకారము చెప్పి పంపెదను." అని చెప్పి, దీవించి మరలిపోయెను. పాండునందనులు విదురుని యవ్యాజప్రేమకు సంతసించుచు వారణావతమున కేఁగిరి.

వారణావత నివాసులు పాండవాగమనము విని హర్షావేశముతో నెదుర్కొని రాజప్రాసాదమునకు వారిం దోడ్కొని పోయిరి.

పిమ్మట నొకనాఁడు పురోచనుఁడు, నయనాభిరామముగాఁ దానునిర్మించిన చతుశ్శాలను పాండవులకుఁ జూపింప, వారలు దాని రామణీయతకుఁ గడు సంతస మొంది, పురోచనుని సన్మానించి శుభదినమున గృహప్రవేశము చేసిరి. పిమ్మట నొకనాఁడు యుధిష్ఠిరుఁ డా సౌధమును జక్కఁగఁ బరిశీలించి

య్యెను యశోవైభవాతిశయమున సార్వభౌమునివలె ప్రకాశించుచుండెను. నిరంతరము ధర్మానురక్తుఁడై వర్తించుచుండుటచే నాతనికి ధర్మరాజని పేరుకలిగెను. ప్రజలెల్లరు నాసహోదరుల పరస్పర ప్రేమాధిక్యమును, ధర్మశీలమును, పరాక్రమమును వేనోళ్ళఁ బొగడుచుండ, వారలఁ గాంచి భీష్మ ద్రోణ విదురాదులు సంతోషాంబుధి నోలలాడుచుండిరి.

దిగంత విశ్రాంతమైన యుధిష్ఠిరుని యశంబు విని సహింపనోపక దుర్యోధనుఁ డొకనాఁ డేకాంతమున ధృతరాష్ట్రునిఁ గాంచి "తండ్రీ! నీవు యుధిష్ఠిరుని యువరాజుఁ జేసినదాదిగా ప్రజలెల్ల రాతని కనురక్తులై "ఈధర్మశీలునకే రాజ్యాధిపత్య మొసంగినఁ బుడమిపై ధర్మము వర్ధిల్లజేయు" ననుచు నాలోచించుచుండిరి. ఈ పలుకులు శూలములవలె నన్ను బాధించుచున్నవి. కావున నిప్పుడు పాండవుల నీ పురము వెడలననుపుము" అని వచింప, ధృతరాష్ట్రుఁడు "కుమారా! అంధుఁడనైన నన్ను రాజుగా నంగీకరించి తన బాహుబలమున నరపతుల జయించి కప్పములు దెచ్చి నాకొసఁగుచు నాయెడ నధికభక్తితో వర్తించిన తమ్ముని కొమరుల నిప్పు డెవ్విధమున వెడలఁగొట్టుదు!" ననుచు కొంచెము దుఃఖించెను. అంతట దుర్యోధనుఁడు "జనకా! పాండుభూపతి మున్ను రాజ్యము నతి నిపుణముగాఁ గాపాడుటవలన నిప్పుడు ప్రజలెల్ల రాతని తనయునే సార్వభౌముం జేయవలె నను

చున్నారు. యుధిష్ఠిరుఁ డిప్పుడు రాజ్యనాథుఁ డయ్యెనేనిఁ క్రమముగా నిక్కడ యాతని పుత్రపౌత్రులు రాజ్యార్హులౌదురు. మేమును మాసంతతియును వారలఁ గొలిచి బ్రదుకుచుండ వలయును. కావున నీవిప్పుడు పాండురాజునందలి తొల్లిఁటి ప్రేమఁ దలఁపక, జననీ సహితముగాఁ బాండవులను వారణావతపురమున కనుపుము. నేను దాన సన్మానములచేఁ బ్రజలం దృప్తులంజేసి వారల యనురాగము వడసి, యుధిష్ఠిరుని మఱచునట్లు వర్తించెదను. తొల్లి పాండురాజు నిన్నే భూనాథుగా నంగీకరించెఁ గావున నాక్రమంబున నిప్పుడు సార్వభౌమపదమునకే నర్హుఁడ నయ్యెదను. రాజ్యము సుప్రతిష్ఠిత మైనపిమ్మటఁ బాండు నందనులను మరల నిచటికి రావింత" మని చెప్పి యెట్టకేలకు ధృతరాష్ట్రునకు వారలపై ననూయం గలిగించి వారిని వారణావతపురమున కనుప నొడఁబఱచెను.

పిమ్మట నొకనాఁడు ధృతరాష్ట్రుఁడు పాండవులను బిలిచి "కుమారులారా! పాండునికంటెను మీరలు నాయెడఁ గడు భక్తితో వర్తించుచుండుటచే సంతుష్టాంతరంగుఁడనై మిమ్ముల నిప్పుడు సర్వసుఖాస్పదమైన వారణావతపురమున కనుప నెంచితిని. జనని సహితముగా మీరలచటి కరిగి, పశుపతినివాసంబైన యప్పుణ్యస్థానమునఁ బితృహితార్థము గోభూహిరణ్యాది మహాదానములుచేసి, భృత్యామాత్యవర్గముతో నటఁ గొంతకాలము నివసించి రండు," అని యాన తీయఁ బాండునందను లందుల కంగీకరించిరి.

మాయోపాయములచే నందు దగ్ధులైరి." అనుచు విలపించి, యవ్వార్త ధృతరాష్ట్రునకుఁ దెలియఁ బఱచిరి. పాండవులు మరణించిరని విని ధృతరాష్ట్ర భీష్మద్రోణులును, పౌరులును మిక్కుటముగా విలపించిరి. దుర్యోధనాదులు పాండవుల మరణమునకు సంతసించి, ప్రియమిత్రుఁడయిన పురోచనుఁడు మృతుఁడైనందుల కింతయుఁ జింతించిరి. ధృతరాష్ట్రుఁడు పాండవులకు గంగాతీరమున నుత్తరక్రియలు జేయించెను. ఖనకుఁడా బిలమును మరల నతి రహస్యముగాఁ బూడ్చి హస్తినాపురమున కరుదెంచి పాండవుల కుశలమును విదురున కెఱిఁగించెను.

అట బిలమార్గమునఁ బోయిన పాండవులు భాగీరథి దాటి దక్షిణాభిముఖులై గహనమున నరుగుచు నధికక్షుత్పిపాసా పరవశులై నడువనోపక యుండ మారుతాత్మజుండు వారి నందఱి నెత్తుకొని వాయువేగమునఁ జని సాయాహ్నమున నొక మహీరుహమునీడను విశ్రమింపఁజేసి, తాను సరో వరమునకుఁ జని జలపానము చేసి, జననీ సహోదరులకొఱకుఁ గమలపత్రపుటికలనిండ నీరము గైకొని వచ్చెను. కుంతీ ధర్మార్జున నకులసహదేవులు పథశ్రాంతులై తమ తమ వస్త్రంబుల నా వటవృక్షము క్రిందఁ బఱచుకొని నిద్రించు చుండ భీమసేనుఁడు కావలి గాచుచు, తమకు సంభవించిన దురవస్థను దలంచి చింతాక్రాంత మనస్కుఁడై యుండెను. అప్పుడు హిడింబుఁడను రక్కసుఁడు దూరమునుండి పాండవు

లం గాంచి, "చిరకాలమునకు మంచి యాహారము లభించె" నని సంతసించి తన చెలియలగు హిడింబను బిలిచి "నీవు సత్వర మా వటవృక్షము కడ కేఁగి యచట శయనించిన మానవులం జంపి తెమ్ము. నరమాంస భక్షణము జేసి చాల కాలమయ్యె" నని చెప్పి పంపించెను.

పాండవులం జంప నరుదెంచిన హిడింబ భీముని గాంచి సంతనే మరులుగొని వధింపనొల్లక యాతని కడకువచ్చి "పురుషవరేణ్యా! ఈ వనము నా యగ్రజుఁడగు హిడింబా సురునిది. ఇచ్చటికి మనుజులు రా వెఱతురు. మానవు లీ వనము సొచ్చి వెలువడిన, జమునికుత్తుకం జొచ్చి వెలువడినట్లు సంత సింపవలయును; నామనము నీయందు లగ్నమగుటచే నిట్లు హితము గఱపుచుంటిని; హిడింబుఁ డిచ్చటికి రాకమున్నె నీసోదరులను ప్రబోధింపుము. నేను త్వరితముగ మిమ్మందఱిని మఱియొక వనమున కెత్తుకొనిపోయి రక్షించెద" నని వచింప, భీమసేనుఁడు "ఒక్క హిడింబుఁడే గాదు; సురాసురు లేకమై వచ్చినను వీరి సుఖనిద్రకు భంగము, గలుగఁ జేయకనే నెదుర్కొని యుద్ధము చేయనోపుదు" నని పలికెను.

అంతలో హిడింబుఁడు తన సోదరి జాగుసేయుచుండెనని యుగ్రుఁడై రాఁగా హిడింబ భయాక్రాంతచిత్తయై భీముని మఱుగుఁజొచ్చెను. అంతట భీముఁడు వాని నెదుర్కొని ఘోరముగ మల్లయుద్ధముజేసి వానిని జముని వీటికిఁ బంపెను. హిడింబాసురుఁ డిడిన కేకలకు కుంతీ యుధిష్ఠి రార్జున

తమ్ములం బిలిచి "అనుజులారా! ఈ గృహకుడ్యము లాజ్య తైల లాక్షాగంధగర్భములు; మఱియు నిది శస్త్రాగారసమీప మునఁ గట్టఁబడుటచే మాయాగృహ మగుట నిశ్చయము. కుశాగ్రబుద్ధియగు విదురుఁడు దీని నెఱిఁగియే "విషాగ్నులవలన జాగరూకులై యుండుఁ" డని మనకు బోధించెను. కావున మన కిచ్చటఁ దప్పక నగ్నిభయము నేకూరు" నని చెప్పెను. "అగ్రజా! మన మీ పాపగృహము నిప్పుడే పురోచన సహితముగా దగ్ధముచేసి, ముందున్న మందిరమున నివ సింతము," అని తమ్ములు వచింప ధర్మరాజు "తమ్ములారా! అట్లాచరించితిమేని, యెవ్విధంబున నైన మన కపాయము చేయ నమకట్టి దుర్యోధనుఁ డింకొక యుపాయముఁ బన్ని మనలఁ బంపును. కావున దీని రహస్యమును మన మెఱుఁగ నట్లు నటించుచు నిచ్చటనే కడు జాగరూకతతో నుండ వలయు" నని పలికెను. పురోచనప్రేరితయై నిషాదవనిత యొకతె పుత్రపంచకముతో వచ్చి కుంతీదేవి నెల్లపుడు సేవిం చుచు, పాండవు లొనరించు కార్యములను బురోచనునకుఁ దెలుపుచుండెను.

ఇట్లాఱుమాసములు గడచిన పిమ్మట నొకనాఁడు హస్తి పురమునుండి విదురునిచేఁ బంపఁబడిన ఖనకుఁ డొకఁ డేతెంచి రహస్యముగఁ బాండవులంజూచి "ఈ కృష్ణచతుర్దశి నాఁటిరాత్రి పురోచనుఁ డీ గృహమున దహనము దరిగొల్పును; మీర లిటనుండి వెడలిపోవుటకు రహస్యముగా బిలము

సేయ విదురుఁడు నన్నుఁ బంపె" నని చెప్పి యతి రహస్య ముగ నొక సొరంగము ద్రవ్వి వారలచే నన్మానితుఁ డయ్యెను.

అంతఁ గృష్ణచతుర్దశినాఁడు పృథాదేవి యప్పురమందలి బీదల నందఱిని బిలిపించి యిష్టాన్నదానములచేఁ దుష్టి నొం దించెను. నాఁటి యుత్సవమున నా నిషాదవనితయు, నేవురు సుతులును గాలచోదితులై యధిక మధుపానము చేసి మత్తుచే నొడ లెఱుఁగక యా లక్కయింటఁ బరుండి నిద్రించిరి. అర్ధ రాత్రమైనతోడనే భీమసేనుఁడు లేచి, పురోచనుఁడు సేయఁ బూనిన కార్యముఁ దానే సేయనెంచి, యాకుటిలుని శయన గృహద్వారమున ఘోరానలము దరిగొల్పి, ఖనకునకుఁ దమ కుశలగమనము నెఱిఁగించి, జననీసహోదరులతో బిల ప్రవిష్టుఁ డయ్యెను. అప్పుడు కుంతీ ధర్మార్జున నకులసహదేవులు నిద్రాభారముచే నా బిలమునఁ ద్వరితముగ నడువఁ జాలక యుండ భీమసేనుఁడు వారలఁ దన భుజద్వయముపై నెక్కించు కొని యతి త్వరితగమనమున నేఁగెను.

ఇటుఁ బురోచనసహితముగా లాక్షాగృహమును, నాయుధా గారమును వాలుతాళినన కళనం బగుటఁ జూచి వారణావత నివాసులు భయభ్రాంతులై గుంపుగూడి వచ్చి, యా భస్మ రాశియం దేవురు సుతులతోఁ జచ్చిపడియున్న నిషాదవనితం జూచి, కుంతియుఁ గుమారులు మృతినొందిరని భావించి "అక్కటా! ధర్మమూర్తులైన పాండవులు, ధార్తరాష్ట్రుల

ములఁ బెకలించుచుఁ, జిన్నతనముగుటచే నతిధూర్తతతో సంచరించెను. అందువలన ధార్తరాష్ట్రులతనియెడఁ గ్రోధముగలవారై, యొకనాఁ డతఁడు నిద్రించుచుండ ఘనపాశములచే నంటఁగట్టించి గంగాజలమునఁ ద్రోయించిరి. అంతట మహాబలశాలియగు వాయునందనుఁడు మేల్కాంచి యొడలు విఱువ నాబంధములన్నియుఁ దెగిపోయెను; సంతసముతో నతఁడు బయట కేతెంచి సహోదరులం గలిసికొనెను. మరల నొకనాఁడు పవనతనూజుఁడు నిద్రించుతఱిఁ గృష్ణోరగములచేఁ గఱపింప నవి యాతని వజ్రదేహమును గఱవలేక పోయెను. మఱియొకనాఁ డతిరహస్యముగా నన్నమున విషముఁగలిపి పెట్టింప నది యమ్మహాసత్త్వున కమృతాన్నము వగిది జీర్ణమయ్యెను. తమ ప్రయత్నము లన్నియు నిట్లు విఫలములగుటచే దుర్యోధన, దుశ్శాసనాదులు సిగ్గునొందియు, మరల నెవ్విధముననైనఁ బాండవపంచకమును గడతేర్పు నుపాయమును దమ మేనమామయగు శకునితో రహస్యముగ నాలోచించుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు పాండవధార్తరాష్ట్రులెల్లఱుఁ గ్రీడాపరులై పురబాహ్యప్రదేశమున నాటలాడుచుండఁ గాంచన కందుకము నూతిలోఁ బడెను. దానిం దీయునుపాయము నెఱుఁగక నాకుమారులెల్లఱు నిలిచి చూచుచుండ, నవ్వాడమార్గమున నేఁగుచున్న ద్రోణాచార్యుఁడను విప్రుఁ డది చూచి తన ధనుర్విద్యాకౌశలమున దానిని దీసి యిచ్చెను.

కురుకుమారులు దానిం గైకొని సంతోషితస్వాంతులై యా భూసురోత్తమునిఁ దమ పితామహునిపాలికిఁ దోడ్కొని పోయి జరిగినవృత్తాంతము నెఱింగించిరి.

గాంగేయుఁడు ద్రోణుని సన్మానించి "మహాత్మా! ఎట నుండి వచ్చుచుంటిరి?" అని యడుగ "కురువంశోత్తమా! అగ్నివేశుఁ డను మునివరునికడ నేనును, ద్రుపదుఁడును ధనుర్వేదము నభ్యసించితిమి. అప్పుడు మాకిరువురకుఁ గడు స్నేహమయ్యెను. కొంతకాలమున కా ద్రుపదుఁడు పాంచాల రాజ్యాధిపత్యము వహింప నేఁగుచు నన్నుఁ గాంచి 'చెలువుఁడా; నీకు ధనధాన్యములు గావలసినప్పుడు నాయొద్దకు రమ్ము.' అని చెప్పి చనియెను. అనంతరము నేను కృపాచార్యుని చెలియలు కృపిని వివాహమాడి యశ్వత్థామయను నందనుం బడసితిని. ఆ బాలుఁడు పాలుద్రావుట కావును దెమ్మని యేడ్చుచుండ నా బాల్యసఖుఁడైన ద్రుపదునికడకు గోవు నడుగ నేఁగితిని; అతఁడు రాజ్యమదాంధుఁడై "నేను భూపాలుఁడను; నీవు పేదపాఱుఁడవు; నీతో నాకెక్కడి సఖ్యము?" అని యవమానించెను. అంతట నేను వేఱొక భూనాథు నాశ్రయించి వాని కోర్కెఁ దీర్పనెంచి వచ్చుచున్నాను." అని ద్రోణుఁడు తన వృత్తాంతమును విశదీకరించెను. అంతట శాంతనవుఁ డాభూసురునకుఁ గావలసిన యర్థంబుల నొసఁగి "మహనీయా, మీ రిచట నివసించుచు నామనుమల కందఱికిని రాజవిద్యలఁ గఱపుఁడు;" అని ప్రార్థింప ద్రోణుఁ డందుల కానంద మొంది-

అశ్వినీదేవతలవలన మాద్రికి సంతతిఁ గలిగింపుము," అని వచించెను. అంత నామె యద్దేవతల నారాధింప నవ్వేల్పుల వరమున మాద్రి గర్భవతియై సుతద్వయమును గాంచెను. ఆకాశవాణి యక్కుమారులకు నకుల, సహదేవులని పేరుఁ బెట్టెను. శుక్లపక్ష సుధాకరుని చందమున నక్కుమార పంచకంబు దినదినాభివృద్ధి నొందుచు జననీజనకులను సంతసింపఁజేయుచుండెను. పాండుభూమీశుఁడు వారలకుఁ జౌలోపనయనములు చేయించి వేదాధ్యయనముఁ జేయించుచుండెను.

అట్లుండ నొక నాఁడు పాండుమహీశుఁడు మాద్రిమనోహరాకృతియందుఁ జిత్తమునిలిపి, మునిశాపమును దెలిపి యాసాధ్వి వారించిన వినక విధిప్రేరితుఁడై బలవంతముగ నామెం దాకి విగతజీవుఁ డయ్యెను. అప్పుడు మాద్రి యాక్రందనము సేయఁ గుంతియుఁ, గుమారులు నరుదెంచి భూనాథునిఁ గాంచి విలపింపసాగిరి. అప్పుడు పృథాదేవి సహగమనము సేయఁబోవ, మాద్రి "అక్కా, నేనిక్కుమారులను జాగరూకతతోఁ బోషింపఁజాలను. ధీశాలివగు నీ విక్కుమార పంచకంబును గాపాడుచుండుము. నేను పతితోడఁ బరలోకమున కరిగెద" నని చెప్పి నిజనందనులను గుంతి కప్పగించి యామె సహగమనము చేసెను. అంత నయ్యాశ్రమవాసులగు మునులెల్ల నరుదెంచి కుంతినిఁ గుమారులను నూరార్చి వారలను హస్తిపురమునకుఁ దోడ్కొనిపోయి, భీష్మ

ధృతరాష్ట్ర విదురాదులకుఁ బాండుమహీశుని మరణవృత్తాంతము, దెలిపి కుంతీకుమారులను వారల కప్పగించి చనిరి. ధృతరాష్ట్రాదులు పాండురాజవియోగమునకు దుఃఖితులై, శోకపూరిత మానసయైన కుంతిని, కుమారపంచకమును నోదార్చి వారల నతిప్రియమునఁ గాపాడుచుండిరి. అనంతరమొకనాఁడు వ్యాసమునీంద్రుఁ డరుదెంచి ధృతరాష్ట్రాదులకు దుఃఖోపశమనంబు నేసి యేకాంతమున సత్యవతినిఁ గాంచి "జననీ! ధృతరాష్ట్ర తనూజులు దుర్మార్గవర్తనులయ్యెదరు; వీరలవలనఁ గులక్షయంబగును. మీర లిటనున్నచో నీదుఃఖము ననుభవింపవలయుఁ గావున నిప్పుడే తపోవనమున కేఁగుట యుక్తము" అని వచింప, నామె యవ్వార్త భీష్మునకుఁ దెలిపి, కోడండ్రం దోడ్కొని తపోవనమున కేఁగెను. వారు మువ్వురును గొంతకాలము తప మాచరించి పిమ్మట శరీరములం ద్యజించిరి.

ఇట ధృతరాష్ట్రుఁడు తన సుతులను, బాండుసుతులను సమభావమునఁ బోషించుచుండఁ, గుంతీదేవియుఁ దనపుత్రులను సవతిపుత్రులను సమభావమునఁ గాపాడుచుండఁ గుమారులందఱు దినక్రమాభివృద్ధు లగుచుండిరి. ఆ రాజనందనులందఱిలో భీమసేనుఁడు మిగుల బలవంతుఁడై యుండెను. అతఁడు జలక్రీడలాడుసమయమునఁ దన భుజములపై ధార్తరాష్ట్రులం బలువుర నెక్కించుకొని నీట ముంచుచు నెత్తుచు, వారలు ఫలార్థులై వృక్షములెక్క నప్పుడు దా నప్పాదపం

నెల్లవారును జూడంగ నీక్షణంబ
రాజుఁ జేసెద నే నంగరాజ్య మిచ్చి.

అని పలికి భీష్మ ధృతరాష్ట్రుల యనుమతి వడసి కర్ణునిఁ గాంచన పీఠమున నునిచి యంగరాజ్యమున కభిషిక్తుం జేసెను. తన యవమానముఁ బాపి రాజుఁ జేసినందుల కమందానంద మొందె కర్ణుఁడు దుర్యోధనునికొఱకు తన ప్రాణములైన నసీయ దృఢనిశ్చితుఁడై యాతనితోఁ జెలిమి సేయ నొడఁబడియెను. అప్పుడు రాజ్యాభిషిక్తుఁడైన కొమరునిఁ గని సూతుఁడు హర్ష పూరితాంతఃకరణుఁడై వచ్చి యాతని నాలింగనము సేసికొన, నెల్లరుఁ గర్ణుని సూతసుతునిగా నెఱింగిరి. అప్పుడు వాతాత్మజుఁడు కర్ణునిఁ గని "సూతసుతుఁడవగు నీవు రాజ్యాభిషేకమున కనర్హుఁడవు. నీ కులవృత్తి ననుసరించి రథసారథ్యము సేయుచుండుము." అని పలుకి దుర్యోధనుఁ డలిగి "దివ్య లక్షణ లక్షితుఁడగు నిమ్మహాపురుషుఁడు సూతకులసంభవుఁడు గాఁడు. మహాత్ముల జన్మరహస్యముల నెఱుంగ నొరుల కల వియే! వీరవరేణ్యుఁడగు కర్ణుఁడీ యంగరాజ్యంబునకే గాదు సకలమహీరాజ్యంబున కర్హుఁడైనవాఁడు." అని చెప్పి, యప్పటికి సరోజమిత్రుఁ డస్తాద్రిం జేరుటచేఁ గర్ణునిఁ దోడ్కొని నిజమందిరమున కరిగెను. అంతట సభఁ జాలించి యందఱుఁ దమతమ నిలయముల కేగిరి.

మఱునాఁడాచార్యుఁడు శిష్యుల నందఱినిఁ బిలిచి "నాకు గురుదక్షిణ యొసఁగుఁ"డని యడుగ వారలు బద్ధాంజలులై

"గురువరా! తమ యభీష్టముఁ దెలుపుఁ"డనిరి. "మున్ను నన్నవమానించిన పాంచాల మహీశునిఁ బట్టి తెం" డని ద్రోణాచార్యుఁడు వచించెను. వెంటనే ధార్తరాష్ట్రులెల్ల రాయుధపాణులై యరిగి ద్రుపదు పురంబును ముట్టడింపఁ బాంచాల భూపతి శరవర్షంబుఁ గురియించి వారలఁ జిందర వందర గావించెను. ద్రుపదుని ధాటికి కోర్వఁజాలక ధార్తరాష్ట్రులు మరలి వచ్చిరి. పిమ్మట నర్జునుఁడే లేచి యాచార్యుని సెలవు గైకొని పాంచాలమున కేఁగుచుండ భీమసేనుఁడు మాద్రేయులు నాతనివెంట నేఁగిరి. ఆసోదర చతుష్టయము ద్రుపదపురము ముట్టడించి వైరి బలంబులఁ జెండాడుచుండ ద్రుపదుఁడు వారల నెదుర్కొనియె. అప్పుడు పార్థుఁడాతనిపై నిశిత సాయకంబులఁ బ్రయోగించి చీకాకుఁబఱచి యమ్మహీనాథుని బట్టి బంధించి గురుసన్నిధానంబునకుఁ దెచ్చెను. "మహారాజా! నా శిష్యునిచే నిట్లు బద్ధుఁడవైతి వేల? ఇప్పుడైన ధనమదాంధ్యము విడిచి నన్ను గుర్తించితివా?" అనుచు ద్రోణుఁ డాతని నవమానించి విడిచిపెట్టి శిష్యునిపరాక్రమమునకుఁ బరమానందమొంది యతనికి మఱికొన్ని దివ్యాస్త్రముల నొసంగెను.

అనంతరము ధృతరాష్ట్రుఁడు భీష్మ విదురులతో నాలోచించి యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషిక్తుం జేసెను. తమ్ములు నలుగురును మదోన్మత్తులైన భూపాలుర జయించి ధనరాసు లందెచ్చియిచ్చుచుండ యుధిష్ఠిరుఁడు పేరునకు యువరాజ

రాజనందనులకుఁ విద్యఁ గఱపుచు నాఁటనుండి యచటనే నివసించుచుండెను.

ఆ రాజకుమారులందఱిలో నర్జునుఁడు విలువిద్యయం దధిక ప్రావీణ్యముఁ గనుపఱచుచుండుటచే నాచార్యుఁ డాతనిమెడఁ బ్రీతుఁడై యనేక దివ్యాస్త్రంబుల నుపదేశించెను. కుమారు లందఱును రాజవిద్యల నాఱితేఱినపిమ్మట నొకనాఁడు వారల విద్యాకౌశలమును భీష్మ ధృతరాష్ట్రాదులకుఁ జూపనెంచి యాచార్యుఁడు శిష్యులనందఱిని సభాంతరమునకుఁ దోడ్కొని వచ్చెను. అంతట గదాయుద్ధవిశారదులైన భీమ, దుర్యోధనులు కొంతతడవా యోధనము సేసి తమ గదాయుద్ధకౌశలముం గనుఁబఱచి సభ్యులానందింపఁ జేసిరి. పిమ్మట రాజపుత్రు లెల్లరును దాము నేర్చినవిద్యలం జూపి సభ్యుల మెప్పుఁ గాంచిరి. అనంతర మాచార్యుఁడు "నా ప్రియశిష్యుఁడైన పాండవమధ్యముని ధనుఃకౌశలముఁ జూడుఁ" డనుచుండ నర్జునుఁడు లేచి, యాగ్నేయ వారుణాది దివ్యాస్త్రములం జూపి సభాసదులను హర్షింపఁ జేసెను. పాండవమధ్యముని ధనుఃకౌశలముఁగాంచి సభ్యు లందఱును, హర్షితులైరిగాని, దుర్యోధనుఁడును నాతని యనుజన్ములును గడు నసూయాగ్రస్తులైరి.

ఆసమయమున నచటికిఁ గర్ణుఁ డరుదెంచి భుజాస్ఫాలనము సేయుచు నవ్యసాచిం గని "నేనే విలువిద్యయం దగ్రగణ్యుఁడని గర్వితుఁడవుగావలదు. నీవుచేసిన పనులనెల్ల నేనుగూడఁ జేసి సభ్యులఁ మెప్పించెదఁ జూడుము." అనుచు గంభీరవాక్యము

లాడి యర్జునుఁడు చూపిన విద్యలన్నియుఁ దానును జూపి సభ్యులను విస్మితులంజేసెను. అదిగాంచి దుర్యోధనుఁడు ప్రమోదభరిత మానసుఁడై కర్ణుని గౌఁగిలించుకొని "వీరవరేణ్యా! నీవు నాతో సఖ్యముచేసి నాయభిమతముఁ దీర్పవలయు" ననివచింపఁ గర్ణుఁడందుల కంగీకరించెను. అనంతరము కర్ణార్జునులు ద్వంద్వయుద్ధము సేయ నెదుర్కొనిరి. ఆసమయంబున ధార్తరాష్ట్రులెల్లరు కర్ణునిపక్షమునను, భీష్మద్రోణ కృప విదురాదులు పార్థపక్షమునను నుండిరి. అప్పుడు కృపాచార్యుఁడు కర్ణార్జునుల మధ్య నిలిచి కర్ణునవలోకించి "భరతాన్వయప్రదీపకుఁడును, పాండురాజనందనుఁడు నగు నర్జునునితో ద్వంద్వయుద్ధము సేయ నెంతువేని నీవంశమును, మాతాపితల నామధేయమును మాకుఁ దెలుపుము. నీవును క్షత్రియకులోత్తముఁడవైనచోఁ బార్థుఁడు నీతో యుద్ధము సేయు" ననివచింపఁ గర్ణుఁడు సూతపుత్రుఁడగుటచే దనకులముఁ దెలుప సిగ్గునొంది తలవంచి యూరకుండెను. అప్పుడు దుర్యోధనుఁడు కృపాచార్యునిఁగని

క. కులము గలవాఁడు శౌర్యము
గలవాఁడును నధికసేన గలవాఁడును భూ
తలమున రాజను నామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడువిధములఁ బేర్మిన్.

తే. రాజవరుఁడైన పార్థుతో రాజు గాని
యాతఁ డనిసేయఁగాఁ దగఁడేని వీని

నకుల సహదేవులు మేల్కాంచి పవన తనయుని విజయము గాంచి సంతసించిరి. పిమ్మట హిడింబ "నను బరిగ్రహింపు" మని భీమసేనునిఁ బ్రార్థింప, "రక్కసులను విశ్వసింపరా" దని యతఁడు దానిని జేపట్ట నొల్లకుండెను. అప్పుడు ధర్మ తనయుఁడును, గుంతీదేవియు "ఇది యుత్తమురాలు; దీని యందు రాక్షసభావం బుపలక్షింపవలదు; నీవివ్వనిత యభీష్టము దీర్పుట నాయభిమత" మని వచింపఁబవననందనుఁడు హిడింబను జేపట్టెను. పిమ్మట నందఱును శాలిహోత్రుఁడను మునీంద్రు నాశ్రమమున కేఁగిరి.

అచ్చటికిఁ గృష్ణ ద్వైపాయనుఁ డరుదెంచి, వినయావనతులై కృతాంజలులైన మనుమలను దీవించి, బాష్పపూరితలోచనయైన కోడలిని జూచి జింతింపవలదు. కొంతకాలము నకు మీరు బాంధవులం గలిసి రాజ్యభోగము లనుభవించెదరు. ధర్మ నిరతుఁడగు నీసుతుఁడు సకల భూనాధులను శాసించి సార్వభౌముఁడై రాజసూయాశ్వమేధాది క్రతువుల నాచరించి భరతాన్వయముఁ బవిత్రము సేయు" ననుచు దుఃఖోపశమనము చేసి, మరలఁ దన తపోవనమున కేఁగెను. పిమ్మట హిడింబకు సద్యోగర్భమున ఘటోత్కచు డను నందనుఁ డుద్భవించి, తండ్రులకుఁ గుంతికి నమస్కరించి "నేనును నాజనయిత్రియు నిఁక రాక్షస పిశాచబలములం గలిసి నివసించుచు మీకుఁ బనిగల యప్పుడు తలంచిన వచ్చుచుందుము. "అనిచెప్పి వారల సెలవుఁ గైకొని హిడింబను

దోడ్కొని యథేచ్ఛం జనియెను. పాండవులు శాలిహోత్రు నాశ్రమమునం గొన్ని దినములుండి యనంతర మమ్మునీంద్రుని వీడ్కొని యేకచక్రపురమునకుం జని విప్రవేషములం దాల్చి భిక్షాటనముచేయుచు కాలముం గడపుచుండిరి.

ఆపుర సమీపమున బకుండను రాక్షసుండు గలండు. అనుదినము వాం డాగ్రామముపయిఁబడి లెక్కలేకుండ మానవులను దినుచుండం బౌరు లాఘోరకృత్యములకు నోర్వంజాలక "నిత్యము నిలువకున నొక మానిసిని, రెండెనుబోతులను నొక శకటమున నన్నమును నీకడ కనుపుచుందుము. నీవు వానిని భక్షించి శాంతింపుము." అని యా దానవునిం బ్రార్థించి నాంటనుండి యట్లనుపుచుండిరి.

ఒకనాం డానిశాచరుని కాహారముం గైకొనిపోవువంతు, పాండవులున్న గృహాధికారికి రాంగా నాతని సతి పతి వియోగమున కోర్వంజాలక "నాథా! ప్రాణవియోగము చేసి యయినను భార్య భర్తకు హితము చేయుచుండవలయు; కావుననే నారక్కసున కశనమయ్యెదను; మీరేంగవల" దని విలపింప నతండు. "అగ్నిసాక్షిగా వివాహమాడిన యుత్తమ సతిని దానవున కాహారముగాం బంపి నేను జీవింపనోప" ననుచు శోకించుచుండెను. మరణ వ్యవసాయమునం దున్న తలిదండ్రులం గాంచి కొమార్తెయుం గుమారుండును దుఃఖించుచు వారల విడిచిజీవింపంజాలక "నిశాచరున కాహారముగా

మే మేఁగెద" మనుచు నాక్రందనముఁ జేయుసాగిరి. అప్పుడు కుంతి వారికి సంభవించిన యాపద నెఱిఁగి "ఆకస్మికమున శోకాతురముగా మీరెవ్వరు నరుగవలదు; అపమాన బలవంతుఁడగు నాకుమారు నంపి యాదుష్టునిఁ జంపించెద" నని చెప్పి వారల నోదార్చి, భీమసేనున కీవార్త దెలిపెను.

అంతట భీముఁడు సంభ్రమముగా క్రాంత హృదయుఁడై బకుఁడున్న చోటికి కరిగి యుద్ధమునకుఁ బిలువ, వాఁడు దుగ్రుఁడై వచ్చి వృక్షములఁ బెఱికి భీమసేనునితోఁ బోరసాగెను. ఇరువురును గొంత తడవు మహాయుధములతోఁ బోరాటము సలిపి పిమ్మట మల్లయుద్ధము సేయఁదొడఁగిరి ఇట్లు కొంత తడవు ఘోరముగ నాయోధనము సేసి భీమసేనుఁడు బకాసురుని విగత జీవునిఁ జేసి వాని కళేబరము నీడ్చుకొని వచ్చి పుర ద్వార సమీపమునఁ బడవైచెను. దానిం గాంచి పౌరులెల్లరును హర్షపరవశులై వాయునందనుని వేనోళ్ళఁ గొనియాడిరి.

అనంతర మొకనాఁడొక విప్రుఁడు ద్రుపదపురము నుండి యరుదెంచి విశ్రమార్థియై పాండవులున్న యింటికి రా నాగృహస్థుఁడాతని నభ్యాగత పూజల సంతుష్టుఁ జేసెను. పిమ్మటఁ గుంతి యాతనిఁ గాంచి "భూసురోత్తమా! మీరే దేశమునుండి వచ్చితిరి? మీదేశమునఁగల విశేషములెవ్వి?" యని ప్రశ్నింప నాధరణీసురుఁడు "తల్లీ! నేను పాంచాలదేశమునుండి వచ్చుచుంటిని. ఆభూపాలుఁ డిప్పుడు తన సుతకు స్వయంవరము మహావైభవమునఁ జేయఁబోవుచున్నాఁడు

అగ్నికుండ సముద్భవయగు నక్కోమలిని జేపట్ట నభిలాషులై నానా దేశపాలకులు వచ్చుచున్నా" రని యచటి విశేషములు జెప్పెను. యుధిష్ఠిరుఁ డామాట లాలించి "ఆర్యా! ఆకన్యకా మణిని ద్రుపదుఁ డెట్లు వడసెనో విశదముగఁ దెలుపుఁడు." అని యడుగ నాభూదేవుఁడు "అయ్యా! ద్రుపదుఁడు మున్నొకపరి ద్రోణాచార్యు నవమానించుటచే నాతని ప్రియశిష్యుఁ డగు నర్జునుఁడు పాంచాలమున కరుదెంచి ద్రుపదునితో రణముచేసి యతనిని బంధించి తీసికొనిపోయి తన గురుసమ్ముఖమున నునిచెను. ద్రోణుఁడాతని నవమానించి విడిచిపెట్టెను. పిమ్మట ద్రుపదుఁ డర్జునుని పరాక్రమమునకు సంతసించి యాతనిని దనకు జామాతం జేసికొన నభిలషించి పార్థునకు దేవిగాఁ దగుకూఁతును, ద్రోణాచార్యునిఁ జంపఁజాలు కొడుకును బడయనెంచి మహాక్రతువుజేయ నగ్నికుండము నుండి కృష్ణ యను సుతయు, ధృష్టద్యుమ్నుఁడను సుతుఁడును నుద్భవించిరి. ఆకన్యను పార్థునకు దేవిగా నీయఁగోరియున్న ద్రుపదుఁడు పాండవులు లాక్షాగారమున దగ్ధులైరని చారుల వలన విని చింతాక్రాంతుఁడయ్యెను. అప్పుడాతని పురోహితుఁడు "రాజా! కుశాగ్రబుద్ధులగు పాండవు లెవ్విధముననైన నయ్యాపదఁ దప్పించుకొని యెందైనఁ బ్రచ్ఛన్నులై యుండురుగాని, మృతులైరను వార్త నేను విశ్వసింపఁజాలను. నీవిప్పుడు విచార ముడిగి, క్షత్రియ సామాన్యుల కభేద్యమగు మత్స్యయంత్రము నేర్పఱచి స్వయంవరముఁ జాటింపుము.

విజయుఁడు తప్పక నిచ్చటికివచ్చి యాయంత్రము గొట్టి నీ సుతను జేపట్టి నీమనోరథ మీడేర్చును." అని యుపదేశింప ద్రుపదుఁ డట్లు గావించుచుండెను." అని యాధరామరుఁడు ద్రుపదు వృత్తాంతము నామూలాగ్రముగఁ దెలిపి తన మార్గమున నేఁగెను. అంతటఁ బాండవులును పాంచాలమున కేఁగ నుత్సుకులై జననీయుతముగఁ బయలుదేరిరి.

మార్గమధ్యమున ననేక విశేషములను గాంచుచు దక్షిణ పాంచాలమున కరిగి ద్రుపదుపురమున నలుదిశల విడిసియున్న నానాదేశాగత మహీనాథుల బహువిధస్కంధావారములఁ గాంచుచుఁ జని యొకకానొక కుంభకారాగృహమున విడిసి, విప్రసమూహముం గలిసి స్వయంవర రంగమున కేఁగిరి.

కనకమయమైన విశాలమంటపముపై సమర్పబడిన రత్న సింహాసనములపై మహీకాంతులెల్లరు నాసీనులై యుండఁ బాంచాలరాజనందన పుష్పమాలికఁ జేఁబూని యరుదెంచెను. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు లేచి నిలిచి మహాకార్ముకమును, వియత్తలమునఁ గట్టిన మత్స్యయంత్రమును రాజలోకమునకుఁ జూపి "పార్థివోత్తములారా! ఇమ్మహాధనువు నెక్కుపెట్టి యేదమ్ములతో నయ్యంత్రమును గొట్టిన వీరాగ్రగణ్యుని నాయనుజ వరించు" నని చెప్పెను.

భూపాల సమూహ మక్కోమలిని గాంచి యనురాగజనిత మానసులై తమతమ సామర్థ్యముల నాలోచింపక నయ్యంత్రము నేయ నరిగి యువ్విల్లు మోపెట్టఁజాలక సిగ్గునొంది మరలి

వచ్చిరి. ఇట్లు మహీనాథులెల్లరు నయ్యంత్రము నేయఁజాలక
యుండ నర్జునుఁడు లేచి యశ్రమంబు నవ్విల్లు మోపెట్టి యేన
మ్ముల నయ్యంత్రమును బడఁగొట్టెను. అప్పుడు ధరామరోత్త
ములెల్లరు నంతోషపరవశులై యాశీర్వదించుచుండ ద్రుపద
రాజనందనయైన కృష్ణ మందస్మిత వదనారవిందయై వచ్చి
విజయుని గళంబునఁ గుసుమమాలిక వైచెను.

స్వయంవరోత్సవమునకరుదెంచిన జరాసంధ, దుర్యోధ
నాది నృపాలురెల్ల నది చూచి “పరాక్రమశాలురగు మను
మతీనాథులుండఁగ ద్రుపదుఁడు తనసుత నీపేదపాఱున
కిచ్చి మనల నవమానించె” ననుచు నాగ్రహులై ద్రుపదా
ర్జునులను ముట్టడించిరి. పాండవమధ్యముఁడా రాజసమూహ
మున, ధృష్టద్యుమ్న, భీమసేనుల సహాయమునఁ బాఱఁదోలి,
కృష్ణాసహితముగఁ దమ విడిదికేగెను.

ఆమెను గాంచినంతనె యుధిష్ఠిర, భీమ, నకుల
సహదేవుల మనస్సులామెయందు లగ్నములయ్యెను. ఆమెయు
వారల ధైర్యతేజస్సును, విక్రమాతిశయమును, సత్యసంధత
యును సహోదర ప్రేమమును గాంచి తనమనంబు నరయే
వ్వరిపై నిలిపెను. కుంతీదేవియుఁ దనతనయు లెవ్వరయ్యా
వతిని బాణిగ్రహణము చేసికొనిన నానందముగ నుండునని
తలంచెను. అప్పుడర్జునుఁడు యుధిష్ఠిరునిఁ గాంచి “అన్నా!
అగ్రజుని విడిచి యనుజుఁడు వివాహమాడఁదగదు; కావున
నీవీ కన్యను బరిగ్రహింపుము.” అని వచింప ధర్మరాజు

"తమ్ముఁడా! దైవప్రేరితములై మనయేవురి మనంబు లిత్తన్వి
యందు లగ్నములయ్యెను? కావున నీమె నేవురము వివాహ
మాడుదము." అని చెప్పెను.

అటఁ బాంచాలమహీశుఁడు విజయుని గుర్తింపలేకఁ దన
తనూజ కింకెవ్వనితో యీయవలసెనని చింతాక్రాంతుఁడై
యాతనివృత్తాంతము నరసిరమ్మని ధృష్టద్యుమ్నునిఁ బంపిం
చెను. అతఁ డతిరహస్యముగాఁ బాండవులున్న గృహము
సొచ్చి వారల సంభాషణల నాలించివచ్చి జనకా! నా యన్న
దమ్ముల సంభాషణల నాలింప వారలు క్షత్రియోత్తము
లని తోఁచుచున్నద" ని చెప్పెను. పిమ్మట ద్రుపదుఁడు
"చాతుర్వర్ణ్యోచితములగు రథములఁ గొనిపోయి వారలం
దోడ్కొనిరమ్మ" ని వచింప ధృష్టద్యుమ్నుఁ డయ్యరద
ములతో నరిగి "రాజమందిరమునకు విచ్చేయుఁడ" ని
పాండవుల నాహ్వానించెను. అంతటఁ బాండునందనులు రాజ
యోగ్యములగు రథములెక్కి ద్రుపదరాజనివేశమున కరు
దెంచి, క్షత్రియోచితాసనములపై నాసీనులైరి.

అప్పుడు ద్రుపదుఁడు వారినిగాంచి "మహనీయులారా!
మీరు క్షత్రియులో, బ్రాహ్మణులో, లేక కృష్ణాపరిగ్రహ
ణార్థం బగుదెంచిన దివిజులో-మీ వృత్తాంతము నెఱింగించి
నన్నానందింపఁజేయుఁడు." అని వచింప, ధర్మరాజు "అవ
నీతలేంద్రా! మేము పాండురాజనందనుల" మని చెప్పెను.
పాంచాలభూపతి యప్పలుకులకుఁ బ్రమోదభరితమానసుఁడై

"మహామహులారా! నాపుణ్యమున లక్ష్యగృహదహనము వలన మీారేయపాయము నొందరైతిరి. ఇంకఁ గృష్ణార్జునులకు వివాహముచేయ సుముహూర్తము నిర్ణయింత" మని పచింప ధర్మనందనుఁడు "నృపవరేణ్యా! ఈకన్యను మేమేవురము వివాహమాడవలయు" ననుచు నిజాభిలాషము వ్యక్తపఱచెను.

ఒక్కకన్యక నేవురు పరిణయమాడుట ధర్మమా యని ద్రుపదుఁడు సంశయించుచుండ నప్పుడు కృష్ణద్వైపాయనుఁ డచటికరుదెంచి "వసుమతీనాథా! ఇక్కన్యారత్నము తొలి జన్మమునఁ బతింగోరి పశుపతి నుద్దేశించి ఘోరతపము సేయ నుమారమణుఁడు ప్రీతుఁడై వరము వేఁడుమనియెను. అంత నామె తనకుఁబతిని బ్రసాదింపుమని యేనుమాఱులు వేఁడ మహేశ్వరుఁడు "నీకు దేహాంతరమున నేవురు పతు లగుదురు" అని వర మొసఁగి యంతర్ధానుఁడయ్యెను; ఆ కారణంబున నీమె పాండవపంచకమునకుఁ బత్నియగును; దైవ నిర్దిష్టమగుటచే నిది ధర్మవిరుద్ధముగాదు. మఱియు నిట్టియాచారముగలదు; తొల్లి నితంతుఁడను రాజర్షికొగురులేవురు పరస్పరమైత్రి నతిప్రసిద్ధులై పెరుఁగుచు, నాశీనరపతిసుతను స్వయంవరమునఁబడసి వివాహమాడిరి. కావున నీవిఁక సంశయమువిడిచి పాండవుల కేవురకు ద్రౌపదిని గ్రమమునఁ బాణిగ్రహణము చేయింపుము" అని ద్రౌపదీ పూర్వజన్మ వృత్తాంతమును దెలిపి యాతని సందేహముదీర్చెను. పిమ్మట ద్రుపదమహారాజు సుముహూర్తమున మహావైభవముతోఁ

పాండునందనుల కేవురకు ద్రౌపది నొసఁగి పాణిగ్రహణ మహోత్సవము చేయించెను. పాండవులు ద్రౌపదితో నానందించుచు నచ్చట నొకవత్సరముఁ గడపిరి.

అనంతర మొకనాఁడు దేశదేశవృత్తాంతముల నరసి రానేఁగిన చారులు దుర్యోధనునిపాలి కరుదెంచి, నాఁడు మత్స్యయంత్రముఁగొట్టినవాఁ డర్జునుఁ డనియు, ద్రుపదాత్మజను బరిణయమాడి పాండవులు ద్రుపదుపురమున సుఖముగనుండిరనియుఁ జెప్పిరి. దుర్యోధనుఁ డది విని, లాక్షాగృహమునఁ బురోచనుఁ డొక్కఁడే దగ్ధుఁడయ్యెఁగాఁబోలు నని దుఃఖితాత్ముఁడై కర్ణునిఁగూడి తండ్రికడకేఁగి పాండవుల చరితము నాతని కెఱిఁగించెను. "అయిన మన మిపుడేమి సేయుద" మని ధృతరాష్ట్రుఁడడుగ, దుర్యోధనుఁడు "పాండవుల నిటకు రావించి, కౌంతేయమాద్రేయులకును, ద్రౌపదికి, నేవురు పతులకు సంతఃకలహములు కలిగించి పిమ్మట నొక్కొక్కరినిఁ జంపుద" మని చెప్పెను. "అదివఱకిట్టి యుపాయము లెన్నియో పన్నితిరి; వానివలన నేమిప్రయోజనము గలిగెను ? పాండవుల కంతఃకలహ మేనాఁటికిఁగలుగదు. కావున మన మిప్పుడు చతురంగ బలములతో నరిగి ద్రుపదునోడించి పాండవులతోఁ బోరి వారలను బంధించి తెచ్చుటయుక్తము." అని కర్ణుఁడు వచింప, ధృతరాష్ట్రుఁ డిదియే కర్తవ్యమని తలఁచి భీష్మద్రోణవిదురులఁ బిలిచి యావృత్తాంతము నెఱిఁగించెను. "పాండవధార్తరాష్ట్రులు మాకు సములు; పితృ

పితామహాంబైన రాజ్యమునకు మీవలె వారును సర్హులు; కావున బాండవుల కర్థరాజ్యమిచ్చి మీరును వారును గలిసి యుండుట మాకును, లోకమునకును సమ్మతముగాని వారలతోఁ బోరుట సమ్మతముగాదు" అని యామువ్వురు నేకగ్రీవముగాఁ బలికిరి. ధృతరాష్ట్రుడు వారిమాటఁ ద్రోసివేయఁజాలక "పాండవుల కర్థరాజ్యమొసఁగెదను. వారల నిచటికిఁ దోడ్కొని రమ్ము." అని విదురునకుఁ జెప్పెను. అంతట విదురుఁడు సంతోషముతో పాంచాలమున కేఁగెను.

పాండవులాతనిఁ గాంచి హర్షతరంగితాంతఃకరణులై యతిప్రేమమున నాలింగనము చేసికొనిరి. పిమ్మట విదురుఁడు ధృతరాష్ట్రునాజ్ఞఁ దెలుపఁ బాండవులు ద్రుపదానుమతిఁబువడసి, కుంతిని, ద్రౌపదిని దోడ్కొని హస్తినాపురమున కరుదెంచిరి. భీష్మద్రోణాది గురుజనులును, పౌరులును వారిని గాంచి యానందాశ్రువులను విడిచిరి.

అచ్చటఁ బాండవులు రాజ్యవిద్యావినోదములతో నైదు సంవత్సరములు నివసించిరి. పిమ్మట నొకనాఁడు ధృతరాష్ట్రుఁడు భీష్మ, ద్రోణ, విదుర, దుర్యోధనాదుల సమక్షమున యుధిష్ఠిరు నర్థరాజ్యాభిషిక్తుం జేసి ఖాండవప్రస్థమ్మున నుండ నియమించెను. అంతటఁ బాండవులు ఖాండవప్రస్థము కేఁగి యచ్చట నింద్రప్రస్థమను నగరరాజము గట్టించి శుభదినమున మృదుమధురమంగళ సంగీతరవములతోడను, భూసురాశీర్వాదనాదములతోడను నందుఁ బ్రవేశించి, ధర్మ

మార్గమునఁ బ్రజాపాలనము చేయుచుండిరి.

అనంతర మొకనాఁడు నారదమునీంద్రుఁ డింద్రప్రస్థమున కరుదెంచి ధర్మనందనుచే, బూజితుండై, యాతనితో "నృపాలతిలకా! కాంతల నిమిత్తమున నెట్టివారికైనఁ గలహము సంభవించును. కావునఁ బాంచాలివలన మీకేవ్వర కంతఃకలహము జనింపకుండున ట్లొక్క నియమము చెప్పెద; మీరు దానిం బాలింపుఁడు; ద్రౌపది క్రమమున మీలో నొక్కొక్కని మందిరమున నొక్కొక్క వత్సర ముండవలయును; ఆ లలనామణియున్న గృహమునకుఁ గడమ నలువురిలో నెవ్వ రేఁగఁజనదు. పొరబడి యుచటి కేఁగినవాఁడు ద్వాదశమాసములు తీర్థయాత్ర సేయవలయును; ఈనియమము నను బాలించుచున్న మీకు వైరము గలుగనేరదు." అని హితోపదేశముఁ జేసి చనియెను. పాండవు లానియమము ననుసరించుచు సంతసముగఁ గాలముఁ గడుపుచుండిరి.

ఇట్లుండ నొకనాఁడు భూసురోత్తముఁ డొకఁడు తన హోమధేనువులను దస్యులచేఁ గోల్పడి యాక్రోశించుచు రా నర్జునుఁ డయ్యాక్రోశము విని, యాతని యాపద దీర్ప నెంచి తన శరాసనముఁ గైకొన నతి శీఘ్రముగ నాయుధాగారమున కేఁగెను. అప్పుడు ధనుశ్శాలయందు యుధిష్ఠిరుఁడు ద్రౌపదీసహితుండై యుండెననియుఁ, దానప్పు డచ్చటి కేఁగ రాదనియు నెఱిఁగియు విజయుఁడు గోసంరక్షణార్థ మచటి కరిగి, తన కార్ముకముఁ గేలఁబూని వెడలి చోరులను వధించి

హోమధేనువులను దెచ్చి యావిప్రున కొసఁగి, నియమభంగము చేసినందులకుఁ దాను ద్వాదశమాసిక వ్రతము సలుప సమకట్టెను. "నీవు విప్రహితార్థము నియమము నతిక్రమించి తివి గావునఁ బ్రాయశ్చిత్త మక్కఱలే" దని ధర్మరాజు వారించినను విజయుఁడు "లోకమర్యాదల నరసికాపాడు మన వర్తనమున నించుకైన నధర్మముండరా" దని చెప్పి యాతని నొప్పించి తాను తీర్థయాత్రకు వెడలెను.

పాండవమధ్యముఁ డనేక తీర్థములు సేవించుచు నొక నాఁడు భాగీరథీజలమునఁ గృతాభిషేకుఁడై తత్తీరమున హోమము సేయుచుండ నులూచియను నాగకన్య యొకర్తు గాంచి యాతనియందు బద్ధానురాగయై నాగపురమునకుఁ దోడ్కొనిపోయి తన యభిమత మాతనికి దెలిపెను. పార్థుఁ డానాఁడు నాగలోకమున వసియించి యులూచి యభీష్టము నెఱవేర్చి, యామెయం దిరావంతుఁడను నందను బడసి మఱునాడు నాగలోకము విడిచి మరల గంగాద్వారమునకరు దెంచెను. అనంతర మతఁడు భీమేశ్వర, నైమిశారణ్యాది పుణ్యక్షేత్రముల సంచరించుచు ద్వాదశమాసములు గడపి, త్రయోదశమాసమున మణిపూరుపురమున కరుదెంచెను. తత్పురాధీశుఁడు సవ్యసాచిని బూజించి తన తనయ చిత్రాంగద నాతనికిఁ బరిణయముఁ జేసెను. పార్థుఁ డచ్చటఁ గొన్ని దినములు నివసించి బభ్రువాహనుఁడను నందను బడసి, మణిపూరుపురపాలకుఁ డగు చిత్రవాహనుఁ డపుత్రకుఁడగుటచే

సఖ్యఁగొమరు నాతనికి వంశకరుగా నొసఁగి వారలను వీడ్కొని,
ప్రభాసతీర్థమున కరుదెంచెను.

అచ్చటికి ద్వారక కనుసమీపమగుటచే నప్పట్టణమున
కేఁగి బాంధవులఁ జూచి రావలయునని విజయుఁ డాలోచించు
చుండ, నాతని కాప్తమిత్రుఁడును, మేనమామ కుమారుఁడును,
ద్వారకాధీశుఁడును నగు శ్రీకృష్ణుఁ డచటి కరుదెంచి కుశల
ప్రశ్నము చేసెను. అప్పుడు పురందరనందనుఁడు వసుదేవ
నందను నవలోకించి యానందబాష్పభరితనయనుఁడై,

ఉ॥ "ద్వాదశమాసికవ్రతము ధర్మవిధిం జఱుపంగ నేఁగి గం
గాది మహానదీ హిమవదాది మహాగిరిదర్శనంబు మీ
పాదపయోజదర్శనముఁ బన్నుగఁ జేయుటఁజేసి పూర్వసం
పాదితసర్వ పాపములువాసె భృశంబుగ నాకు నచ్యుతా!"

అనుచు సాష్టాంగదండ ప్రణామ మాచరించెను. దేవకీతనయుఁ
డర్జును నతిప్రియమున నాలింగనము చేసికొని, యాతని
చిత్తము తన యనుజయగు సుభద్రపయిఁ దగులుట యెఱిఁగి
యాకోర్కె నెరవేర్పనెంచి ద్వారకానగరమునకుఁ దోడ్కొని
పోయెను. అర్జునునకు సుభద్రనీయుట కృష్ణుని యగ్రజుఁడగు
బలరామున కసమ్మతమగుటచేఁ గృష్ణుఁ డక్కార్యము రహ
స్యముగఁ జేయనెంచి, సవ్యసాచిని రైవతకాచలముననుండ
నియమించి తాను నిజమందిరమున కరుదెంచెను.

పిమ్మటఁ గృష్ణుఁడు రైవతమహోత్సవము సేయుదమని
బలదేవాదులకుఁ జెప్పి సకల యాదవులఁ గూడి యాగిరి
కరుదెంచెను. అచ్చట యతిరూపధరుఁడై యున్న యర్జునునిఁ

గాంచి బలదేవాదు లధికభక్తితోఁ బ్రణామముచేసి, యాతని వలన సర్వతీర్థములుఁ, దత్సేవాఫలములు విని సంతసిల్లి "మహాత్మా! ఈవర్షాకాలమున నిటనుండి చాతుర్మాస్యముచేసి, మమ్ముఁ గృతార్థులఁ జేయుఁడు," అని ప్రార్థించి విజయునిఁ దమ మందిరమునకుఁ దోడ్కొని పోయి, యాతనికి సపర్యలుచేయ సుభద్రను నియమించిరి. సుభద్ర యధిక భక్తితో నుపచరించుచుండ నర్జునుఁడు కన్యాగారమున నివసించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు సుభద్ర, భోజనావసానమున విజయునిఁ గాంచి "యతీంద్రా! మీరు రాదని తీర్థములుఁ, జూడని పురములు లేవని తలఁచెదను. లోక విఖ్యాతమగు నింద్రప్రస్థపుర మెప్పుడైనఁ జూచితిరా? అచ్చటఁ బాండు నందనులు సుఖులై యున్నారా? వీరవరేణ్యుఁడగు పాండవ మధ్యముఁడు తీర్థసేవఁ జేయ నేఁగెనని వింటిమి; ఆవిక్రముఁడు మరలఁ బురమున కరుదెంచి కుశలియైయుండెనా? వారల వృత్తాంతము నెఱిఁగియుంటిరేని నాకుఁ దెలిపి యానందింపఁ జేయుఁడు." అని యడుగ నర్జునుఁడు మందహాసముఖారవిందుఁడై "లలనామణీ! పాండవ మధ్యముఁడను నేనే సుమీ! నిన్నుఁ జేపట్టఁగోరి యతిరూపముఁ దాల్చి యిచటి కరుదెంచితి" నని పలికెను. అంతట సుభద్ర లజ్జావనతవదనయై యంతఃపురమున కరిగెను. కృష్ణుఁ డది యెఱిఁగి విజయునకు భోజనవిధు లమర్పఁ దన సతియగు రుక్మిణీదేవినిఁ బంపించెను.

పిమ్మటఁ గృష్ణుఁడు సుభద్రార్జునుల యనురాగమును, జననీజనకులగు దేవకీ వసుదేవుల కెఱిఁగించి వారి నంగీకరింపఁజేసి, యొకనాఁడు పశుపతి పూజావ్యాజమున బలరామాది సకల యాదవులఁ గూడి యంతర్ద్వీపమున కేఁగెను. సుభద్రార్జునులు మాత్రము రాజప్రాసాదముననే యుండిరి. అనంతరము శ్రీకృష్ణుఁడు పురమున కరుదెంచి సుభద్రార్జునులకు రహస్యముగ వివాహముఁజేసి, వారిని గాంచన రథమున నెక్కించి యింద్రప్రస్థమునకేఁగఁ బనిచి మరలఁ దానంతర్ద్వీపమునకు బోయెను.

పురపాలకులు విజయునిఁ గాంచి "ఈతఁడు బలరామకృష్ణు లెఱుఁగకుండ సుభద్రను దోడ్కొని పోవుచున్నాఁడ"ని తలఁచి యాతనితోఁ బోరసాగిరి. ధనంజయుఁడు నిజకౌశలము మెఱయ వారలఁ బాఱఁదోలి యింద్రప్రస్థమునకరిగెను. ద్రౌపదీ యుధిష్ఠిరాదు లయ్యిరువురినిఁ గాంచి ప్రమోదభరితమానసులైరి.

అట బలరాముఁడు తన చెలియలిని ధనంజయుఁ డెత్తుకొనిపోయెనని విని క్రుద్ధుఁడు కాఁగా, శ్రీకృష్ణుఁడు శాంతవచనములతో నాతని క్రోధము నుపశమింపఁజేసెను. అనంతరము వసుదేవ, బలరామ, కృష్ణులు సకల బాంధవులతో నింద్రప్రస్థమునకు వచ్చి సుభద్రార్జునుల కనేక దివ్యాంబర మణిభూషణముల నొసఁగి పాండవులచే సన్మానితులైరి. యాదవులెల్ల రచ్చట సంతసముతో సప్తరాత్రములు నివసించి

పిమ్మటఁ దమపురమున కేఁగిరి. కృష్ణుఁడు మాత్రము ధనంజయుతోడి వినోదముల నింద్రప్రస్థముననే యుండెను.

పిమ్మట విజయుఁడు సుభద్రయం దభిమన్యుఁడను నందను బడసెను. పాండవు లేవురును ద్రౌపదియందుఁ, బ్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనులను సుపుత్త్రులం గాంచిరి.

ఒకనాఁడు కృష్ణార్జునులు వేఁటలాడి ఖాండవవన సమీప మున నొక చందన లతాభవనచంద్రకాంత వేదికయందు మందశీతల సురభిమారుతసుఖము ననుభవించుచు నిష్టకథా వినోదములనుండ, శ్వేతకియను రాజర్షి యొనరించిన సత్త్రి యాగమునన్నైన యపరిమిత ఘృతపానమువలన వ్యాధి పీడి తుఁడై యున్న యగ్నిదేవుఁడు విప్రరూపమున నరుదెంచి "మహామహులారా! నాకాహారము నొసఁగి తృప్తినొందిం పుఁడు," అని యడిగెను. "భూదేవోత్తమా! నీకెట్టి యాహార మిష్టమో యెఱిఁగింపు" మని కృష్ణార్జునులు వచింప నాధరణీసురుఁడు "నేను హుతాశనుఁడను, నాకు భోజన మీ ఖాండవవనము; నేను దీనిని భుజింపఁబోవఁ బురందరుఁడు నాయత్నము విఫలముచేయుచుండెను. దివ్యాస్త్రకోవిదులగు మీరు పాకశాసనుఁ డొనరించు విఘాతములు వారింపనోపు దురేని నేనిమ్మహారణ్యమును దహించి కృతార్థుఁడనయ్యెద" నని చెప్పెను. "అమరేంద్రుని జయింపఁగలము గాని, యాత నితోఁ బోరుటకుఁ దగిన కార్ముకమును, వాహనములును

లేనందున సంశయించుచుంటి" మని కృష్ణార్జునులు వచింపఁ, దోడనే యగ్నిదేవుఁడు శ్వేతాశ్వములుగల దివ్యరథమును గాండీవమను కార్ముకమును, వరుణదేవునిచే విజయున కిప్పించి దేవదానవ పిశాచోరగ ప్రశమనమై వెలుఁగుచున్న సుదర్శన చక్రమును, కౌమోదకియను గదయును వాసుదేవున కిప్పించెను. కృష్ణార్జునులు సంతసమున వానిం గైకొని యుద్ధసన్నద్ధులైన పిమ్మట హవ్యవాహనుఁ డవ్వన దహనము నారంభించెను.

తన సఖుఁడగు తక్షకుఁడను పన్నగేంద్రుఁ డమ్మహావనమున నివసించుచుండుటచే నమరేంద్రుఁ డవ్వనము నతిజాగరూకతతోఁ గాపాడుచుండెను. అందువలన నతఁ డప్పుడగ్నిదేవునకుఁ దన సుతుఁడు సహాయుఁడై వచ్చెనని యెఱిఁగియు ఖాండవవన రక్షణమునకు దేవగణంబుతో నరుదెంచి హుతాశనునిపై వారి ధారల నమితముగఁ గురియింప నారంభించెను. అప్పుడు విజయుఁడు మారుతాస్త్రముఁ బ్రయోగింపదాని కాగఁజాలక మేఘములు చెల్లాచెదరై పోవఁదొడఁగెను. అంతట హుతాశనుఁడు మహాతేజముతోఁ బ్రకాశించుచు నరణ్య దహనము గావించెను. దివ్యౌషధయుక్తమైన యావనమును దహించుటవలన హవ్యవాహనుని వ్యాధి తొలఁగిపోయెను.

అప్పుడు పురందరుఁడును, దేవగణములును దమ యత్నము విఫలమగుటకుఁ గోపించి కృష్ణార్జునులపై శరవర్షము, గురి

యింప, నవ్వీరవరేణ్యులు నిశితసాయకముల, బ్రయోగించి యా బాణములను భగ్నము సేయుచుండిరి. అప్పుడ శరీరవాణి పురుహూతు నుద్దేశించి,

కం|| "పరమఋషు లయినతొల్లిటి
నరనారాయణులు కృష్ణనామంబుల ను
ర్వర నుదయించిరి నీ క
య్యెరువుర సేర్మియును వింతయే దివిజేంద్రా!"

చ|| అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవ కౌరవాన్వయం
బులం జెలిగించుచున్న నృపపూజ్యులు వీరల నీకు నోర్వంగా
నలవియె వీరు దొల్లి యసురాసుర యుద్ధమునాండు దైత్యులకా
జలయుంగ నోర్చియున్న రణవీరులు గావుట నీ వెఱుంగవే?"

"నీ సఖుండైన తక్షకుండు మున్నె యివ్వనము విడిచి యొండు చోటి కేంగి సుఖుండై యున్నవాండు. ఖాండవ మగ్నిచేత దగ్ధమగు నని తొల్లి బ్రహ్మవచనము గలుగుటం జేసి యిది వహ్నితాశనుస కశనమయ్యెను. కావున దీనికిం జింతింపవలను." అని పలికెను. అంతట సురనాధుండు సమరముం జాలించి, నిజతనయుని పరాక్రమమునకు నంతసించి యాతని కాగ్నేయ, వారుణ, వాయవ్యాది దివ్యాస్త్రముల నొసంగి సురగణములతో దివమున కరిగెను.

ఖాండవము దగ్ధమగుచుండ, నందు నివసించుచున్న మయుం డను దానవుం డొకం డయ్యగ్నిజ్వాలలనుండి తప్పించుకొని పోవనేరక విజయుని శరణు జొచ్చెను. దయాతరంగిత స్వాంతుం డగు ధనంజయుండు వానిని రక్షించి, దేవకీతన

యువితోఁ గూడి బరమాహ్లాదముతో నింద్రప్రస్థమున కేఁగి ఖాండవవన దహనప్రకారము ధర్మజునకుఁ దెలిపెను.

## —♦ సభా పర్వము ♦—

వాసుదేవ సహితులై పాండునందనులు పేరోలగమువనుండ మయుఁ డంజలిబద్ధుఁడై విజయునిఁ గాంచి,

కం॥ ఘనముగఁ బ్రాణము రక్షిం
చిన యుపకారికిఁ బ్రియంబు సేయుదు నన నే
ర్తునె యైనను నీకుఁ బ్రియం
బనఘా చేయంగ నిష్టమైనది నాకున్.

నేను దానవ విశ్వకర్మను; శిల్పకళాకుశలుఁడను; మీరు కోరినదాని నతి గమ్యముగ నిర్మింపఁగలవాఁడను; మీ కెద్ది యభీష్టమో నా కెఱిఁగింపుఁడు!" అని వచింప, దేవకీనంద నుఁడు "నీ శిల్పనైపుణ్యము మెఱయ నొక యపూర్వమైన సభ నిర్మించి ధర్మరాజున కొసఁగుము." అని యాజ్ఞాపించెను.

అంత నద్దానవుఁడు వివిధరత్న విభవాభిశోభితముగా నొక్క సభాభవనము బదునాలుగు మాసములు నిర్మించి యుధిష్ఠిరున కొసఁగి,దివ్య ఘోషముగల దేవదత్తమను శంఖము ధనంజయునకును, శత్రుఘాతిని యగు గదను భీమ సేనునకును నొసఁగి, యుధిష్ఠిరునిచే సత్కృతుఁడై తన నివాస మున కరిగెను. పిమ్మట శుభముహూర్తమున ధర్మరాజు తమ్ములఁ గూడి భూసురాశీర్వాద పుణ్యాహనాదములతో సభాప్రవేశము చేసెను. అప్పుడు,

మ॥ మదమాతంగ తురంగ కాంచనల సన్మాణిక్యగాణిక్య సం
పదలోలిం గని తెచ్చి యిచ్చి ముద మొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతు సీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.

అనంతర మొకనాఁడు నారదుఁ డింద్రప్రస్థమున కరుదెంచి మయనిర్మిత సభాభవన విభవముఁ గాంచి సంతసించి యుధిష్ఠిరునిచే సన్మానితుఁడై కుశలప్రశ్నము చేసి "ధర్మనందనా! మీ జనకుఁడు పాండుమహీశుఁడు యమలోకము నుండి నన్నుఁ గాంచి "మునీంద్రా! నాకు సురలోకమున కరుగ నభిమతము గలదు. రాజసూయ మహాధ్వర మాచరించిన వారలకుఁ గాని నాకాధిపలోకసుఖావాప్తి చేకూరదు; కావున నీవు భూలోకమున కేఁగి మా యుధిష్ఠిరునకు నా వృత్తాంతముఁ దెలిపి, రాజసూయమఖము సేయఁ బ్రోత్సహింపుము. ఆతఁ డమ్మహాక్రతు వాచరించెనేని నేను బితృపితామహ నివహముతో నమరలోకమున కేఁగి యచ్చట సౌఖ్య మనుభవించెద." నని చెప్ప, నా వృత్తాంతము నీ కెఱిఁగింప నిటకు వచ్చితిని. కావున నీవు పితృహితార్థము రాజసూయ మఖము నవశ్యము చేయు" మని చెప్పి యదృశ్యుం డాయెను.

పిమ్మట నయ్యధ్వరంబు సేయ భీమార్జున నకుల సహదేవులు ధర్మరాజునుఁ బ్రోత్సహించిరి. అంతట యుధిష్ఠిరుఁడు వసుదేవతనయునితో నవ్విషయము నాలోచింప; నమ్మహానుభావుఁడు "పార్థివోత్తమా! నీ వైభవాతిశయమునకుఁ

దగినటుల నమ్మహాక్రతువుఁ దప్పక నాచరించి సత్కీర్తిం
గాంచుము. మగధాధిపుఁడైన జరాసంధుఁడు మహీపాలురఁ
బెక్కండ్రఁ జెఱఁబట్టి వారిని భైరవదేవునకు బలి యొసఁగఁ
జూచుండె; ధరణీచక్రమునఁ గల దుష్టనృపతు లెల్లను నా జరా
సంధునిఁ గొలుచుచు, వాని సహాయమున ననేక దుండ
గములు సేయుచుందురు. కావున మనము ముందు, మహా
ప్రతాపవంతుఁడగు మగధేశుని జయించి, వాని చెఱలో
నున్న మూర్ధాభిషిక్తుల విడిపించి పిమ్మట మహీవలయము
జయించుట కర్తవ్యము. నేనును భీమార్జునులును గిరివ్రజమున
కేఁగి జరాసంధు నవలీల జయించి వచ్చెద" మని వచింప
ధర్మరాజందుల కనుమతించెను. గిరివ్రజమున కేఁగ భీమా
ర్జునులుఁ బరమోత్సాహులైరి. అంతట మురమర్దనుఁడు
భీమార్జునులఁ గని "జరాసంధుఁడు విప్రసేవాపరాయణుఁడు;
కావున మనము విప్రవేషములతో నరిగి ముందాతనికి
హితోపదేశముఁ జేయుదము; మన యుపదేశము నతఁడు
విననియెడల నాజిభిక్షఁ గోరుదము." అని చెప్పెను. పిమ్మట
కృష్ణ భీమ విజయులు బ్రాహ్మణవేషములఁ దాల్చి గిరివ్రజ
మునకుఁ బయనమైరి.

గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రి
యను నైదుపర్వతముల నడుమ నిర్మింపఁబడి శాత్రవదుర్భే
ద్యమై, మగధదేశ రాజధానియై ప్రకాశించుచున్న గిరివ్రజ
పురము నయ్యోధత్రయము సొచ్చి రాజమందిరమున కేఁగిరి.

జరాసంధుఁడు వారల నెదుర్కొని యుచితాసనముల నుప విష్టులఁజేసి మధుపర్కముల నీయఁబోవ నవ్వీరపురుషత్ర యము "మేము వీనిఁ బరిగ్రహింప" మనిరి. "నేనొసఁగు సపర్యల నేల బరిగ్రహింపరు? మీ కెద్ది యభీష్టమో యెఱిఁ గించిన దాని నిచ్చెద" నని జరాసంధుఁడు నుడువ, నమ్మధు సూదనుఁడు "రాజా! నీవు భూపాలురఁదెచ్చి బలినిచ్చుచుంటి వని యెఱిఁగి వారిని రక్షింప నేతెంచితిమి. "నాకంటె నధికుఁ డులేఁడ" ని గర్వితుఁడవై నిరపరాధులఁ జంపి నరకాగ్నిజ్వా లలఁ గూలక, నా సదుపదేశ మాలించి నీచేఁ జిక్కిన ధరణీనా థుల విడిచిపుచ్చుము. అట్లు సేయ నొల్లవేని రణభిక్షార్థులమై వచ్చిన మాతో సమరము సేయుము" అనుచు గంభీరస్వన మున నుత్తర మొసఁగెను. "ఇట్టి శూరవచనము లాడుచున్న మీరు కపటవిప్రులని తలంచెద; మీ నిజవృత్తాంతముఁ దెలుపుఁడు; నేనట్టి వెఱపింపులకు వెఱచి, దేవార్థము తెచ్చిన నృపాలుర విడుచువాఁడఁగాను; సైన్యరహితులై వచ్చిన మీతో సైన్యయుతుఁడనై పోరుట యనుచితము గావున నేనొక్కఁడనే మీ మువ్వురితో సంగర మొనరించెద" నని జరాసంధుఁడు వచింప, దేవకీనందనుఁడు "ఒక్కనితో మువ్వు రని సేయుట పాడిగాదు. మాలో నీయిచ్చవచ్చినవానితోఁ బోరాటము సలుపుము! నేను గృష్ణుఁడ, నతఁ డర్జునుఁ డితఁడు భీముఁడ"ని యాతనికిఁ దమ నిజనామముల నెఱిఁగించెను. అంతట జరాసంధుఁడు తనసుతుఁడగు సహదేవుని రాజ్యా

పి క్తుఁజేసి తాను మహాబలవంతుఁడగు భీమసేనునితో మల్ల యుద్ధము సేయ నిశ్చయింప భీమసేనుఁడును యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

అనంతర మయ్యిరువురుఁ బదుమూఁడు దినము లెడ తెగక నతికౌశలముతో నాయోధనము, జేసిరి. పదునాల్గవనాఁటి రాత్రి పవనతనయునిచే జరాసంధుఁడు నిహతుఁడయ్యె! మహా సత్త్వశాలియైన జరాసంధుని మరణమునకు సహదేవుఁడు దుఃఖింపఁ గృష్ణుఁ డాతని నోదార్చి, చెఱసాలలోనున్న నృపా లుర నందఱిని విడిపించెను. సంఖ్యాతీతమైన యా భూపా లసమూహ మాయోధత్రయమునకుఁ బ్రణామము లాచ రించి వేనోళ్ళఁ గొనియాడిరి. కృష్ణభీమపార్థులు సహదేవుఁ డొసఁగిన యుపాయనంబులఁ గైకొని, యా రాజచయముం దోడ్కొని యింద్రప్రస్థమున కేఁగిరి.

యుధిష్ఠిరుఁడు విజయవిభాసితులై వచ్చిన తమ్ములఁగాంచి యానందజలభరిత నయనుఁడై, నృపసమూహము నర్హరీతి గౌరవించెను. అనంతర మా భూమీశులెల్లరు ధర్మరాజు నకు వివిధోపాయనముల నొసఁగి తమతమ పురములకరిగిరి. అనంతరము ధర్మనందనుఁడు భీమసేనుని దూర్పునకును, పార్థు నుత్తరమునకును, సహదేవుని దక్షిణమునకును, నకులునిఁ బశ్చిమమునకును దిగ్విజయముఁ జేయఁ బంపించెను.

భీమార్జున నకులసహదేవులు చతురంగబల సమేతులై యొక్కొక్క రొక్కొక్క దిశకరిగి దిగ్విజయముచేసి, వసుధా

చక్రమునఁగల రాజచక్రము నధ్వరమునకుఁ బిలిచి, వారలచే నసంఖ్యాత ధనకనక వస్తువాహన నివహములఁ గైకొని వచ్చి యగ్రజునకు సమర్పించిరి. పిమ్మట ధర్మరాజు యజ్ఞో పకరణతతులను సిద్ధముఁ జేయించెను. మఖావలోకన కుతూహాలురై పాంచాల, కౌరవ, యాదవాది బాంధవులును, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, కాంభోజాది సకల మహీపాలురును, నారద, వ్యాస, మార్కండేయ, మైత్రేయ, యాజ్ఞవల్క్యాది మహర్షులును, మహీతలమునఁగల సమస్త జనులును నింద్రప్రస్థమునకు విచ్చేసిరి. ధర్మరాజు వారల నందఱి నుచితరీతిని సత్కరించి, హిరణ్యరజత రత్న దక్షిణా దానవిషయములందుఁ గృపాచార్యునిఁ, గృతాకృత పరిజ్ఞానమునందు భీష్మ ద్రోణులను, సకలవస్తు వ్యయమునందు విదురుని, నానా దేశాగతులైన రాజులు దెచ్చియిచ్చిన యుపాయనములు గైకొన దుర్యోధనుని, భక్ష్యభోజ్యాది వినియోగమునందు దుశ్శాసనుని నియోగించి తాను సవన దీక్షితుఁడయ్యెను.

పురోహితుఁడైన ధౌమ్యుఁడును వ్యాస, యాజ్ఞవల్క్యాది మహామునులును యథావిధిగ నమ్మహా యజ్ఞము నసమాప్తము సేయించిరి అప్పుడగ్ర్య గో, భూ, హిరణ్యాది మహా దానముల ధరణీసురులును, దివ్యాంబర, మణిభూషణ, చందనాది సముచిత సత్కారముల నఖిలరాజన్యులును, అభిమతాన్న దానమున సకలజనులును దృప్తులై యానందాతి

శయమున ధర్మనందనుఁ బెక్కువిధములఁ గీర్తించిరి.

అనంతరము యుధిష్ఠిర నృపాలుఁడు గాంగేయునిచే నను జ్ఞాతుఁడై, సకలభువన రక్షకుఁడైన వాసుదేవున కర్ఘ్యమిచ్చి పూజించెను. శ్రీకృష్ణుని మేనత్తకుమారుఁడును, చేదిభూపాలుఁడును నగు శిశుపాలుఁ డదిచూచి సహింపక ధర్మరాజు నుద్దేశించి

మ. "అవనీనాథు లనేకులుండఁగ విశిష్టారాధ్యులార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వురుండఁగ ధరిత్రీనాథ గాంగేయు దు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితుం వార్ష్ణేయుఁ బూజించినీ
యవివేకం బెఱిఁగించితిం దఱుకు దాశార్హుండు పూజార్హుఁడే"

సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁడుండఁగ వసుమతీశ
ఋత్విజుండని విచారించి పూజించితే
ద్వైపాయనుండుండ ధర్మయుక్తి
యాచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుఁడు కృపుఁడునుండ
భూనాథుఁ డనియెడు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ
బూజనీయులైన పురుషులలోపల
నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ డిట్టులేలఁ
బూజ్యులైనవారిఁ బూజింపనొల్లక
భీష్ము పలుకుఁ జేసి పేలవయితి

క. నీ వెఱుఁగక యిచ్చిన నిది
నావిషయమె యని మనంబునం దలఁపక ల
జ్జావిరహితుఁడయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియె దనకుఁ గొను టుచితంబే."

అనుచు భీష్మయుధిష్ఠిరకృష్ణుల ననేకవిధముల నిందించుచు

యుద్ధసన్నద్ధుఁడై నిలువ, దామోదరుఁడు చక్రాయుధముచే వాని మస్తకముఁ ద్రెళ్లనేసెను. ఇట్లు ప్రశాంతవిఘ్నమై, సుఖారంభమై, ప్రభూతభక్ష్యాన్న ధనదానసనాథమై, జగన్నాథరక్షితమై రాజసూయమహాధ్వరము సమాప్తమైన పిమ్మట నానాదేశాగతులైన రాజులెల్లను ధర్మరాజుం జూచి "పార్థివోత్తమా! మేము రాజసూయోత్సవ దర్శనమునను, భవత్కృత సత్కార గౌరవమునను జేసి కృతార్థులమైతిమి, ఇఁక మా మా నిలయముల కేఁగెద" మని చెప్పి యమ్మహారాజు సెలవుఁ గైకొని తమతమ రాజ్యముల కరిగిరి. భీష్మ, ధృతరాష్ట్ర, ద్రుపద, కృష్ణాది బాంధవులును పాండవులను వీడ్కొని నిజపురముల కేఁగిరి. దుర్యోధనుఁడు మాత్రము తన మేనమామయగు శకునిఁ గూడి, మయనిర్మితసభావైభవము జూచువేడ్క నింద్రప్రస్థమున నింకఁ గొన్నిదినములుండెను.

దుర్యోధనుఁ డాసభాభవనముఁ గాంచి దాని యపూర్వరమణీయతకు విస్మితుఁడై యొక్కనాఁ డాయా ప్రదేశములఁ గ్రుమ్మఱుచు, వివృతమైన ద్వారదేశము సంవృతముగాఁ దలఁచి చొరనొల్లక, సంవృతమైన దాని వివృతముగా నెంచి చొరంబోయి, లలాటఘట్టితగృహద్వారుఁడై, నీలాశ్మరశ్మిస్థగితమైన విమల మణిస్థలము జలాశయముగా వగచి పరిధానం బెగద్రోచికొని, స్ఫటికదీప్తిజాల పరివృతమైన జలాశయము స్థలముగాఁ దలఁచి కట్టిన పుట్టము దడియఁ జొచ్చి క్రమ్మఱిన నాతనిఁ జూచి పాంచాలియు, భీమసేనుఁడును నగిరి. దుర్యోధనుఁ

డందులకు లజ్జితుఁడుగా, యుధిష్ఠిరుఁ డాతని కనేక దివ్యవస్త్ర
భూషణములనిచ్చి సత్కరించి గజపురమునకుఁ బంపించెను.

కరిపురమున కరిగినదాది దుర్యోధనుఁడు, మహీవల
యమునఁగల రాజులెల్లలు యుధిష్ఠిరున కంకితులై నానా
విధోపాయనములఁ దెచ్చియిచ్చుటయు, నిర్మల స్ఫటికశిలా
నిర్మితమును, వివిధరత్న ప్రభాభాసురమును నైన యా సభా
వైభవమును దలఁచి కడు నసూయాపరుఁడై, ధర్మతనయుని
రాజ్యలక్ష్మి నెవ్విధముననైనఁ దానపహరింప నెంచి తన
యభీష్టము నొక్కనాఁడు శకునికిఁ దెలిపెను. కపటోపాయ
ధురీణుఁడైన శకుని యాతని యభిమతము నెఱిఁగి "రాజా!
అక్షవిద్యయందే నతికుశలుఁడను; యుధిష్ఠిరుఁడు ద్యూత
ప్రియుఁడగునుగాని యంత నిపుణుఁడు గాఁడు. కావున నీ
వాతని నిటకు రావించెదేని నేను జూదమాడి యశ్రమమున
నోడించి రాజ్యలక్ష్మిఁ గైకొని నీకొసంగెద" ననుచు
దుర్యోధనునకు సంతసము గలుగునట్లుఁ జెప్పెను. అంత
నయ్యిరువురును ధృతరాష్ట్రుపాలికేఁగి తమ దురాలోచనఁ
దెలిపి ధర్మరాజు నిచటికి రావింపుమని కోరిరి. "పరాక్రమ
శాలురైన పాండవులతోడి వైరము విడుచుట శ్రేయస్కర"
మని ధృతరాష్ట్రుఁడు పలుక దుర్యోధనుఁడు "జనకా! పాండు
నందనుల వైభవాతిశయముఁ గాంచి నేనించుకైన సహింపఁ
జాలను. యుధిష్ఠిరునితో నిప్పుడు జూదమాడ నీవంగీకరింపవేని
నేను ప్రాణములఁ ద్యజింతు" ననియె.

అంతట ధృతరాష్ట్రుఁడు తనయు నభీష్టమును దీర్పనెంచి శిల్పకళావిశారదులను రావించి, కనకఖచిత స్తంభ సహస్రము లను, విచిత్రద్వారశతములను వివిధరత్నరుచిరప్రదేశములను జేసి రమ్యముగా నొక్క సభాభవనముఁ గట్టించి, యొక నాఁడు విదురునిఁ బిలచి "ఈ సభావైచిత్ర్యముఁ గాంచి సంతో సించుటకును, దుర్యోధనునితో నిచ్చటనుహృద్ద్యూత మాడు టకును ధర్మరాజు ననుజ సతీయుతముగా నిచటికిఁ దోడ్కొని రమ్ము." అని యాజ్ఞాపించెను. విదురుఁ డవ్వచనము లాకర్ణించి విషణ్ణచిత్తుఁడై "రాజా! ద్యూతమువలన నెట్టివారి కైనఁ గలహము సంభవించును; దాన నుభయపక్షములకు హానిసేకూరు; కావున నీవు దీని కంగీకరింపకుము," అనుచు ననేకవిధముల హితోపదేశముఁ జేయ, ధృతరాష్ట్రుఁడు సుహృద్ద్యూతమువలనఁ బ్రమాదము సంభవింపదు కావున నీవు సత్వరముగఁ బోయి యుధిష్ఠిరు నిచటికిఁ దోడ్కొనిరమ్ము." అని చెప్పి పంపించెను.

అంతట విదురుఁ డింద్రప్రస్థమున కరిగి ధృతరాష్ట్రు నాజ్ఞఁ దెలుప యుధిష్ఠిరుఁడు పితాజ్ఞ నుల్లంఘింపరాదని తలఁచి తమ్ములను ద్రౌపదిని దోడ్కొని హస్తిపురి కేతెం చెను. దుర్యోధనుఁడు పాండవులను సన్మానించి వారలకు నూతనసభావైభవముఁ జూపించెను. అనంతర మందఱు నా సభాంతరమున నుపవిష్టులై యిష్టసంభాషణాది క్రీడావన రమునుండ దుర్యోధనుఁ డజాతశత్రు నవలోకించి "అనఘా!

నీవు ద్యూతమునఁ గుశలుఁడవనివింటి; కావున మనమిప్పుడు హృదయరంజకముగాఁ గొంతతడవు జూదమాడుదము." అని యధికోత్సాహముతో వచించెను. "తమ్ముఁడా! దుర్వ్యసనములలో నొక్కటియగు దురోదరము మన కను చితము." అని ధర్మరా జనుచుండ నంతలో శకుని "రాజా! ద్యూతకళావిశారదుఁడును, లోకజ్ఞుఁడును నగు సత్క్షత్రియుఁడు దాని నిందింపఁదగునే? జూదమున నోడుదునను భయము నీకుఁ గలదేని మిన్నకుండు" మని పలికెను. అంతట ధర్మరాజు రోషావేశితుఁడై నెత్తమాడ నంగీకరింప నాతనితో నాడుటకు దుర్యోధనుఁడు తనపక్షమున శకునిని నియోగించెను.

అంతట శకుని దుర్యోధను హస్తకీటకములను, ధర్మరాజు తన మణిహారములను నొడ్డి జూదమాడ ధర్మతనయుఁ డోడెను. అంత నతఁడు క్రమమున సువర్ణరత్నభాండాగారములను, వారణ, వాజిసమూహములను, పరిచారక జనములను, సమస్త వస్తువులను, రాజ్యమును, నలువురు తమ్ములను, బణమువెట్టి యోటువడి, చివరకుఁ దన్ను నయిత మొడ్డి యోడెను. అప్పుడు శకుని యాతనితో "ధర్మనందనా! ఇంకను నీ ధనమగు ద్రౌపదియుండ నిన్నేలయొడ్డితి." వన, యోచనా రహితుఁడై ధర్మరాజు నిజసతిఁగూడఁ బణమువెట్టి యోడెను.

అంతట దుర్యోధనుఁడు పాండవులఁ దనదాసులుగనెంచి,

"దాసత్వముసేయ ద్రౌపది నిటకుఁ దోడ్కొనిరమ్మ" ని
యొక సేవకున కాజ్ఞాపించెను. వాఁ డామెపాలికిఁ బోయి
యీవద్వృత్తాంతము నెఱిఁగింప న య్యోషామణి దుఃఖితయై
"పాండవాగ్రజుఁడు తన్నోడిన పిమ్మట నన్నోడెనో, నన్నోడిన
పిమ్మటఁ దన్నోడెనో యడిగి తెలిసికొనివచ్చి నన్నుఁదోడ్కొని
పొమ్మ" ని చెప్పెను. అంత నా సేవకుఁడు సభకు వచ్చి
యీ ప్రశ్ననుదెలుప, దుఃఖాతిశయమున ధర్మరా జేమియుఁ
జెప్పఁజాల కూరకుండెను. దుర్యోధనుఁడు "ఓయీ! ద్రౌప
దినే యిచటికివచ్చి యడిగి యీ సంశయముఁ దీర్చుకొమ్మని
చెప్పుము." అని వానిని, మరలఁ బంపించెను. వాఁడు
ప్రభువునాజ్ఞఁ దెలిపి యక్కోమలిని సభకుఁ దోడ్కొని
రానామె వివర్ణవదనయై వచ్చి కురువృద్ధుని సమీపమున
నిలువఁబడియె. పాండవు లా నారీరత్నమును జూడఁజాలక
శోకవిహ్వలమానసులై శిరములువంచిరి.

అప్పుడు దుర్యోధనుఁడు దుశ్శాసనునిఁబిలిచి "తమ్ముఁడా!
పాంచాలిని సభామధ్యమునకుఁ దీసికొనిరమ్ము." అని నంత
నమునఁ బలుక, దుష్టబుద్ధియగు దుశ్శాసనుఁ డామె సమీ
పమున కేఁగెను. ఆతనిఁ గాంచి ద్రౌపది భయావేశితయై
గాంధారికడకుఁ బోవుచుండ నద్దురాత్ముఁ డామె వెంటఁజని
"నీవు కురుపతియర్ధమైతివి. ఇఁక నెట కేఁగెదవు? రమ్ము."
అనుచు గద్దించి పలికెను. "ఏకవస్త్రనై, గురుబంధుజనాధిష్ఠి
తమైన సభాంతరమున కెట్లు రాఁగలను?" అని యాసాధ్వీమ

తల్లి వినయమున వచింప, నద్దురాత్ముఁడు "నీ వేకవస్త్ర వైనను, విగతవస్త్రవైనను నీడ్చుకొనిపోదు" ననుచు నామె శిరోజములను బట్టుకొని బలాత్కారముగ సభామధ్యమున కీడ్చుకొని వచ్చెను. అప్పతివ్రతాశిరోమణి తన దురవస్థకు మిక్కుటముగ విలపించుచు, ఆర్తజనరక్షాతత్పరుఁడైన పరమేశ్వరుఁడే తనకు శరణ్యుఁడని తలంచి "పరమపురుషా! భక్తవత్సలా! దుష్టచిత్తులగు ధార్తరాష్ట్రులవలన నా కవమానము ఘటిల్లకుండఁ గాపాడుము." అనుచు మనమున జగత్పతిని వేడుచుండెను.

ద్రౌపదికి సంభవించిన దుస్థితిఁగాంచి భీమసేనుఁడు కడు దుఃఖితుఁడై యజాతశత్రు నవలోకించి "నీవు ధనకనక వస్తు వాహనములును రాజ్యమును మమ్మును నోటువడుట యుచితమే గాని; పాపద్యూతమని యెఱిఁగియు ద్రౌపదినిఁ బణము వెట్టి యధర్మ ప్రవృత్తుఁడ వైతివి. కావున భవద్బాహు దాహంబు సేయవలయు" నని యతికోపమునఁ బలుక గాండీవి యాతనిఁ బట్టుకొని "అన్నా! సుహృద్ద్యూతమునకు యొరులు పిలిచిన నేఁగుట క్షాత్త్రధర్మము; ఏఁగనిచో గౌరవహాని యగుంగావున ధర్మనందనుఁడు దాని నంగీకరించెను. దీన నమ్మహనీయుని తప్పేమిగలదు? గురుజనములపై నిట్లుకోపింపఁదగునే?" అని చెప్పి వృకోదరుని శాంతింపఁజేసెను.

అప్పుడు, జగత్త్రయవిజయభుజవీర్యసనాథులైన నాథులు గలిగియు ననాథవలెఁ బాంచాలరాజపుత్త్రి, దుశ్శాసనాప

కృష్టయై, భయా ర్తయై, సభాంతరమున నుండుటఁగాంచి సుయోధనుని తమ్ములలో నొకఁడగు వికర్ణుఁడను నాతఁడు జాలినొంది "సభాసదులారా! "పాండవాగ్రజుఁడు తనోడి ననోడెనో, ననోడి తనోడెనో యెఱింగింపు" డని ద్రౌపదియడిగిన ప్రశ్నను విచారించి యామె దాసియైనది యుఁ గాసిదియు నిర్ణయించుట సభ్యులధర్మము; అయినను మీరెల్లఱు మిన్నకుంటిరిగావున నేను ధర్మనిర్ణయముఁ జేసెద; ద్యూతపానాది దుర్వ్యసనాసక్తుఁడైన మనుజుఁడు ధర్మముఁ దప్పి వర్తిల్లు గావున నట్టివాని కృత్యములు సేకొనఁదగవు; కితవాహూతుఁడై, వ్యసనవర్తియై, పరాజితుఁడైన ధర్మరాజు పాండవుల కందఱకు సాధారణధనమైన ద్రౌపదిని బణము జేసెఁగావున నామె యధర్మవిజిత! అక్కోమలి నిట్లవమానించుట యన్యాయ" మని పలుక, రాధేయుఁడు "పెద్దలగు సభ్యులెల్లఱు మిన్నకుండ, నీయట్టి చిఱుతవాఁడు ధర్మవిచారణ సేయఁజనదు. యుధిష్ఠిరుఁడు తన సర్వస్వమ్ము నొడ్డి యోటువడినప్పు డిదివానికి వెలిగాదు; కావున ద్రౌపది ధర్మవిజితయే! లేనిచోఁ బాండవు లెల్లఱు దీనిని విజితఁగా నేల యొడఁబడుదురు? ఇవ్వనిత యనేక భర్తృకగావున బంధకి యనఁబడు, దీనిని విగతవస్త్రఁజేసి సభాంతరమునకుఁ దెచ్చినను ధర్మవిరోధములేదు." అని చెప్పి యాతనిని వారించెను.

పిమ్మట దుర్యోధనుఁడు దుశ్శాసనుఁ బిలిచి "పాండవుల యొక్కయు, ద్రౌపదియొక్కయు వస్త్రములఁ దీసికొనిరమ్ము."

అనివచింప, నవ్వచనముల నాలించినతోడనే పాండవులు తమపై పుట్టములఁ దీసియిచ్చిరి. అనంతరము ఖలుఁడగు దుశ్శాసనుఁడు స్త్రీయని యించుకయు వంకయుంపక ద్రౌపది కట్టిన పుట్టము నానభలో నూడఁదీసెను అప్పు డార్తత్రాణ పరాయణుఁడగు శ్రీమన్నారాయణుఁ డామె శరీరమున నిం కొకవస్త్రము నుత్పన్నము నేసి యా పతివ్రతాశిరోమణి కవమానము ఘటిల్లకుండఁ గాపాడెను. అట్లు దుశ్శాసనుఁ డెన్ని వసనముల నూడఁదీసినను వరల నామెమేన నూతనాంబర ముత్పన్నమగుచుండఁ గొంతతడవున కతఁడు కనుగు నొంది యా ప్రయత్నమును మానెను.

ఆ యవమానకృత్యముఁ గాంచి పవననందనుఁడు క్రోధారుణితనేత్రుఁడై

మ. "కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపదినిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైల రక్తౌఘ ని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ఇట్లు సేయనైతినేనిఁ బితృపితామహులగతికిఁ దప్పినవాఁడ నగుదు" నని ప్రతినఁజేసెను.

దుశ్శాసనుచే నట్లు పరిభవితయై శోకాకులితమానసయై యున్న కృష్ణఁగాంచి కర్ణుఁడు "తరుణీ! ఒక యువతి కేవురు పతులుండుట యనుచితము; కావున నీనభ్యులలో నీకుఁ దగినవానిని, జూదరియై యోలి నోటువడని వానిని వేఱొక్కని వరించి, దాస్యవిముక్తవై సుఖంపుము." అని చులకనగఁ బలుకఁ, బాప నిరతుఁడగు దుర్యోధనుఁడు తన యూరుతలము నెక్కరమ్మని యుత్సాహముతో నామెపా

మణికి సైగచేసెను. వృకోదరుఁ డదిగాంచి సహింపనోపక,

ఉ. "ధారుణి రాజ్య సంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి రం
భోరునిజోరుదేశమునఁ నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁజేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్."

అనుచుఁ గ్రోధావేశితుఁడై నిజాయుధమువంకఁజూడ, భీష్మ ద్రోణ, కృప, విదురు లాతనిఁగాంచి "వత్సా! క్రోధమున కిది సమయముగాదు. శాంతింపుము. పరమసాధ్వియగు ద్రౌపది నవమానించిన ఫలము నిక్కు-రుకులపాంసనులు వేగము ననుభవింతురు." అని చెప్పి యాతనిఁ బ్రశాంతచిత్తుఁజేసిరి.

అప్పుడు ధార్తరాష్ట్రుల మందిరములలో మహోత్పాతములు కొన్ని జనింప ధృతరాష్ట్రుఁడది విని భీతాత్ముఁడై దుర్యోధనునిఁబిలిచి "పరమపతివ్రత నిట్లవమానింపఁదగద" ని మందలించి ద్రౌపదిని రావించి "అమ్మా! బుద్ధిహీనులై వీర లాచరించిన యపరాధముల మదినుంచక, నీ యిచ్చవచ్చిన వరముఁ గోరు మేనొసఁగెద" నని శాంతవచనములఁ బలుక, నా సాధ్వీమతల్లి "పాండవాగ్రజుని దాస్యవిముక్తునిజేయుఁ" డని కోరెను. ఆతఁ డవ్వరమొసఁగి వేఱొకటిఁ గోరుమన నామె "ధర్మరాజు తమ్ములను దాస్యవిముక్తులఁజేయుఁ" డని యడిగెను. అట్టి కష్టసమయమందును ద్రౌపది ధర్మము నెడబాయకఁ దన పతులనే దాస్యవిముక్తులఁజేయ నభిలషించెనుగాని, తన్ను దాస్యవిముక్తఁజేయఁ గోరదయ్యె! ధృతరాష్ట్రుఁ డామెధర్మగుణమునకు సంతసించి యుధిష్ఠిరునిఁ బిలిచి "కుమారా! దుర్యోధను దుర్నయము మదినుంచక నీవనుజసహితుఁడవై యింద్రప్రస్థమున కేఁగి యెప్పటియట్ల

రాజ్యము సేయుము" మని చెప్పి వారల నింద్రప్రస్థమునకుఁ బంపించెను.

అనంతరము దుర్యోధనుఁడు ధృతరాష్ట్రుపాలికిఁ జని "తండ్రీ! చేఁజిక్కిన పాండవులను విడిచి పుచ్చి నాయత్న మంతయు భగ్నముఁ జేసితివి. ఇంత వైరము కలిగిన పిమ్మట మాకు స్నేహమెట్లలవడును? పరాక్రమశాలురగు పాండవుల నిప్పుడు విడిచి పుచ్చుట ఘోరపన్నగముల నలిగించి కంఠ పరిసరమున విడిచి యూరకున్న చందము గాదె? ఇప్పుడు పాండవుల ననుద్యూతమునఁ బరాజితులఁ గావించి విరళ దేశ నిర్వాసితులను జేయ నంగీకరింపుముఁ" అని చెప్ప ధృత రాష్ట్రుఁడు దాని కొడఁబడి యనుద్యూతార్థము యుధిష్ఠిరుని మరలఁ బిలువనంపెను.

పితృనియోగమును, విధినియోగమును నతిక్రమింపనగునే యని విచారించి ధర్మరాజు తల్లినిఁ, దమ్ములను, భార్యను దోడ్కొని హాస్తిపురమున కరుదెంచెను. అప్పుడు శకుని యుత్తములఁ గైకొని ధర్మరాజు నుద్దేశించి "రాజా! నీవు మున్నోడిన రాజ్యమును, పత్నిని, సహోదరులను కురువృద్ధుఁడు మరల నీకొసంగెఁ గావున వాని నిపుడోడ్డఁజనదు; నేనొక యపూర్వమైన పణము సెప్పెద; ఈ ద్యూతమున నోటు పడిన వార లజినవల్కధారులై, వన్యమూలఫలాశనులై పం డ్రెండేండ్లు వనవాసముసేసి, జనపదమున నొక్క యేఁ డజ్ఞాతవాసమును సేయవలయు; అజ్ఞాతవాసమున వారల నొరు లెఱింగినచో మఱలఁ బండ్రెండేం డ్లరణ్యవాసమును నొక్క యేడజ్ఞాతవాసము నాచరింపవలయు; నీ విప్పణమునకు నొప

రక సమ్మతించెదవేని జూదమాడుదము." అని పలింప, అను ద్యూతార్థమాహూతుండనై మరలి పోవుట యవమాన కరమని యెంచి ధర్మరాజు దాని కంగీకరించి శకునితో జూదమాడి పరాజితుం డయ్యెను.

అంతటఁ బాండవులు రాజ్యోపభోగములు విడిచి కృష్ణా సహితులై వనమునకేఁగ నుద్యుక్తులుగాఁ గుంతి వారలను గాఁగిలించుకొని దుఃఖాతిశయమున నాక్రందనము సేసెను.

భీష్మద్రోణ కృపాదులు పరమ దుఃఖితులైరి. కుంతియు వనవాసమునకేఁగఁ బోవ విదురు డడ్డువచ్చి "తల్లీ! నీవు వనవాస క్లేశము నోపఁజాలవు. నాయింట నివసింపుము" అని ప్రతిమాలి యామెను దన గృహమున నునిచికొనియె. కృష్ణయుఁ బాండవులును, కుంతీ భీష్మద్రోణాది గురుజనములకు నమస్కరించి వారల యాశీర్వాదములఁ గైకొని సుభద్రాభిమన్యులను, ద్రౌపదేయులను దోడ్కొని విపినమున కేఁగు చుండిరి. అప్పుడు మూలభృత్యులు కొందఱు స్యందనములను దోలుకొనుచు వారి పిఱుఁదను వనమున కరిగిరి.

ఇంద్రప్రస్థము రాజధానిగా నిరుపదిమూఁడేండ్లు రాజ్యము సేసి, కన్నబిడ్డలఁ బోలెఁ బ్రజలను గాపాడి, యానాఁడు పాపద్యూతపరాజితుఁడై కాంతారమున కేఁగుచున్న యుధిష్ఠిరనృపాలునిఁ గాంచి పౌరులెల్లఱు శోకించుచు "భరతాన్వయ రత్నదీపా! దురాత్ములగు ధార్తరాష్ట్రుల రాజ్యమున మేము నివసింపనోపము, మీవెంట నరణ్యమునకు వచ్చెద" మనుచు వచ్చుచుండ, ధర్మరాజు "క్రూరమృగాకీర్ణమగు నరణ్యము కడుభయంకరము; అచటి నివాసము

నకు మీర లోర్వఁజాలరు. ఇచట నేనుందు," నని యను
నయవాక్యములు సెప్పి వారిని మరలించెను. పురోహితుఁ
డైన ధౌమ్యుఁడును, వింకఁ గొందఱు భూసురులును పాండ
వులతో విపినమున కేఁగిరి.

## — అరణ్యపర్వము —

పాండవులు కామ్యకమను వనమున కరిగి యచ్చట నివ
సించుచుండ, వారికి సంభవించిన దురవస్థ నెఱిఁగి కృష్ణాది
యాదవులును, ధృష్టద్యుమ్నాది పాంచాలురును నవ్విపినమున
కరుదెంచిరి. ద్రౌపది ధృష్టద్యుమ్న కృష్ణులఁ గాంచి
"అన్నలారా! సింహవిక్రములైన మీకుఁ జెలియలనై,
దుర్వారప్రతాపులగు పాండునందనులకుఁ బట్టమహిషినై,
కౌరవసభయందనాథవలెఁ బరిభవింపఁబడితి" ననుచు మిక్కు
టముగ విలపింప, వారామె యశ్రుజలముఁ దుడిచి,
"సోదరీ! యూరడిల్లుము. మేమీ క్షణమునఁ బోయి
యప్పాపాత్ముల నంతక సదనమున కనిపి, ధర్మనందనుని
రాజ్యాభిషిక్తుని జేసి నీకు సంతసముఁ గలిగించెద" మని చెప్పి
యామె నోదార్చిరి. అప్పుడు సవ్యసాచి "భ్రాతృవరేణ్యు
లారా! మీ కెఱుఁగని ధర్మము గలదే! ఇప్పుడు ధార్త
రాష్ట్రులతో ననిసేయుట ధర్మవిరుద్ధము గావున శాంతి
వహింపుఁ" డని చెప్పి వారలఁ బ్రశాంతచిత్తులఁ జేసెను.
అనంతరము సుభద్రాభిమన్యులను దోడ్కొని కృష్ణుఁడును
ద్రౌపదేయులను దోడ్కొని ధృష్టద్యుమ్నుఁడును పాండవుల
వనవాసమునకు వగచుచు నిజపురముల కేఁగిరి.

పాండవులకడ కనుదినము, రోమశ, బృహదశ్వ-
మార్కండేయాది మహాముని లరుదెంచుచు, వారలచే
సత్కృతులగుచు, సత్కథలను జెప్పి వారికిఁ జింతోపశమనము
సేయుచుండిరి. అట్లు పాండునందనులు కామ్యక వనమునఁ
గొన్ని దినములువసించి, పిమ్మట ద్వైతవనమున కరుదెంచిరి.

అచ్చటి కొకనాఁడు వ్యాసమునీంద్రుఁ డరుదెంచి పాండ
వులచేఁ బూజితుఁ డై యజాతశత్రు నవలోకించి "ధర్మనం
దనా! "ప్రతిస్మృతి" యను నొక దివ్యమంత్రము నీ కుప
దేశించెద; నీవు దాని నర్జునున కుపదేశింపుము; అమ్మంత్ర
శక్తి నతఁ డధిక తపోవీర్య విభవుఁడై దేవతలఁ బ్రత్యక్షము
చేసికొని వారలవలన దివ్యాస్త్రములు వడసి, కర్ణ దుర్యోధ
నాది శాత్రవులను జయించు"నని చెప్పియాతనికి మంత్రోప
దేశము చేసి చనియె. పిమ్మట ధర్మతనయుఁడు విజయున
కమ్మంత్రరాజ ముపదేశించి, కృష్ణ ద్వైపాయను వచనము
లను దెలుప, నతఁడు దివ్యాస్త్రలాభార్థియై తరమున కరుగ
సమకట్టెను. అప్పుడు కృష్ణ యాతని కడకు వచ్చి,

చ॥ "అరికృత దుష్పరాభవ మహార్ణవమగ్నుల మమ్మునందఱన్
గరుణ సముద్ధరింపుము జగన్నుత యన్యులు పూనఁగానియీ
భరము వహింపఁబూని నయపారగుణాన్వితు నిన్ను దిక్కులన్
ధరణియు సోముఁడున్ నభముధాత్రియు గాడ్పును గాచుచుండెడున్."

అని దీవించి, యాతని వియోగమున కోర్వఁజాలకయు
నెట్టకేలకు మనము స్థిరము నేసికొని పంపించెను.

అంతనర్జునుఁడు గాండీవధరుఁడై వెడలి హిమశైల, గంధ
మాదనముల గడచి యింద్రకీల పర్వతమున కేఁగ నచ్చట
వృక్షచ్ఛాయ నొక వృద్ధబ్రాహ్మణుఁడు నిలిచి గాండీ-

వినిఁ జూచి "పితహర్ష క్రోధులైన ధరణీసురు లుండెడు పుణ్యనివాసమున నీవాయుధపాణివై యుండఁదగదు. కావున నీబాణాసనమును విడువు"మని పలికెను. విజయుఁ డవ్వచనము లకు నంచలింపక యుండ, శతమఖుఁ డాతని ధైర్యమునకు మెచ్చి యా వృద్ధబ్రాహ్మణ రూపము విడిచి నిజరూపము సూపె "కుమారా! నీధైర్యము నెఱుఁగఁగోరి యీభూసుర వేసముతో నరుదెంచి నిన్నుఁ బరీక్షించి ప్రీతుఁడనైతి; నీకుఁ గావలసిన వరములడుగు" మనియె. సవ్యసాచి ముకుళిత కర కమలుఁడై "దేవా! నాకు దివ్యాస్త్రములఁ బ్రసాదింపు"మని యడుగ,నమరవల్లభుఁడు "కుమారా! నీవు ముందు పశుపతినిఁ గుఱించి తపముజేసి పరమాస్త్రలాభము నొందు"మని చెప్పి దివమున కేగెను. పిమ్మట నర్జునుఁడు హిమవన్నగమున కేగె. వివిధకుసుమఫల వృక్షములతోడను, విమల నిర్ఝర జలములతోడను మనోహరముగ నున్న యొక తపోవనమున నుమారమణు నుద్దేశించి నాలుగు మాసములు ఘోరముగఁ దపముజేసెనుఁ

ఈశ్వరుఁ డాతని తపమునకు బ్రీతుఁడై కిరాతరూపముఁ దాల్చి, వనచరీసహస్రములతోడను, గిరాతబలములతోడను ధనంజయుని తపోవన ప్రాంతమున కరుదెంచెను. అప్పుడు మూకుఁడను దైత్యుఁడొకఁడు గరళకంఠునిచే ననుజ్ఞాతుఁడై భీకరమగు సూకరాకారముఁ దాల్చి పార్థునిపయికి రా నతఁడు గాండీవగుణధ్వని సేయుచు దానిపైకి బాణము విడువ నమ కట్టి నిలిచెను. అప్పుడొక దిశనుండి "ఈసూకరము నేయ కేయకు" మనుచు నొక గంభీరవాక్యము వినరా నతఁడు

దాని నలక్ష్యముచేసి బాణము నాసూకరముపైకి విడిచెను. అక్షణముననే గిరాతపతియు నొక్కవాడి నారాచము విడువ నయ్యిరువురి శరము లొక్కమాఱే యాసూకరముఁ దాఁకెను. అంత నావంది యాదృశ్యముగాఁగ నర్జునుఁడు కిరాతనాథునిఁ గాంచి "ఓయీ! నేనేసిన మృగమునేసి, మృగయాధర్మ విరోధమేల నేసితివి? నిన్నిప్పుడు నానిశితబాణజాలముల పాలుచేసెద" ననుచుండ, నక్కిరాతుఁడు "నేనునామృగము నేయ నది నాబాణఘాతమువలనఁ జచ్చె; దానిని నీవు చంపి నట్లు చెప్పికొనుటేటి పౌరుషము? శూరుఁడవయినచో నాతో రణముచేసి నీశౌర్యము గనఁబఱచుము" అనుచు నర్జును నెదు రొక్కని పోరసాగెను. ధనంజయుఁ డాతనిపై శరవర్షముఁ గుఱిపింప నాశరము లాతనియెడ నిష్ఫలము లగుచుండెను. కిరాతనాథుఁ డేయు శరములు మాత్రము పార్థు నధికముగఁ బీడింపసాగెను. అదిగాంచి ఫల్గునుఁడు విస్మితుఁడై "ఈతఁ డెవ్వఁడో కిరాతరూపధరుఁడై వచ్చిన దివ్యపురుషుఁడుగాని యన్యుఁడుగాఁడ"ని నిశ్చయించి భీకరముగఁ బోరి కొంత తడవునకు మూర్ఛితుఁడయ్యెను. అప్పుడు మాహేశ్వరుఁడు నిజరూపము ధరించి యర్జునుని లేవదీసి "ధనంజయా! నీతప మునకును, శౌర్యమునకును నేను ప్రీతుఁడనైతి; నీకోర్కె సఫలము చేసెద; వరమువేఁడు" మని పలుక, విజయుఁడు కృతాంజలియై "పరమేశ్వరా! లోకైకనాథా! ఎఱుకవేస ముతో నరుదెంచిన నిన్నెఱుఁగక నేచేసిన యపరాధము సహించి నాయెడఁ బ్రసన్నుఁడవై, పాశుపతాస్త్రముఁ బ్రసా దింపు" మని వేడెను. అంతట పార్వతీరమణుఁ డాతనికి మంత్ర

ధ్యాన జపహోమ పూర్వకముగా, సంధాన మోక్షణ సంహా
రసహితముగాఁ బాశుపతాస్త్రము నొసఁగి "ధనంజయా!
ఈదివ్యాస్త్రమున నీవఖిలలోకములు జయింతు" వని వర
మొసంగి యంతర్హితుఁడయ్యెను. అప్పుడు పాకశాసనుఁడు
యమవరుణ కుబేరులతో నర్జునునకుఁ బ్రత్యక్షమై "కుమారా!
నీకు సారథము బుత్తెంచెద: నీవు దాని నధిరోహించి యమ
రావతికి రమ్ము; నీకచ్చట దివ్యాస్త్రముల నొసఁగెద" నని
చెప్పెను. యమ వరుణ కుబేరులు విజయునియెడఁ బ్రీతులై
కొన్ని దివ్యాస్త్రముల నొసఁగిరి. ధనంజయుఁడా దిక్పాలకు
లను వాక్పుష్ప ఫలజలములఁ బూజించి తృప్తులఁ జేసెను.
అంత నయ్యమరవల్లభుఁడు దిక్పతులతో నంతర్హితుఁడై
యర్జునునకు మాతలిచే నరదముఁ బంపించెను.

పార్థుఁడ య్యరదమున నధిష్ఠించి యమరావతి కరుగఁ
బాకశాసనుఁ డాతని నతిప్రీతి నాలింగనము సేసికొని తన
సింహాసనమున గూర్చుండఁ జేసెను. అప్పుడు సురరాజుతో
నేకాసనమున నున్న గాండీవిని, సుర సిద్ధ గంధర్వ విద్యాధరు
లతిప్రీతి నగ్గించిరి. పిమ్మట శతముఖుం డాతని నొక మణిమయ
సౌధమున నుండఁ బనిచెను.

నాఁటిరాత్రి యూర్వసియను నప్సరస మహాభూషణాలం
కృతయై విజయునికడకు వచ్చి "పురుషవరేణ్యా! నారదాది
మహర్షులెల్లరు నీసుగుణగణములఁ గొనియాడుచుండ నాక
ర్ణించి నేను పెక్కుకాలమునుండియు నీ స్నేహము గాంక్షించు
చుంటిని; మదీయ పుణ్యవశమున నేఁడు భవదీయ దర్శనము
చేకూరె; కావున నిప్పుడు నీవు నా మనోరథముఁదీర్పు" మని

ప్రార్థింప, నతఁ డామెకు దండప్రణామము నేసి "తల్లీ! మదీయ వంశకర్తయైన పురూరవునకుఁ బత్నివగుట వలనను, బురందరునకుఁ బరిచర్య యొనర్చుట వలనను నీవు నాకు జనయిత్రి వయితివి. కావుననే యిట్టి దుర్భాషణముల వినఁజాల; నా యందుఁ బుత్త్రివాత్సల్యముంచు" మని వినయమునఁ బలికెను. అంత నామె కోపావేశితమానసయై "నిన్నుఁ గామించి వచ్చిన నా మనోరథము విఫలము సేసితివి గావున నీవు మర్త్య లోకమున మానవవర్జితుఁడవై మానినీమధ్యమున నపుంసకుఁడవై యుండుము." అని శాపమిచ్చి నిజసదనమున కేఁగెను.

ప్రభాతమైన పిమ్మటఁ బురందరుఁ డవ్వృత్తాంతము నెఱిఁగి విజయుని నచ్ఛీలమునకు మెచ్చి "కుమారా! నీవజ్ఞాతవాసము సేయునప్పుడు షండరూపమునఁ బ్రచ్ఛన్నుండవై రాజకన్యకలకు నర్తనముఁ గఱపుచు నీ శాపము ననుభవించి, యనంతరము నిజరూపముఁ దాల్పు" మని చెప్పి యాతని కమోఘాస్త్రంబు లనేకమిచ్చి దనయొద్దఁ గొంత కాల ముంచుకొని, చిత్రసేనుఁడను గంధర్వునిచే నాతనికి గీత వాద్య నృత్యములు జెప్పించి, యొక్కనాఁ డేకాంతమున "కుమారా! కాలకేయనివాతకవచు లనఁబఱఁగు మూఁడు కోట్ల దానవులు లోకభీకరులై దివిజులకు బాధలఁ గలుగఁజేయు చుండిరి. నీవు దేవతల వలనఁ బడసిన దివ్యాస్త్రములచే నద్దనుజులను వధించి దేవబ్రాహ్మణహితము సేయు" మని చెప్పి యొక్క యభేద్యకవచమును, సహస్రసూర్య ప్రభాభాసితమైన యొక్క దివ్యమణికిరీటమును నొసంగి, మాతలిప్రయుక్తమైన రథమున నెక్కించి పంపించెను.

అంతఁ బార్థుఁడు, సముద్రగర్భమునఁ గల యొక్క మహా పట్టణమున నివసించుచున్న నివాతకవచులయొద్ద కరిగి శంఖ ధ్వానము సేయు, నద్దానవు లలిగి నానావిధాయుధసన్నద్ధులై వచ్చి విజయునిఁ జుట్టుముట్టిరి. అంతఁ గిరీటి నిజకౌశలము మెఱయఁ గొంతతడ వాయోధనము సేసి, పాశుపత, వారుణ, కౌబేరాది దివ్యాస్త్రములఁ బ్రయోగించి దనుజమర్దనము సేసి, విజయ విభాసితుఁడై దేవదత్తముఁ బూరించుచు నాకమున కరుదెంచెను.

అప్పుడు పురందరుఁడు, బృందారకుల కధేయులైన మూఁడు కోట్లదానవులఁ జెండాడి వచ్చిన విజయు నతిప్రీతి నాలింగనము చేసికొని, మూర్ధాఘ్రాణము సేయుచు, "కుమారా! కాల కేయనివాతకవచులఁ జంపి దేవబ్రాహ్మణ హితము సేసి నాకు సంతసముఁ గలిగించితివి. ఇఁక నీ రాకకు నిరీక్షించు చున్న సహోదరుల కడకరిగి వారికి మనఃప్రియము సేయు" మని చెప్పి యాతనిని ధర్మతనయునికడకుఁ బంపించెను. దేవతల వలన దివ్యాస్త్రలాభము వడసివచ్చిన కిరీటినిఁగాంచి కృష్ణయుఁ, బాండవులును హర్ష పరిప్లుతాంతరంగులైరి.

అట గజపురమున నొక్కనాఁడు శకుని కర్ణదుర్యోధన దుశ్శాసనను లొక్కచోటఁగూడి "వనమున నరయుచున్న పాండవుల కడకు మనము మహావైభవముతో నేఁగి వారలఁ దుఃఖచిత్తులఁజేసి రావలయు" నని యోఁజించి "సారవంత మైన ద్వైతవనమునందుఁడి యభివృద్ధి నొందుచున్న మన గోగణమున కిప్పుడు క్రూరజంతువులచే బాధగలుగుచుండె నని గోపాలురు వచించిరి. కావున మేమిప్పు డచ్చటి కరిగి

యీదుష్టసత్త్వముల నుక్కడంచి, ధేనువ్రాతము గాపాడి వచ్చెద" మని భీష్మ విదురధృతరాష్ట్రాదులకుఁ జెప్పి, దివ్య మణిభూషణాలంకృతులై, కాంతాజనముతోడను, సైన్యము తోడను మహావైభవముతో ఘోషయాత్ర కరిగిరి.

అట్లు ద్వైతవనమున కరుదెంచి, గోబృందము గాంచి పరికించి, క్రూరమృగములఁ జెండాడి, పల్లవప్రసూనఫల భరితపాదపములచే నతిమనోహరముగ నున్న నవ్వనమున విహరించుచు, మయూరమధుకర కీరకోకిలల మధురగానము లాకర్ణించుచు, పాండవుల యాశ్రమ సమీపమునకు వచ్చి యచ్చట నొక్క సరోవరముఁ గాంచి, యక్కమలాకరతీరమునఁ గ్రీడాగృహములు నిర్మింప భృత్యుల బనిచెను.

అప్పుడు కొందఱు గంధర్వు లచటి కరుదెంచి "ఈపద్మాకరము మానాయకుఁడైన చిత్రసేనాఖ్య గంధర్వనాయకుఁ క్రీడార్థమేర్పఱుపఁబడినది. కావున మీ రిచ్చటనుండి సత్వరముగ నెడలుఁ" డని వచింప, భృత్యులు కురుపతి పాలికిఁ బోయి యావృత్తాంతము నెఱింగించిరి. దుర్యోధనుఁ డది విని క్రోధావేశుఁడై "నే నేఁగి యీ గంధర్వులఁ జయించి సరోవరము నాక్రమింతు" ననుచు కర్ణాదియోధులఁ గూడి గంధర్వులపైకి సమరమున కరిగెను. ఉగ్రుఁడైన చిత్రసేనుఁ డది గాంచి సాహససమన్వితుఁడై వచ్చి కౌరవానీకము నెదుర్కొని శరవర్షము గురియింపఁ, గౌరవవాహిని యాతని ధాటికోర్వఁజాలకఁ జెదరవందఱయయ్యెను. కర్ణుఁడు కొంతతడవు భీకరముగ రణము చేసి యనంతరము క్షతగాత్రుఁడై నిలువఁజాలక రణభూమిని దొలంగి చనియె. అంతఁ

చిత్రసేనుఁడు దుర్యోధను నెదుర్కొని సమరము సేసి హాయా సాధులఁదునిమి, విరథుఁడైన యక్కురుపతిఁ బట్టుకొని పెడకేలుగట్టి సింహనాదము సేయు, నాతని యనుచరులు దుశ్శాసనాదులను, వనితాజనములను బంధించిరి.

అప్పుడు కొంద ఱమాత్యులును, భృత్యులును ధర్మరాజు కడకుఁ బరుగెత్తిపోయి "పార్థివోత్తమా! కాంతా జన సహితముగాఁ జిత్రసేను చేఁ జిక్కిన నీయనుజ ప్రాణముఁ గాపాడు" మని యాక్రందనము సేసిరి. అప్పుడు భీమసేనుఁడు ప్రహసితాననుఁ డగుచు ధర్మరాజును గాంచి "అన్నా! మనము చేయవలసిన కార్యమును జిత్రసేనుఁడే యొనరించెను. దుష్టచిత్తులై మనల ననేక విధముల బాధించిన ధార్తరాష్ట్రుల యెడ నిపుడు కనికరింపవల" దని వచింప, దయార్ద్రాంతః కరణుఁడైన యుధిష్ఠిరుఁడు "దుర్యోధనుఁడు దుర్వినీతుఁ డైనను, కాంతాజన సహితముగా నొరుల చేతఁ జిక్కిన సమయమున రక్షింపక యుపేక్షించుట మనకు ధర్మము గాదు. అతఁడు నీయొక్కయు, ధనంజయునియొక్కయుఁ బరాక్రమమెఱిఁగినవాఁ డగుటచే నిప్పుడు మీరు వచ్చి తన్ను విడిపింతురను నాన వహించియుఁడును. ఇది మనకుఁ బుణ్యమును, యశమును జేకొనఁదగిన సమయము! కావున నీ వనుజులతో నరిగి ధార్తరాష్ట్రులఁ జెఱనుండి విముక్తులఁ జేసి రమ్ము." అని శాంతవచనములను జెప్పి యాతనిని వినత మత్సరుం జేసి పంపించెను.

అగ్రజుపనుపున ననుజులు నలువురు రథారూఢులై యరిగి గంధర్వవాహినిఁ దాఁకి వాఁడి నారాచములఁ బ్రయోగింప,

చిత్రసేనుఁడు రణసంరంభము విడిచి స్నేహభావముతోఁ గిరీటిఁ గాంచి "ధనంజయా! ఖలుఁడగు నీ సుయోధనుఁడు, వనవాసక్లేశితులగు మిమ్ముఁ బరిహసింపఁ దలఁచి యిటకు రా నేనది యెఱిఁగి వీని గర్వ ముడుపఁ బూఁచి యిట్లు గావించితినని చెప్పెను. దయార్ద్రహృదయుఁడైన ధర్మరాజు ధార్తరాష్ట్రులను విడిపింప మాకనుజ్ఞ యొసఁగె; కావున నీవు వారలను విడిచి మాకు సంతసముఁ గలిగింపుఁ" డని గాండీవి వచింపఁ, చిత్రసేనుఁ డవ్వచనముల కలరి ధర్మరాజు కడకేతెంచి యాతనిచే సన్మానితుఁడై ధార్తరాష్ట్రులను విడిచి తన మార్గమున నేఁగెను.

అప్పుడు యుధిష్ఠిరుఁడు దుర్యోధనుఁ గాంచి "తమ్ముఁడా! నీవిఁక విషాదము నొందక ననుజ సహితముగాఁ బురమున కేఁగి రాజ్యంబు సేయు"మని చెప్పి పంపించెను. దుర్యోధనుఁడు చెదరిపోయిన సైన్యమును, శకుని కర్ణాదులను గలిసికొని లజ్జాకజ్జలిత హృదయుఁడై కరిపురమున కేఁగెను. ధౌమ్యాది భూసురులును, నయ్యాశ్రమవాసులైన ఋషులును పాండవుల ధార్మికత్వమును బహువిధముల బ్రస్తుతించిరి.

అనంతరము పాండవులు తృణబిందు నాశ్రమమున కేఁగి యట నివసించుచు నొకనాఁడు ధౌమ్య సహితముగాఁ బాంచాలి నాశ్రమమున నునిచి తామేవురును మృగయార్థము నలుదిశలకుఁ జనిరి. అప్పుడు, ధృతరాష్ట్రుని జామాతయు, సింధుసౌవీర దేశాధీశుఁడునగు జయద్రథుఁడు సాల్వకన్యకఁ బరిణయమాడ నమ్మార్గమున నేగుచు, యాశ్రమమున నున్న ద్రౌపదిఁ గాంచి మోహితుఁడై, కోటికాస్యుఁడను తన

మిత్రునిఁ గాంచి "ప్రియసఖా! నీవయ్యాశ్రమమున నున్న, సుందరి కడ కేఁగి, యాసుదతి యన్వయనామధేయములఁ దెలిసికొని, యామెకు నన్నెఱింగించి, మాయిరువురకు సఖ్యముఁ గూర్చు" మని చెప్పిపంపించెను.

అంతన కోటికాస్యుఁడు పాంచాలిపాలికిఁ బోయి "రాజ బింబాననా! దారుణమృగ సమాకులమైన యివ్వనాంతర మున నొంటిగ నున్న నీ వెవ్వతెవు? నీతలిదండ్రు లెవ్వరు? పతి యెవ్వఁడు? సింధుసౌవీరనాథుఁ డగు జయద్రథుఁడు నిన్నుఁ గాంచి ప్రీతుఁడై, నీ తెఱంగెఱుంగ నన్ను బుత్తెంచె" నని వచింప, నమ్మానినీమణి "అన్నా! నేను పాండునంద నుల ధర్మపత్నిని, పాంచాల రాజపుత్రిని, పాండవు లిప్పుడు మృగయార్థము వనాంతరమున కరుగుటచే నే నిట నొంటిగ నుంటిని. కావున నీ విటఁ దడయఁజనదు. మీ రియ్యాశ్రమ ప్రాంతమున గొంత తడవు విశ్రమింపుఁడు. పాండవులరుదెంచి మిమ్ములను సన్మానించి పంపుదురు" అని చెప్పెను.

కోటికాస్యుఁ డంతట జయద్రథుని కడ కేఁగి యామె వచ నముల నెఱిఁగింప నతఁడు మదనకంపితహృదయుఁడై ద్రౌపది నపహరింప నెంచి యామె కడ కేఁగి "తరుణీ! రాజ్యముఁ గోల్పోయి కందమూల ఫలాశనులై కాంతారమున నవయు చున్న పాండవులఁ గూడి నీ విట్లిడుములఁబడ నేల? శీఘ్ర ముగ నన్నుఁ జేపట్టి రాజ్యభోగము లం దనివిదీర ననుభవిం పుము." అని వచింప నక్కాంతారత్నము "అన్నా! నీవు దుస్సలకుఁ బతివగుటచే నాకు నన్న వగుదువు. ఉత్తమ రాజ వంశోద్భవుఁడవై, నీచునివలె నిట్టి దుర్భావములాడఁ

జను నే!" అనుచు వినయ వాక్యములతో హితోపదేశముఁ జేసెను. ఆదుష్టుఁ డామె సదుపదేశము నాలింపక "సరోజముఖీ! రాజులకు దాసివరుసలనోఁ బనిలేదు. కావున సత్వరముగవచ్చి నాయరదము నెక్కు" మన, నా సాధ్వి "దురాత్మా! దుర్వారప్రతాపులగు పాండవుల విక్రమము నెఱుఁగక నోటికి వచ్చినట్లు వదరుచున్నావు. శీఘ్రముగ నిటనుండి వెడలి ప్రాణములఁ గాపాడుకొనుము. లేనిచోఁ బాండవులరుదెంచి నీయుసురుల నపహరింతు"రని వచించెను "వీరకులప్రసూతులమగు మేము పాండవులకు వెఱచువారముగా" మనుచు సైంధవుఁ డప్పతివ్రతాశిరోమణిని బలవంతముగఁ బట్టుకొని రథముపై నిడుకొని సపరివారుఁడై యరుగఁదొడఁగెను. అప్పుడు ద్రౌపది దుఃఖాతిశయమున వడలుచుండ ధౌమ్యుఁ డరుదెంచి "దుష్టాత్మా! ఈసాధ్వీమతల్లిఁ గొంపోయినఁ బాండవులు నీప్రాణముల నపహరింపక విడువరు. కావున నీమెను విడువు" మని యాక్రోశించుచు వాని పిఱుందనఁ బోవుచుండెను.

వేఁటకరిగిన పాండవు లనేక మృగములఁజంపి నిజాశ్రమమునకు వచ్చి యటనున్న పరిచారికవలన జరిగినవృత్తాంతము విని, క్రోధావేశమున మహోరగములవలె రోజుచు, దమయరదముల నతివేగమునఁ బరుగెత్తించి, త్రిగర్త, సింధు, శిబి, సౌవీరసైన్యములతో ననేకనరపతిపరివృతుఁడై యున్న జయద్రథుఁగాంచి క్రోధారుణలోచనులై సింహనాదములు సేయుచు శాత్రవసేనపయిఁ గవిసి శరవర్షమును గురియించిరి. అంతట సైంధవుఁడును తనసేనలఁ బురిగొల్పుచు పాండవుల

నెదుర్కొని కొంతతడ వాయోధనము సేసెను. అప్పుడు విజయుఁడు గాండీవహస్తుఁడై నిజకౌశలము మెఱయ సవ్యాపసవ్యముల వాడినారాచములఁ బ్రయోగించి శాత్రవయోధులఁ బీభత్సము సేయుచుండ, భీమసేనుఁడు హేమబంధబంధురమును, నయోమయమును నగు గదాదండమును ద్రిప్పుచు నరివీరులఁ జెండాడఁ గొంతతడవునకు రణభూమి యంతయు శవమయమయ్యెను. హతశేషులు భీమార్జునల ధాటి కోర్వఁజాలకఁ బలాయనులైరి.

అంతట సైంధవుఁడు ద్రౌపదిని దిగవిడిచి తనయురదము నతిత్వరితముగఁ దోలుకొని రణభూమిని బాసిపోవుచుండ భీమార్జునులు వాని వెంటఁ దమయరదములఁ బరుగెత్తించికొని పోయిరి. అప్పుడు కిరీటి వానిహయసారథులఁ దునుమ నతఁడు రథము డిగ్గి పరుగిడిపోయి యొక్క గుల్మమధ్యమునఁ డాగెను. వృకోదరుఁ డదియెఱిఁగి పరుగెత్తిపోయి వానిశిరోజములఁ బట్టుకొని యీడ్చి తెచ్చి యుగమున నొక్కపోటుఁ బొడిచెను. అప్పు డర్జునుఁడు వానిఁ జంపవలదని వారింప, భీమసేనుఁడు వానితలఁ గొఱిగి, రాజవేషము వికల్పితము సేసి "ఓరీ! సభమీఁద నీవు పాండవదాసుఁడనని యెల్లరకుఁ జెప్పికొనుచుందువేని యిప్పుడు నిన్ను బ్రాణముతో విడిచెద; లేనిచో జమునిప్పీటి కతిథిఁ జేయుదు" నని బెదరించెను. సైంధవుఁడు భీతుఁడై యట్లు సేయుదుననఁ భీమార్జునులు వానిం బెడకేలు గట్టి యుధిష్ఠిరునిపాలికిఁ దోడ్కొనిపోయిరి.

ధర్మరాజు వానింజూచి యీ దురాత్ముని జంపినచో దుస్సల విధవయగుఁ గావున జంపవల"దని చెప్పి విడిపించి

"ఇట్లైనను సన్మార్గము నవలంబించి జీవింపు" మని వానికి బుద్ధిచెప్పి పంపించెను.

అంత నా సైంధవుఁడు గంగాద్వారమునకరిగి పశుపతి నుద్దేశించి యుగ్రతపము సేయ నద్దేవుఁడు ప్రత్యక్షమై వరము వేఁడుమనియెను. "దేవా! నేను పాండవులఁ జయించు నట్లు వరమొసంగుము" మన, భవానీపతి "ఓయీ! పాండవులఁ జయింప నమరులకైన నలవిగాదు అయినను నీకోర్కెఁ దీర్పవలయుఁ గాన విజయునిఁ దక్కఁ గడమవారిని నీవొకనాటి సంగరమున మాత్రము జయింపఁగలవు." అని వరమిచ్చి మహేశ్వరుఁ డంతర్హితుఁడయ్యె. పిమ్మట సైంధవుఁడు నిజపురమున కేఁగెను.

ఇటఁ బాండవులు కృష్ణాసహితులై నిజాశ్రమమునకు వచ్చి, మహర్షుల సాంగత్యముతో సుఖముగఁ గాలక్షేపము సేయుచుండ నొకనాఁ డొక విప్రుఁ డరుదెంచి "ధర్మరాజా! హరిణ మొకటివచ్చి నాయరణి నెత్తుకొనిపోయెను. నిత్యవిధికి లోపము చేకూరకుండ నయ్యరణిఁ దెప్పించి యి" మ్మని యడిగెను.

అంతఁ బాండవులేవురు నాయుధపాణులై యా కురంగము వెంటనంటి పరుగిడుచు నెన్ని సాయకములు సేసినను వానిలో నొక్కటియైన దానికిఁ దగులకుండెను. ఆ సారంగము వేగముగఁ బరుగెత్తుచు, పాండునందనుల నొక ఘోరాటవిలోనికిఁ దీసికొనిపోయి పిమ్మట నదృశ్యమయ్యెను. తమ కృత్యము నిష్ఫలమగుటకు [illegible] పాండవు [illegible] నయ్యేవురు నతిశ్రాంతులై యొక [illegible] విశ్రమించిరి. అప్పుడు

నకులుఁ డప్పాదపమునెక్కి దెసలు గలయఁ బరికించి, దూరమున సలిలములుగలవని యెఱిఁగి, వానిం దెచ్చి యగ్రజుల పిపాసఁదీర్పనెంచి వృక్షావతీర్ణుఁడై రయమునఁజని, ముందట నతిమనోహరమగు తటాకముఁ గని, యందలిజలములు ద్రావఁ బోవ నొక్క యశరీరభూత మాతని నుద్దేశించి

క. "ఓయన్న యీతటాకము
నాయది నీ విజలముఁ గొనఁగవలతేని
నాయడిగిన ప్రశ్నములకు
సయుతయుత్తరములిమ్ము తేటపడంగాన్."

అని పలికెను నకులుఁ డన్వచనములయెడ ననాదరముసేసి యా సలిలములు ద్రావినతోడనే నిశ్చేతనుఁడై తత్తీరమునఁ బడెను.

అట ధర్మనందనుండు నకులుఁ డేలకో తడసెనని సహదేవునిఁ గాంచి "తమ్ముడా! నీవేఁగి నకులునిజాడ నరసి సత్వరమున జలములు గైకొనిరమ్ము" అని యాజ్ఞాపింప నతఁడతిశీఘ్రగమనమున నేఁగి, కమలాకరతీరమునఁబడియున్న సోదరునిఁగాంచి, విస్మయవ్యాకులహృదయుఁడై, "ఇతఁడు నిశ్చేతనుఁ డగుట కేమి కారణ" మని యోజించుచు, తృష్ణాభరము నహింపనోపక జలపానము సేయఁబోవ, నాతనికిని నయ్యశరీరవాక్యములు వినవచ్చెను. సహదేవుఁ డవ్వచనములయెడ ననాదరముసూపి సలిలపానము సేసి వెంటనే యచ్చటఁ బడిపోయెను

అట యుధిష్ఠిరుండు "మాద్రేయు లేలకో తడసిరి ఇప్పటినమున వారి కేమిపత్తు సంభవించెనో" యని, సంతాపించుచు, "వారిజాడ నరసి సలిలములు గైకొనిరా" మ్మని

ధనంజయునిఁ బంప నతఁడును, నాతనియనంతరమున భీమ
సేనుఁడును నేఁగి, యాశరీరవచనముల నలక్ష్యముసేసి, పానీయ
ముల నాస్వాదించి తత్తీరమునఁ బడిరి.

అంతటఁ బాండవాగ్రజుఁడు నలువురుతమ్ముల్లు నేల
మనలిరో యని విచారగ్రస్తుఁడై వచ్చి, పద్మాకరతీరమునఁ
బడియున్న యనుజులఁగాంచి దుఃఖాక్రాంతచిత్తుఁడై "ఇది
యేమిమాయయో యని" పలుతెఱఁగుల విలపించి యధిక
పిపాసాతురుఁడై సలిలములు గ్రోలఁబోవ నెప్పటియాశరీరవాణి
యాతని నుద్దేశించి "రాజా! ఇక్కొలను నాయది. నేనడుగు
ప్రశ్నములకు నుత్తరము లిచ్చినఁగాని యీజలముల నాస్వా
దింపఁజనదు. నీ యనుజులు నావచనముల ననాదరముసేసి
జలపానముచేసి యిట్లు నిశ్చేతన్యులైరి" అని పలికెను. అంతట
యుధిష్ఠిరుఁ డంబరాభిముఖుఁడై "అయ్యా! నీవు రుద్రుఁ
డవో, పావకుఁడవో, పవనుఁడవో గావలయు; లేనిచో నీ యపా
మర గంధర్వాదుల కజేయులగు నాయనుజులఁ బడఁద్రోయు
సామర్థ్య మొరులకుఁ గలదే? నీ వెవ్వఁడవో, నీతలఁ పెయ్య
దియో యెఱిఁగించి నాహృదయవేదన నపనయింపుము."
అని వచింప, నొక యక్షుఁ డాతనియెదుట నిలిచి "నృపాలా!
నేనొక యక్షుఁడను; నాయనుమతి లేకుండ నీ తటాక
తోయముఁ గ్రోలిన మనుజులు విగతప్రాణులగుదురు. ధీశాలి
వగుటచే నీవట్టి యనుచితకార్యము జేయవైతివి. నాప్రశ్న
ములకుత్తరమిచ్చి యిందలి సలిలముల నాస్వాదింపుము."
మని చెప్పెను. "మహాత్మా! నీచిత్తమునకు వచ్చునట్లుగాఁ
జెప్ప నాబోంట్లవానికి శక్యమగునే? అయినను నా నేర్చు విధ

మునఁ జెప్పెద నడుగుము." అని ధర్మతనయుఁడువచింప, న య్యక్షుఁడు

క. "ఎయ్యది ధర్మమునకుఁ గుదు
రెయ్యది యాశ్రయము కీ ర్తికిమ్మగు మార్గం
బెయ్యది సురలోకమునకు
నెయ్యది సుఖములకు నిక్క మేర్పడఁ జెపుమా."

అని ప్రశ్నించెను.

క. "అమరఁగ దాక్షిణ్యము ధ
ర్మమునకు గుదురండ్రు కీర్తిమహిమ నెలవు దా
నము సత్యము సురపురి మా
ర్గము శీలము సంశ్రయము సుఖంబుల కెల్లన్."

అని యుధిష్ఠిరుఁడు దానికి సదుత్తరముఁ జెప్పెను.

అయ్యక్షుఁ డిట్లనేక ప్రశ్నము లడుగ ధర్మతనూజుఁడు వానికన్నిఁటికిఁ దగిన యుత్తరముల నొసఁగెను. అనంతర మతఁడు "నృపవరేణ్యా! మదీయ ప్రశ్నములన్నిఁటికి సదుత్తరము లిచ్చితివి గావున నీయెడఁ బ్రీతుఁడనై, నీయనుజులలో నొక్కని ప్రాణముల నీయఁదలంచితి, కావున నీయిచ్చవచ్చినవానిం గోరు" మన, ధర్మరాజు "మహాత్మా! నకులుని బ్రదికింపు" మని యడిగెను. "రాజా! పరాక్రమవంతులగు భీమార్జునులనువిడిచి, నకులు నేలఁగోరితి!" వని యడుగఁగ, గొంతేయాగ్రజుఁడు "ఆర్యా మాతండ్రికి, గుంతియు, మాద్రియునను పత్నులిరువురుగలరు. అందుఁ గుంతీపుత్రులము మువ్వురిలో నేనొక్కఁడను జీవితుఁడనై యుంటిని. కావున నిప్పుడు మాద్రీపుత్రులలోఁగూడ నొకఁడు జీవించుట ధర్మఁమని తలంచి నకులునిఁ గోరితిన"ని పత్యుత్తర మొసఁగెను.

అంత నయ్యక్షుఁడు "రాజోత్తమా! నీధర్మగుణమునకు నేను హర్షితుఁడనైతి; నీయనుజులు నలువురును లబ్ధజీవితులయ్యెద" రనుచుండ నంతలో భీమార్జున నకులసహదేవులు నిద్రవోయి మేల్కొనిన విధమున సముద్ధితులైరి. అప్పుడు యుధిష్ఠిరుఁడు హర్షావేశితుఁడై యక్షు నుద్దేశించి "మహాత్మా! నిన్నొక యక్షమాత్రునిగ విశ్వసింపజాలకున్నాఁడ; నీవు హరుఁడవో, సమీరణుఁడవో, లేక మజ్జనకుఁడగు ధర్ముఁడవో నిక్క మెఱింగించి నన్ను ధన్యుని జేయుము" అని వేఁడ. నయ్యక్షుఁడు "కుమారా! నేను ధర్ముఁడను, నీధర్మశీలము నెఱుఁగఁ గోరి, హరిణరూపధారినై బ్రాహ్మణునివి యరణిఁ దెచ్చితి. నిన్నిటుల శోధించి, పరీక్షించి సంతోషిత స్వాంతుఁడనైతి. నీవు కోరిన వరమొసంగెద యడుగు" మనియెను.

మత్తకోకిలము. "ఆదిదేవుఁడవైన నిన్ను దయామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడనైతి నింతకు నెక్కుడౌ
దేది గల్గెడునైన నాకిదియెల్ల నాఁడును గ్రోధమో
హామలం బెడఁబాసి ధర్మమునందు నెక్కొనఁ జేయవే"

అని యుధిష్ఠిరుఁడు వేఁడ నద్దేవుఁ డట్లె యొసంగి, విప్రుని యరణినిచ్చి, అజ్ఞాతవాసము సేయునప్పుడు వారి నెవరు తెలియకుండునట్లాశీర్వదించి యంతర్హితుఁడయ్యె.

పిమ్మటఁ బాండవులు పరమానందభరితమానసులై నిజాశ్రమమున కరిగి, ధరణీదేవునకు నరణిప్రదానము సేసి సుఖముగ నుండిరి.

## —♦ విరాటపర్వము ♦—

పాండునందనులు ద్వాదశవర్షములు వనవాసము సేసి,

త్రయోదశ వత్సరమున నజ్ఞాతవాసము మత్స్యభూనాథుఁడగు విరాటుని సన్నిధి నాచరింపఁ దలఁచి, యప్పటివఱకుఁ దమ్ముఁ బరివేష్టించియున్న ధౌమ్యాధి భూసురులను, బరిచారకజనములను సముచితాలాపములఁ బ్రీతులం జేసి వారివారి నిలయముల కనిపి, పిమ్మట విరటపురప్రాంతారణమున కేఁగి, తమ యాయుధములఁ గట్టఁగట్టి, యచటి ప్రేతభూమియందుఁ బడియున్న యొక శవముఁ దెచ్చి, తమ యాయుధములఁ గాంచి యెవరలు శవముగ భావించి దరిఁజేరకుండునటుల నా ప్రేతము నా యాయుధములపయిఁ బెట్టికట్టి, మహోన్నతమైన యొక్క శమీవృక్షముపై నానిచిరి.

పిమ్మటఁ బాండవాగ్రజుండు యతివేషమును దాల్చి కంకుభట్టాభిధానములో విరటు నాస్థానమున కేఁగి యమ్మహీకాంతునిచే మన్ననల నంది, ఎల్లప్పుడుఁ బుణ్యకథలఁ జెప్పి యాతని మనము రంజింపఁజేయుచు నచ్చట నివసించెను. భీమసేనుఁడు వలలుఁడను నామధేయమున నరిగి, రుచ్యములగు పాకములఁ జేయుచు భూమీశుని మెప్పుఁగాంచు చుండెను. ధనంజయుఁడు బృహన్నలాహ్వాయముతో నరుదెంచి, రాజానతిచే నాతని తనూజకు నర్తనముఁ గఱపుచుండెను. నకులుఁడు దామగ్రంథియనియు, సహదేవుఁడు తంత్రీపాలుఁడనియు నభిధానములతో నరుదెంచి విరటుని హయముల నొకరును, గోవుల నొకరును గాపాడుచుండిరి. కృష్ణ సైరంధ్రీవేషము దాల్చి మాలిని నామధేయముతో, విరటుని దేవియగు సుధేష్ణపాలికిఁబోయి "దేవీ! సింహవిక్రములైన యేవురు గంధర్వులకేను ధర్మపత్నిని, ఒక్క కారణమున నొక్కవత్సర

మేము పతుల నెడబాసియుండవలసె; నీవు ధర్మవర్తినివని విని నీకడ నివ్వత్సరముఁ గడుపఁ దలఁచి వచ్చితి; అతిసీచకృత్యములకు నన్ను నియోగింపక, కుసుమమాలికలఁ గట్టుటయు జడలల్లుటయు నాదిగాఁగల పనులు నాచేఁ జేయించుకొనుచుండు"మని వచింప, సుధేష్ణ యందులకు సమ్మతించి ద్రౌపదిని దనకడ నునిచికొనియె. కృష్ణ, సుధేష్ణ యిచ్చానువర్తినియై మెలఁగుచు నామెచే మెప్పుఁగాంచుచు సేవించుచుండెను.

ఇట్లు పాండవులు కృష్ణాసహితముగా విరటుపురమున వర్తించుచుఁ, గతిపయ దినములు గొఱంతగా వత్సరకాలము గడపిరి. అంత నొకనాఁడు మత్స్యభూనాథుని మఱఁదియు, దండనాథుఁడునగు గీచకాభిధానుఁడు దనయక్కం జూచువేడ్క నంతఃపురమున కరుదెంచి, పాంచాలినిఁ గాంచి మోహితాత్ముఁడై తనయభీష్టము నామెకుఁ దెలుప, నాసాధ్వియును నయవాక్యములతో వానిని మరలింపనెంచి "అన్నా! నేనట్టి దుర్భాషలను విననోపను; నన్ను నీసోదరినిగ భావింపు" మనియె. ఆదుష్టుఁ డవ్వచనములు నాలింపక "కోమలీ! నిమ్నకుహాస్తము లెత్తరవారి నీట్లూడిగము సేయుచేల? నన్నుఁ జేపట్టి రాజభోగముల ననుభవింపుము" అని పలుక, ద్రౌపది "దురాత్మా! దుర్వారప్రతాపులగు నాపతులు నీప్రాణములఁ బొలిగొందురు. ఇచ్చవచ్చినట్లు వదరక సత్వరమున నిట నుండి వెడలు"మని గద్దించెను.

అనంతర మతఁడు సుధేష్ణపాలికేఁగి తన మనోరథము నామె కెఱిఁగించి "అక్కా! ఎవ్విధముననైన నత్తసోదరిని నా

కొనఁగు"మని వేఁడెను. "తమ్ముఁడా! పరవతీ సాంగత్యఁ మఘప్రదముగాదె? మఱియు నయ్యువిదకు సింహవిక్రములగు గంధర్వు లేవురు పతులు గలరు. వారివలన నీకెట్టి కీడు మూడునోయని నాకు భీతి వొడముచున్నది. అట్టియుపద్రవ కరమైన యువిదస్నేహము నీకేల? ఆమెయందలి ప్రీతివిడువు" మని సుధేష్ణ హితోపదేశమునుజేయఁ, గీచకుఁడు "అక్కా! నీకింత భయమేల? ఈ భూవలయమున నన్నెదిరింపఁజాలిన వీరుఁడు గలఁడే? నీవు భీతినుడిగి యాసుందరి నెట్లైన నాకొనఁగుము. దానితో నానందింపనియెడల నామేనఁ బ్రాణములు నిలువ" వనుచు నామూర్ఖుఁ డద్దేవి నధికముగఁ బ్రార్థించెను. "వీఁడిఁక నిప్పాపాచరణమునుండి వెనుదిరుగఁడు. ఏమి సేయుదు" ననుచు సుధేష్ణ మనమునఁ జింతించి, యనుజుని ప్రార్థనఁ ద్రోసివేయఁజాలక "అనుజా! నీవిపు డింటి కేఁగుము. సుర దెచ్చు నెపమున నమ్మానిని నీమందిరమున కనిపెద; అప్పుడు నీమనోరథము దీర్చుకొనుము." అని గద్గదకంఠయై చెప్పెను. అంతఁ గీచకుఁడు ముదితహృదయుఁడై నిజమందిరమున కరిగి మనమునఁ బాంచాలిని స్మరించుచు గడియ యొక యుగముగఁ గడపుచుండెను.

పిమ్మట సుధేష్ణ ద్రౌపదిఁ గాంచి "కీచకుని యింట రుచ్యమైన వారుణిగలదు; నీవట కేఁగి త్వరితముగ దానిఁ దెచ్చి యిమ్మ"ని యానతిచ్చెను. "దేవి! నన్నట్టి నీచకృత్యములకు నియోగింపవలదని మొదటనే మనవిఁజేసితినిగదా" యని ద్రౌపది వినయముతో వచింప, సుధేష్ణ "సఖి! దీనిని నీచకృత్యముగ నెంచితివా? కీచకుఁడు నాయనుజుఁడేగానియన్యుఁ

డుగాడు. కావున నీవటులేఁగ సంశయింపవల"దని బదులు చెప్పెను. అంతటఁ బాంచాలి "ఇఁక నీమె కెదురాడుట యనుచిత"మని తలంచి మనమున ననేక విధములఁ జింతించుచు, హృదయమునఁ బరమేశ్వరుని ధ్యానించుచు నంతఃపురము వెలువడి దినకరునిఁ గాంచి కేలు మొగిచి

తే. "పాండుపుత్రుల నేను దప్పని మనంబు
గలుగుదాననయేని యో కమలమిత్ర!
కీచకుని పాప నన్నొక కీడు తెరువు
వొరయకుండఁగ రక్షింపు కరుణతోడ."

అని వేఁడి, యద్దురాత్ముని గేహమునకుఁ జని "దేవి వారుణిం దెమ్మని యానతిచ్చె; సత్వరమునఁ బోయింపు"డనియె.

ఆమె రాక కెదురుచూచుచున్న యాకీచకుఁడు సంభ్రమాన్వితచిత్తుఁడై "ఓ లతాంగి! వారుణి నింకొక సఖిచే దెప్పించెద; నీవు నా మనోరథముఁ దీర్చు" మనుచు దిగ్గున నామె హస్తముఁ బట్టుకొనెను. అప్పుడు దైవబలము తన్నావేశింప ద్రౌపది యధికబలోపేతయై యాసింహబలుని పట్టు విడిపించుకొని వాని మందిరము వెలువడి మహాసత్త్వముతో, పరుగెత్తుచు విరాటుని కొలువుకూటమున కరుదెంచెను. ఆమె వెనువెంటనే కీచకుఁడును పరుగెత్తుచు వచ్చి యాసభామధ్యమున నప్పుణ్యస్త్రీని నొక్క తన్నుఁ దన్నెను.

భక్తవత్సలుఁడైన యాదిత్యుఁడు ద్రౌపది తన్నుఁ బ్రార్థించినంతనే ప్రీతుఁడై యాసాధ్వీమతల్లిఁ గాపాడ నొక్క-దానవు నామెవెంటఁ బంపించెను. అద్దనుజుఁ డదృశ్యాకారుఁడై వచ్చి, ద్రౌపదిని సింహబలుఁడు తన్నినతోడనే, తా నద్దురాత్ము నొక్కపోటు బొడిచెను. కీచకుఁ డాపోటునకుఁ

గడునలిగి, తన్నుఁగొట్టినవానిని గనుగొన నేరకఁ గోపమున నరగమువలె రోజుచుండెను.

అప్పుడా వభలోనున్న వృకోదరుఁడు ద్రౌపదికిఁ గలిగిన యవమానమును గాంచి సహింపనోపకఁ గ్రోధావేశితుఁడై, కీచకునిఁ బరిమార్పనెంచి యగ్రజుని ముఖము నవలోకింప ధీశాలియగు న ధర్మరాజు భీమసేను నుద్దేశించి

మ. "బలుఁడై కృష్ణుఁడు దాఁచె నొండెడన సేవ్యత్వాంగజముల్ పుట్టవే
ఫలితంబై కరశాఖలొప్పఁగననల్ప ప్రీతిసంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీభూజము నంటఁ గట్టియలకై ఖండింపఁగా నేటికిన్"

అనుచు, నచ్చోటనున్న యొక మహీరుహమును గనుంచి పలికి సైగల గూఢార్థయుక్తముగఁ బలికి యాతని ప్రయత్నమును వారించెను. విరటుఁ డవ్విషకృత్యమును గాంచి సహింపనోపకయు, మహాబలశాలియగు మఱఁదిపయిఁ దన కోపముఁ జూపఁజాలక, "ఇట్లు సేయఁదగ" దని శాంతవచనములం జెప్పి యాతని నింటి కనిపి, పరిభవానల సంతప్తమానసయై యున్న ద్రౌపది నూరార్చి యంతఃపురంబున కనిపెను.

సుధేష్ణ కృష్ణఁ గాంచి "నెచ్చెలీ! నీ విట్లు విచారాక్రాంతవై యుంటి వేల?" అని యడుగ, నామె "దేవి! నీ వెఱింగియు నిట్లడిగిన నేనేమి చెప్పుదును? అయినను విను" మని కీచకుని దుశ్చేష్టితమంతయు సవిస్తరముగఁ జెప్పెను. "నారీమణీ! నీవు ఖేద మడఁగుము. నేను కీచకునిఁ బిలిచి శిక్షించెద" నని సుధేష్ణ వచింప, ద్రౌపది "ఆ నీచాత్ముని నా పతులే శిక్షింపఁగల" రని పలికి యా నాఁడు మజ్జన భోజనముల నొనరింపక దుఃఖాతిశయమున నడలుచుండెను.

ఆ నాఁటిరాత్రి యెల్లయును నిద్రించినపిమ్మటఁ గృష్ణ మెల్లమెల్లగా [illegible], మహానసగృహమునఁ బరుండి యున్న వడముడిపాలికిఁ బోయి

ఉ. "నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుభోచిత శయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణమెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు గలదన్న నొకో దయమాలి తక్కుటా."

అనుచు దుఃఖింప, నతఁడామె నూఱడించి "సతీ! మన యజ్ఞాతవాసమునకు భంగము నేకూరకుండునటుల నద్దురాత్ము నతిరహస్యముగఁ జంపవలయు; ఆ మదోన్మత్తుఁడు మరల నీ కడ కరుదెంచెనేని నీ వతి చతురముగ మాటలాడి, వాని యభీష్టమును దీర్ప నంగీకరించినట్లు నటించి, వాని నొంటిగా నర్తనశాలకు రమ్మని చెప్పుము. అయ్యధము నచ్చటఁ బరిమార్చి నీకు సంతసముఁ గలిగించెద. కావున నీవు మూఁడిల్లి శయనస్థానమున కేగి పరుండుము" మని చెప్పి పంపించెను.

ద్రౌపదియందు బద్ధానురాగుఁడై యున్న సింహబలుఁడు మరల నెవ్విధముననైన ప్రతిమాలి యామెం జేపట్ట నిశ్చయించుకొనినవాఁడై, మఱునాఁడు [illegible] కరుదెంచి పాంచాలిఁ గాంచి "కమలనేత్రీ! ఏల నన్నిట్లా యాసపెట్టెదవు? ఇంక నైన నా యందుఁ గరుణవహింపుము. నీవంగీకరింపకున్న, నా, బలిమి నైన జేపట్టుదు గాని విడుచువాఁడను గాను." అని వచింప నత్తలోదరి "[illegible] రహస్యము లేక, బహిరంగముగ నిల్లు నన్నుఁ బరిగ్రహింప నెంచిన నే నెట్లు సమ్మతింతు" ననియె. అతఁడ దవ్వచనములకుప్పొంగి "లలనామణీ! నీవే సమయమున నెచటికి రమ్మనిన నచటికి వచ్చెద. ఆ సతీయు"

మన, నామె "బృహన్నల పగలెల్లయు స్త్రీలకు నర్తనముం గఱపి వెడలిపోవును గాన రాత్రులందు నర్తనశాల నిర్మానుష్యముగ నుండును నేఁటిరాత్రి యొంటరిగ నటకు వచ్చెదని నీయభీష్టమును దీర్తు" నని చెప్పెను. ఆదుష్టాత్ముఁ డవ్వచనముల నానందభరితమానసుండై నిజమందిరమున కరిగి, సూర్యాస్తమయమునకు నిరీక్షించుచుండెను. కృష్ణ యావృత్తాంతమును భీమునకు రహస్యముగఁ జెప్పెను.

నాఁటిరాత్రి జనులెల్లరు నిద్రాపరవశులైన పిమ్మట భీమసేనుఁడు నిజసతిఁ దోడ్కొని నర్తనశాలకుఁ బోయెను. అనంతర మచటికి సాహ్లాదపూరితాంతఃకరణుఁడై కీచకుఁ డరుదేర వృకోదరుఁడు వాని నెదుర్కొనియె. అంతట, కీచకుఁడు పవనతనయునితో నతి ఘోరముగఁ గొంత తడవు మల్లయుద్ధముఁ జేసి పిమ్మట నమ్మహాసత్త్వునిచే నిహతుఁ డయ్యెను. భీమసేనుఁడు ద్రౌపదికా నీచునిశవముఁ జూపించి నేత్రపర్వము సేసి "సుదతీ! నీవింక నిటఁ దడయక యంతిపురి కేఁగు" మని చెప్పి తాను మహానస శాలకేఁగి శరీరప్రక్షాళనము చేసికొని శయనించెను.

ఇట ద్రౌపదియు సంతోషపరవశయై నర్తనశాల వెలుపడి కావలివారలఁ బిలిచి "దురాత్ముఁడైన కీచకుని నా పతులు సంహరించిరి చూడుఁ" డన వార లతిత్వరితముగఁ బరుగులిడుచు వచ్చి యా దురాత్ముని కళేబరమును గాంచి సంతోషించిరి. అప్పుడు కీచకుని తమ్ములా కలకలము విని యచటి కరుదెంచి తమ యగ్రజుని శవమునుగాంచి దుఃఖితులై "ఇప్పాపినిమూలముననే యింత ఘోరము జరిగె.

కావున దీనిఁగూడ మన యగ్రజునితో దహనము సేయుద" మనుచు ద్రౌపదినిఁ బట్టుకొనిఁ యాశవము పయిఁ బెట్టి కట్టి మోసికొని పోవుచుండ నామె కడు భీతినొంది "నాథులారా! గంధర్వోత్తములారా! ఉపకీచకులు నన్నుఁ దమ యన్న శవముతో దహనము సేయఁ గొంపోవుచున్నారు మీరు వేవేగ వచ్చి నన్ను విడిపింపు" డనుచు నాక్రందనము చేసెను.

వృకోదరుఁ డయ్యాక్రందనము నాలించి త్వరితగమనమున నరుదెంచి యొక్క మహీరుహముఁ బెకలించి చేతఁ బట్టుకొని, ప్రేతభూమి కేఁగుమార్గమున నడ్డముగ నిలిచెను. ఉపకీచకులా రౌద్రమూర్తినిఁ గాంచి భయావేశితులై "గంధర్వులు వచ్చుచుండిరి" యనుచు ద్రౌపది నటఁ బడవైచి పరుగు లిడనారంభించిరి. వాయుతనూజుఁడు వారలందరిని పట్టుకొని యానూట యేవురిలో నొక్కొక్కని విడువక నందఱిని జమసదనమున కనిపి, ద్రౌపదీబంధమోక్షముఁ గావించి యొకరికిఁ దెలియరాకుండఁ దాను మరల వంటసాల కేఁగి పరుండెను.

ద్రౌపది ప్రమోదభరిత మానసయై సరోజహితుఁ డుదయించిన పిమ్మట సంతోషపూర్వమున నరుదెంచె, మాలిని మూలమునఁ దన తమ్ములందఱును గంధర్వులచే హతులైరని శోకసంతప్తమానసయై యున్న సుధేష్ణ యామెం గాంచి "వనితా! నీ కతన మా రాష్ట్రము విపత్తు యొదవినట్లె [illegible] చెప్పెను "దేవీ! ఇఁకఁ బదుమూఁడు దినములు మా [illegible] సెలవు [illegible] గీరింపుఁడు. పిమ్మట నాపతులు

వచ్చి మీకుఁ బ్రియము చేసి నన్నుఁ గొంపోవుదు" రని
ద్రౌపది వినయముతో వచింప సుధేష్ణ యందులకు సమ్మ
తించెను.

అట దుర్యోధనుఁడు, అజ్ఞాతవాసముఁ జేయుచున్న
పాండవు లెటులైనఁ గనుగొని వారిని మరల నరణ్యవాస
మున కనుపనెంచి "సమస్త దేశములు, నరణ్యములు వెదకి
పాండవులజాడ నరసిరం" డని చారుల నంపెను. ఆచారులు
మహీతలము నంతయు నెమకియుఁ బాండునందనులఁ
గనఁగొనఁజాలక మరలివచ్చి "అవనీతలేంద్రా! వసుధావలయ
మంతయుఁ బరిశీలించితిమి; పాండవులజాడ యెచ్చటను
గానరాలేదు. ఒక్క విశేషము మాత్ర మెఱిఁగి వచ్చితిమి.
మనవైరియగు మత్స్యభూనాథుని మఱఁది యొక సుందరిని
గామింప నామె పతులగు గంధర్వు లర్ధరాత్రమున నరుదెంచి
మల్లయుద్ధము చేసి, యనుజయుతముగ నాతనిఁ జంపి" రని
విన్నవించిరి.

అంతఁ గౌరవేశ్వరుఁడు మిత్రామాత్యుల నవలోకించి
"కీచకుఁడును, భీముఁడును, బలరాముఁడును, శల్యుఁడును
సమానబలవంతులు; మల్లయుద్ధమున వీనలువురిలో నొకరి
నొకరు జయింపవలయునేగాని, యన్యులు వీరలఁ జయింప
నేరరు. ముష్టియుద్ధమున బక, జరాసంధాదిమహావీరులఁ బరి
మార్చిన భీమసేనుఁడే, గంధర్వులను నెపమునఁ గీచకుని
వధించియుండనోపు; ఆయువతి ద్రౌపదిగావలయు; పాండవులు
విరటునిప్రోల నివసించుచుండిరి గాఁబోలు; మన మిప్పుడు
మత్స్యభూమీశుపైకి దాడి వెడలి, యాతని గోగణముఁ

బట్టుకొనదమేని, విరటునితోఁ బాండవులును రణమున కరు దెంతురు. అప్పుడు వారికి సమయభంగముఁ జెప్పి మరలఁ నరణ్యమునకుఁ బంపవచ్చును. పాండవు లచ్చట లేనిచో మత్స్యనాథుని సమస్తవస్తువులను జూఱగొందము. అన్ని విధముల మన కీసండయాత్ర లాభకారియగు" నని వచింప, నాతనిమిత్రులెల్లఱు నదియే కర్తవ్యమనిరి.

అంతట దుర్యోధనుఁడు తనకు సఖుఁడును, త్రిగర్తదేశ నాథుఁడునునైన సుశర్మనుగాంచి "ప్రియవయస్యా! ముందు నీవు సైన్యయుతముగ నేఁగి విరటుని ధేనువులఁ గొన్నిటిని బట్టుకొనుము." అని చెప్పి పంపించి, మాఱుదినమునఁ దాను భీష్మ, ద్రోణ, కృప, కర్ణా శ్వత్థామాది యోధవరులతోఁ బయనమయ్యెను.

సుశర్మ యపారసేనతో నేఁగి దక్షిణదిశయందున్న విరటుని పశుగణముఁ బట్టుకొని గోపాలురువచ్చి విరటున కవ్వార్త దెలిపిరి. అంత నతఁడు రోషావేశుఁడై సమరమున కేఁగు చుండ ధర్మరాజాతనిపాలికిఁబోయి "మహీపాలా! నేను మున్నొకఋషివరునికడ ధనుర్విద్యఁ గొంచె మభ్యసించి యుంటిని. మనవలల, దామగ్రంధీ, తంత్రీపాలురును శూర లముగ రణముసేయఁగలరు; కావున వారలఁ గూడి సమర భూమికేతేర నాకనుజ్ఞనొసఁగు" మని పలుకఁ విరటుఁడలరి యా నలువురిని రథారూఢులఁ జేసి రణరంగమునకుఁ దోడ్కొని పోయెను.

అనంతర మిరువాగులవారు నతిశౌర్యముతోఁ బోరాటము సలిపిరి. సుశర్మ విరటు నెదుర్కొని కొంతతడవు వాయోధ

నము నేసి యాతని వాహసారథులం జంపి, విరథుండైన మత్స్య
నాథునిం జెఱబట్టెను. అప్పుడు యుధిష్ఠిర, భీమ, నకుల,
సహదేవులు తమ విక్రమము మెఱయ నిశితసాయకములం
బ్రయోగించి శాత్రవసైన్యమును దైన్యము నొందించి, మత్స్య
పతినిం జెఱనుండి విముక్తుం జేసి, సుశర్మం జెఱంబట్టిరి.

అప్పుడు విరటుండు సంప్రీతుండై కంకవలల దామగ్రంథి
తంత్రీపాలుర శౌర్యముం బొగడి "వీరవరేణ్యులారా! మీ
కృపవలన నేను శాత్రవులచే మానహానియుం, బ్రాణహానియు
నొందక మరల విముక్తుండనైతి; మీకుం గోరిన యభీష్టముల
నొసంగెద నడుగుం" డని గౌరవపూర్వకముగ వచింప, యుధి
ష్ఠిరుండు "నృపాలా! ఈ స్వల్పకార్యమునకు మమ్మింతగం
బొగడనేల! అయినను నీవు నాయభిమతముం దీర్పనెంతు
వేని యీ సుశర్మను సైన్యయుతముగం జెఱవిడిచి పుచ్చుము.
ఇదియే నా యభీష్ట" మని చెప్పెను. అంత నమ్మత్స్యమహీ
కాంతుండు త్రిగర్తనాథునిం జెఱవిడిచి యాధర్మశీలునకు
సంతసముం గలిగించెను.

ఆసమయమునం గౌరవులు వచ్చి యుత్తరదిశయందున్న
ధేనువ్రాతముం బట్ట నచటి గోపాలకులు తను జేరి కొమరుం
డైన యుత్తరున కవ్వార్త నెఱింగించిరి. ఉత్తరుండు కౌర
వుల పరాక్రమము నెఱుంగనివాం డగుటవలన వారిని సామా
న్యులంగాం దలంచి "నే నీక్షణమునం బోయి కురువాహినిం
జెండాడి పశువర్గముం దోలికొని రాంగలనుం గాని నాకు
దగినసారథి లేండయ్యె;" అనుచు గర్వాతిశయమునం బలుక,
ద్రౌపది యప్పలుకు లాకర్ణించి, తమ యజ్ఞాతవాసవత్సరము

గడచుటఁదలఁచి యుత్తరునితో "రాజనందనా! మన బృహన్నల మున్నొకపరి ధనంజయున కత్యంతప్రియముగ సారథ్యముసేయు నేగాంచితి; ఇత్తరి నీకు సారథ్యముసేయ నతఁడే యర్హుఁడ" ని చెప్పెను. అంత నుత్తరుఁడు బృహన్నలను రావించి తనకు సారథ్యముసేయుమని యడుగ నతఁ డందుల కంగీకరించి తే రాయత్తముసేసి తెచ్చెను. సైన్యమంతయు విరటునితో దక్షిణదిశ కేఁగినందున నుత్తరుఁ డొక్కఁడే రథారూఢుఁడై రణంబున కేఁగుచుండెను. అప్పుడు రాజపుత్రియగు నుత్తర యా యిరువురిని గాంచి "మీరు కురువీరులం జయించి వచ్చునప్పుడు వారల శిరోవేష్టనంబుల నుత్తరించి తెచ్చి మా బొమ్మల కీయుఁ" డని చెప్పెను.

బృహన్నల యతిత్వరితముగఁ దేరు నడుపుచుండ నేఁగుచు నుత్తరుఁడు దూరమునఁ గౌరవవాహినిం గాంచి భయకంపితగాత్రుఁడై "బృహన్నలా! కౌరవయోధులం గాంచినంతనే నాకు భీతిపొడముచున్నది. వారితో నేనని సేయఁ జాలను. కావున నీవు మన రథమును మరలుపు" మనియె. "రాజకుమారా! మన మిప్పుడు మరలిపోయినచోఁ బ్రజలెల్లరు నగరే? ధైర్యమూనుము. శాత్రవానీకముం జయించి గోబృందమును మరల్చి పురికిఁ బోవుద" మనుచు బృహన్నల మందహాసాంచిత వదనారవిందుఁడై రథము నురువేగమునఁ దోలసాగెను.

అంత నుత్తరుఁడు "ఈ బృహన్నల నా వచనముల సరకుసేయక నరదముఁ బరుగెత్తించుచుండె; కానిమ్ము; వీరి కాకౌరవులే బుద్ధిసెప్పుదు" రని యోచించి బాణాసనము

వగదముపయిఁ బెట్టి తాను ధరణిపైకి దుమికి పరుగిడఁ దొడఁగెను. ధనంజయుఁ డదిగాంచి తాను స్యందనము దిగివచ్చి యాతనిఁ బట్టుకొని "రాజకుమారా! నీవిట్లు పరుగెత్తి పోవలదు. భీతినుడిగి నాకు సారథ్యము సేయుము. నేను కౌరవులఁ జెండాడెద" నని వచింప, నుత్తరుఁ డాతనిపట్టు విడిపించుకొనఁజాలక సారథ్యము సేయ నరద మెక్కెను. అంతటఁ బాండవమధ్యముఁ డాస్యందనమును మున్ను తమ యాయుధములఁ దాచిన శమీవృక్షముకడకుఁ దోలించుకొనిపోయి "నృపకుమారా! పాండుతనూజులు తమతమ యాయుధముల నిమ్మహీరుహమున దాచి యజ్ఞాతవాసము నలుప నేఁగిరి. వానిలో ధనంజయుని గాండీవము, గైకొని నేనివ్వ డనిసేయ నేఁగెద. కావున నీవిప్పా దపము నధిరోహించి దానిందెచ్చి యి"మ్మని వచింప నుత్తరుఁడు విషాదముఖుఁడై "బృహన్నలా! పాండవులు మాకు బాంధవులు; అమ్మహనీయులు తమ యాయుధముల నిచట నునిచి యెటకేఁగిరో నీవెఱింగినఁ దెలుపు"మని సస్నేహముగ నడిగెను. అంతట విజయుఁడు కంకవలలదామగ్రంథి తంత్రీపాలురు యుధిష్ఠిర భీమ నకుల సహదేవులనియు, మాలిని కృష్ణయనియుఁ దాను ఫల్గునుఁడనియు, నజ్ఞాతవాసముసలుప నిట్లు మాఱువేసముల దాల్చితిమనియు, గంధర్వులనెపమునఁ గీచకుల నందఱినిఁ బరిమార్చిన వీరవరుఁడు భీమసేనుఁడనియుఁ దమ వృత్తాంతమంతయు నాతనికి సవిస్తరముగ నెఱిగించెను. ఉత్తరుఁ డవ్వృత్తాంతము విని సంభ్రమాశ్చర్యస్వాంతుండై గాండీవముఁ దెచ్చి పార్థున కొసఁగెను. సవ్యసాచి యమ్మహనీయచాపముఁ గేలఁ బూని నియతాత్ముఁడై

జగదీశ్వరునిఁ బ్రార్థింప నప్పేడిరూపముపోయి నిజరూపము వచ్చెను. ఉత్తరుఁ డాదివ్యమూర్తిం గాంచి హర్షపులకితాంగుఁడై యమ్మహానీయునకు దండప్రణామము లాచరించి "మహాత్మా! నా భాగ్యవశమున నేఁడీ వృత్తాంతము వింటిని భవదీయ నిజరూప సందర్శనముచే నా భీతి యంతయుఁ దొలఁగె; సంతసముతో నీకు సారథ్యము సేయుదు" ననుచుండ ధనంజయుఁ డాతని నాలింగనము సేసికొని "కుమారా! మనస్సాదనము పరిత్వరితముగఁ గౌరవవాహిని కడకుఁ దోలు" మని ప్రియపూర్వకముగఁ బలికి, తన దేవదత్తముం బూరించెను.

ఆ శంఖారావము నాలించి ద్రోణాచార్యుఁడు "దేవదానవుల కజేయుఁడగు విజయుఁడు వచ్చుచుండె" నన దుర్యోధనుఁడు "అర్జునుఁడు వచ్చినచో, సహోదరులఁగూడి మరల నరణ్యమున కేగవలయు," నని పలికెను. అం ప్రపితామహుఁడు పాండవు లరణ్యమున కరిగిన దాది నాఁటికిఁ గడచిన కాలమును లెక్కించిచూచి పదమూఁడువత్సరములు నిన్నటితోఁ గడిచె నని చెప్పెను.

అంతలో ధనంజయుఁ డరుదెంచి భీష్మ ద్రోణ కృపాచార్యులకుఁ జరణసమీపస్థలములనిలువ రెండును, కర్ణాభ్యర్ణ ప్రదేశములఁ జన రెండునుగా నాలుగేసి యమ్ములను విడచి, కౌరవవాహినిం గలయఁజూచి తనస్యందనమును గోవులున్న దెసకుఁ దోలనాజ్ఞాపించెను. గురు, కృప, గాంగేయులు, కిరీటిబాణపాతప్రకారములు ప్రణామ, కుశలప్రశ్నములుగా నెఱింగి, యాతనికిఁ దమయెడఁగల గౌరవాతిశయమునకెం తయు సంతసించిరి

అంత నర్జునుఁ డతిరయమున గోవులున్న స్థానమునకేఁగి యచటి సైన్యమును భీభత్సము నేసి ధేనుచయమును మరల్చి గోపాలుర కప్పగించి, కురుపతినెదుర్కొనఁబోవుచుండ భీష్మ ద్రోణ కృప కర్ణాశ్వత్థామాదియోధులెల్ల రాతని కడ్డుపడిరి, సవ్యసాచి నిజకౌశలము మెఱయ వారితోఁ గొంతతడ వాయోధనము సేసి, పిమ్మట నమ్మోహనాస్త్రముం బ్రయోగింప నెల్లరు నమ్మోహనాస్త్రమునకు బద్ధులై మైమఱచి తమ తమ రథములపయిఁ బడిరి. అప్పుడు గాండీవి, యుత్తరయభీష్టముం దీర్పనెంచి యుత్తరునిచే వారలతలపాగలఁ గోయించి తెప్పించెను. మందాకినీనందనుఁడు మాత్రమయ్యస్త్రమునకుఁ బ్రతి సేతెంగినవాఁడగుటచే నిద్రితుఁడుగాక విజయునెదుర్కొన, నయ్యుర్విక్రముఁడు నిశితసాయకములఁబఱపి పితామహుని నొప్పించి రణభూమినిడిచి యరుగుచుండెను.

అంతలో కౌరవు లందఱును లేచి మరల నాతనితోఁ బోర నెంచుచుండ సురనదీసూనుఁడు సుయోధనుని నవలోకించి "ధనంజయుఁడు ధర్మశీలుఁడగుటచే వీరెల్లరు మైమఱచి పడియున్నపుడు తలలం గోయక తలపాగలఁ గోసి తీసికొని పోయె; మరల రణమునకేఁగినచో నతఁడు మనలం బూర్ణాహుతి సేయక మానఁడు. కావున నింకట సమరముఁ జాలించుట యుక్త"మని చెప్పెను. అంతట దుర్యోధనుఁడు భిన్నాంతఃకరణుఁడై తనబలములఁగూడి నిజపురాభిముఖుఁడై వెడలెను.

అనంతరము ధనంజయుఁ డాస్యందనమును శమీవృక్షము కడకుఁ దోలించుకొనిపోయి గాండీవము నచ్చటనునిచి తాను మరల బృహన్నల వేషముం దాల్చి "కుమారా! కౌరవులను

నేను జయించితినని యేటికిఁ దెలుపవల"దని యుత్తరునకుఁ జెప్పి యరదముఁ దోలుచు రాజప్రసాదమునకు వచ్చుచుండెను.

విరటుఁ డంతకుమున్నే పరివారయుతుఁడై కోట కరుదెంచి, నిజనందనుండు కౌరవులఁ జయించి వచ్చుచుండెనను వార్త నాలించి సంతోషితాంతరంగుఁడై, యాతని విజయముఁ బురమునఁ జాటఁ బనిచి, యుధిష్ఠిరునితో వినోదముగ జూదమాడుచు "నా కొమరు, డొక్కరుఁడు నేఁగి కౌరవయోధులఁ జయించి వచ్చుచుండెను. ఇట్టి పరాక్రమశాలి యెందైనఁ గలఁడే" యనుచు హర్షాతిశయమునఁ బలికెను. "వసుధాధిపా! భీష్మద్రోణకర్ణాదియోధులఁ జయించి ధేనువులం దెచ్చినవాఁడు బృహన్నలగాని, యుత్తరుఁడు గాఁడు. కావున బృహన్నల విజయముఁ బురమునఁ జాటఁ బనుపు" మని యుధిష్ఠిరుఁడు దరహాసితాననుఁడై వచింప, విరటుఁడు క్రుద్ధుఁడై, "నా తనయుని విజయము నసత్యము సేసి పేడి జయించెనని చెప్పెదువా?" యనుచుఁ దన హస్తమునందున్న సారె నమ్మహాత్ముని పైకి విసరివైచెను. అది ధర్మతనూజుని ముఖమునఁ గొట్టుకొని రుధిర మొలుకుచుండ నది గాంచి ద్రౌపది తత్తరమున నేతెంచి యాశోణితముఁ గ్రిందఁ బడనీయకఁ దన వస్త్రముతోఁ దుడుచుచుండెను. మహీవల్లభుఁ డది గాంచి "ఇట్లు సేయనేల" నని ద్రౌపదినిఁ బ్రశ్నింప, నాసాధ్వి "ఈ మహనీయుని రక్తబిందువులు ధరణిపై నెన్నిబడిన నన్ని వర్షము లాదేశమున ననావృష్టి సంభవించు; కావున నేను దానిం గ్రిందఁ బడనీయక నాపుచుంటి" నని యాతనికిఁ బ్రత్యుత్తర మొసంగెను.

అంతలో నుత్తరుం డచటికి వచ్చి యుధిష్ఠిరునకు నమస్కరించి యాతని ముఖమునందలి గంటిఁ జూచి "పుణ్యచరితా! ఇదేలఁ గలిగె" నని యడుగ, విరటుఁడు తా నాతనిఁ గొట్టిన విషయము నవిస్తరముగా నెఱిఁగించెను. ఉత్తరుఁడది విని "తండ్రీ! నీ విమ్మహాపురుషుని యెడ గొప్ప యపరాధము సేసితి" వన, విరటుఁడు పశ్చాత్తప్తమానసుఁడై ధర్మతనూజునకుఁ బ్రణమిల్లి "మహానీయా! నా యపరాధము సైచి ప్రసన్నుఁడవు గ" మ్మని వేడెను. "నృపాలా! ఈ మాత్రమునకై నన్నింతగ వేడవలెనా! క్రోధము నా కెన్నఁడును గలుగ" దని యజాతశత్రుఁడు సంప్రీతుఁడై వచించెను. అంతట మత్స్యభూనాథుఁడు కొమరునాలింగనము సేసికొని "కుమారా! నీవు గాంగేయ, కుంభసంభవాది యోధవరులఁ జయించి వచ్చిన విధము నెఱిఁగింపు" మని కౌతుకమున నడుగ నుత్తరుఁడు "జనకా! కౌరవానీకముఁ గాంచిన తోడనే నేను భయాకులితచిత్తుఁడనై వెనుకకు వచ్చుచుండ నొక దివ్యపురుషుఁ డేతెంచి నాభీతి నుడిపి తా నొక్కరుఁ డవ్వాహినినంతయు బీభత్సము గావించి మన పశుగణమును మరల్చె" ననుచు సమర వృత్తాంతము నామూలాగ్రముగఁ జెప్పెను. "తనయా! ఆ మహాపురుషుఁ డిపు డెచట నున్నాఁ" డని విరటుఁ డాతురమున నడుగ, నుత్తరుఁడు "తండ్రీ! అమ్మహాత్ముఁ డొకటి, రెండు దినములలో మరల వచ్చెదనని చెప్పి యెచటికో నేఁగెనని చెప్పెను.

నాఁటిరాత్రి పాండునందను లేవురును, ద్రౌపదియు నొక్కచోటఁ గూడి తమ యజ్ఞాతవాస వత్సరము నిర్విఘ్న

ముగ గడచుటఁ దలంచి సంతసించి, మత్స్యభూపతికిఁ దమ్మె ఱిఁగించికొన నిశ్చయించిరి. అప్పుడు భీమార్జున నకులసహదేవులు యుధిష్ఠిరు ముఖము నవలోకించి "అగ్రజా! గంటి యేలఁ గలిగె" నని యడిగిరి. యుధిష్ఠిరుఁడు దాని తెఱఁగెఱిఁగింప వార లుగ్రులై "ఆసనజాధము నిప్పుడు మర్దించి వచ్చెదము; ఆనతీయు" మనిరి "తమ్ములారా! ఇంతకాలమునుండియు నత్యంత గౌరవముతో మనలం బోషించిన విరటుఁ డిప్పు డించుక నేరముసేయ మనము సైరింపవలదే!" అని చెప్పి యుధిష్ఠిరుఁడు వారల నుపశమింపఁ జేసెను.

కమలాప్తుఁ డుదయించినతోడనే పాండవులు కొలువుకూటమున కేఁగి, విరటుని సింహాసనమున ధర్మనందనుఁడును, నాతని కిరుపార్శ్వములఁగల యుచితాసనములపై భీమార్జున నకులసహదేవులును నాసీనులైరి. అనంతర మచటికి విరటుఁ డరుదెంచి, తన యాసనమున నుపవిష్టుఁడైన యుధిష్ఠిరు నవలోకించి "విప్రుఁడా! నాగద్దెపైఁ గూర్చుంటివేల" అని గద్దించి యడిగెను. అంత నర్జునుఁడు "మత్స్యనాథా! రాజసూయమహాధ్వరము సేసి, యజాతశత్రుండన ఖ్యాతిఁ గాంచిన యుధిష్ఠిర మహారాజేంద్రునకీ గద్దియ నెక్కఁదగదే!" అని చిఱునగవుతోఁ బలుక విరటుఁ డాశ్చర్య స్వాంతుఁడై "ఇతఁడు ధర్మరాజైనచో భీమార్జున నకులసహదేవులును, ద్రౌపదియు నేరి?" అని ప్రశ్నించెను. అంతట ధనంజయుఁడు క్రమంబునఁ దమ్ముందఱి నాతని కెఱిఁగించి, గంధర్వులను నెపమునఁ గీచకులఁ బరిమార్చిన వీరోత్తముఁడు భీమసేనుఁడే యని చెప్పెను. అప్పు డుత్తరుఁ డరుదెంచి "జనకా! కౌర

వులఁ జయించి ధేనుచయమును మరలించిన దివ్యపురుషుఁ డీవిజయుఁడే సుమీ! ఈమహామహుం డప్పుడు నీకుఁ దన్నెఱిఁగింపవలదని యాజ్ఞాపించినందున నొక దివ్యపురుషుఁ డని నీకుఁ జెప్పితి" ననుచు వారల వృత్తాంతమును సవిస్తరముగఁ దెలిపి విరటుని సంశయముఁ దీర్చెను.

అంత నమ్మత్స్యమహీవల్లభు డధికహర్షముతోఁ గొంతేయాగ్రజునకుఁ బ్రణామ మాచరించి, భీమార్జున నకులసహాదేవుల నాలింగనము సేసికొని "మహనీయులారా! మందబుద్ధి నగు నేను మిమ్మింత కాలమునుండియుఁ దెలిసికొన నేరనైతి; నాయపరాధము సైరింపుఁడు. మీకరుణా విశేషముననే నారాజ్యమును, బ్రాణమును నిలిచె" ననుచు ననేకవిధములఁ గొనియాడి, విజయు నతిప్రీతిఁ గౌగిలించుకొని "మహాత్మా! నాయం దనుగ్రహించి యుత్తరం జేపట్టు" మని యధికంబుగఁ బ్రార్థించెను. "వసుమతీశా! నేను గురుండనై యుత్తరకు నృత్తగీతాది విద్యలం గఱపుటచే నామె నాకుఁ బుత్త్రికాసమురాలు; కావుననే నామెఁ జేపట్టనొల్ల; అక్కన్యకామణిని నాసుతుఁడగు నభిమన్యునకొసంగు" మని కిరీటి వచింప విరటుఁ డతుల కమందానంద మొందెను.

పిమ్మటఁ బాండవులు శమీవృక్షనిక్షిప్తములైన యాయుధములను మరలఁ దెచ్చికొని, యుపప్లావ్యపురమునకేఁగి యట నివసించుచుండిరి. అప్పుడు ద్రౌపదేయులఁ దోడ్కొని ద్రుపదుఁడును, సుభద్రాభిమన్యులఁ దోడ్కొని శ్రీకృష్ణ బలరాములును నప్పురమున కరుదెంచి పాండవులఁగాంచి హర్షపరిప్లుతాంతరంగులై, వారలకు రుచిరాంబరరత్నభూష

ణాము ల నతిప్రీతినొసంగిరి.

పిమ్మట మత్స్యభూపతి యుత్తరాభిమన్యులకు మహావైభవముతోఁ బరిణయమహోత్సవముఁ గావించెను.

## —♦ ఉద్యోగపర్వము ♦—

పాంచాలమహీపాలుఁడు శ్రీకృష్ణ యుధిష్ఠిరాదులతో నాలోచించి దుర్యోధనుని కడకుఁ దనపురోహితుని దూతఁగా నంపనెంచి యాభూసురోత్తముని రావించి "విప్రవరేణ్యా! నీవు కురుపతిపాలికిఁజని "ద్యూతసమయమునఁ గావించిన యొడంబడికప్రకారమునఁ బాండవులు పండ్రెండేండ్లు వనవాసమును, నొకయేఁ డజ్ఞాతవాసమును సలిపిరి గావున నిఁక వారిరాజ్యమును వారి కొసంగుఁడు; లేనిచోఁ బాండునందనులు సమరమున మిమ్ములఁ జయించి రాజ్యలక్ష్మిఁ గైకొనఁగలరు' రని చెప్పిర" మ్మని యాజ్ఞాపించి పంపించెను. పిమ్మట శ్రీకృష్ణబలదేవాదియాదవులు పాండవులనువీడ్కొని నిజపురమున కరిగిరి.

అట సుయోధనుఁడు పాండవులకు రాజ్యమునీయనొల్లక వారితో సంగ్రామముసేయ నిశ్చితుఁడై, కాంభోజ, సౌవీరాదిమహీపాలురఁ దనకు సహాయార్థముగాఁ బిలువ దూతలఁ బనిచి, శ్రీకృష్ణునిసహాయము నపేక్షించి తాను ద్వారక కరుదెంచెను. ఆసమయమునఁ దేవకీతనయుఁడు నిద్రాసక్తుఁడై యుండ దుర్యోధనుఁడువచ్చి యమ్మహామహుని తలయంపిదెస నున్నతాసనమున నాసీనుఁడైయుండెను. అప్పుడు పప్లావ్యమునుండి కిరీటియు వాసుదేవునిసహాయము నపేక్షిం

చివచ్చి, నిద్రాపరవశుండైయున్న పద్మనాభునిం గాంచి విన
ముండై యద్దేవుని చరణారవిందముల సమీపమున నిలువం
బడియె.

కొంతతడవునకు గోపాలదేవుండు మేల్కాంచి, తన యెదుట నిలువం బడియున్న పురందరనందను నవలోకించి, పిమ్మట సుయోధనునిగాంచి, యిరువురిని కుశలప్రశ్నము సేసి, యుచితాసనాసీనులం జేసి "వచ్చిన కార్యముం దెలుపుం" డని ప్రియపూర్వకముగ నడుగ న య్యిరువురుం దాము వచ్చినపని నెఱింగించిరి. అప్పుడు సుయోధనుండు "పుండరీకాక్షా! ముందువచ్చినవాండను నేనగుటచే లోకముపాడి విచారించి నీవు నాకు సహాయుండవుగా వలయు" నని వచింప, వాసుదేవుండు "కౌరవేశ్వరా! నీవు ముందువచ్చినది నిక్కము గాని, నేను తొలుత సవ్యసాచినే గాంచితిని. అందువలన మీ యిరువురకు సహాయముసేయుట నాకుం గర్తవ్యము; కావున నాతో సమానబలవంతులును, రణకోవిదులును, నారాయణ గోపాలాభిధానులును నగువారల పదివేవుర నొకరికొసంగెద; వార లొకపక్షమునను౦డి కయ్యముసేయుదురు. నేను వేఱొకపక్షమున నిరాయుధుండనై, పరమాప్తుండనైయుండెద. మీ యిచ్ఛవచ్చినవారలం గోరుం" డని చెప్పెను. అంతట స్వచ్ఛుండుం దేవకీతనయుని, సుయోధనుండు నారాయణగోపాలురను గోర, శ్రీకృష్ణుండు వారల యభిమతము నెఱవేర్చెను. పిమ్మట సుయోధనుండు బలరాముని సదనమున కేంగి సహాయము వేండ నద్దేవుండు "సుయోధనా! కృష్ణుండు పాండవపక్షపాతియైయుండును; కావున నేనాతనికిం బ్రతిపక్ష

ముననిలిచి పోరనొల్లను. నే నీసంగ్రామమున మీ యిరు
వాగులవారికిని సహాయము సేయక దీర్ఘయాత్ర కేగెద" నని
ప్రియపూర్వకముగఁ జెప్పి పంపించెను. పిమ్మట సుయో
ధనుఁడు యాదవవీరుఁడైన కృతవర్మను తనకు సహాయము
సేయఁ బిలిచి యాతని యనుగ్రహమువడసి నిజపురమున
కరిగెను.

అనంతరము సవ్యసాచి కృష్ణునకుఁ బ్రణామ మాచరించి
"పరమపురుషా! నీచే సారథ్యము సేయించికొనఁ జిరకాలము
నుండియు నా కభిమతముగలదు. నా యభీష్టము నెఱవేర్పు"
మని యడుగ, నాథభక్తవత్సలుఁడు దమందానందముతో నందుల
కంగీకరించి, యాతనిఁ దోడ్కొని యుపప్లావ్యమున కరు
దెంచెను

మద్రదేశనాథుఁడును, నకులసహదేవుల మేనమామయు
నగు శల్యుఁడు పాండవులకు సహాయము సేయువేడ్క నుపప్లా
వ్యమునకు వచ్చుచుండ సుయోధనుఁడు మార్గమధ్యమున
నమ్మద్రమహీపాలునకును, నాతని పరివారమునకును గావల
సిన పదార్థములన్నియుఁ దాను సమకూర్చి పంపసాగెను.
శల్యుఁడందులకు సంతుష్టాంతరంగుఁడై "మనకీ పదార్థములిన్ని
యు బంపుచున్నవారెవ్వరు? ప్రసాదదానమున కర్హులైనవారల
నిచటికిఁ దోడ్కొనిరం" డని నిజానుచరుల కాజ్ఞాపించెను.
అప్పుడు దుర్యోధనుఁడు శల్యునిపాలి కరుదెంచి, యాతనిచే
సన్మానితుఁడై "సమరమున నాకు సహాయుండవు" గమ్మని
యడుగ నతఁ డందుల కియ్యకొని "కౌరవేశ్వరా! నీవిఁక
గజపురమునకేగుము నేను పాండవులఁ జూచివచ్చెద" నని

చెప్పి యాతనిఁ బంపించి తా నుపప్లావ్యపురమున కరు
దెంచెను.

పిమ్మట శల్యుఁడు పాండవులకడ కరుదెంచి వారలచే సన్మానితుఁడై, కుశలప్రశ్నము సేసి, దుర్యోధనుఁడు తన సహాయముఁ గోరుటఁ దెలుప, యుధిష్ఠిరుఁ డాతనిఁ గాంచి 'అనఘా! కోరినవారికోర్కెదీర్చుట పెద్దలగుణము గావున సుయోధనునకు నీవు సహాయము సేయుట నాకానందకరము; నేనొక్కటి మాత్రము వేడెద; కర్ణుఁడు పార్థునితో సమరము సేయునపు డాతనికి సారథ్యము సేయ నిన్నుఁ గోరెదరు. నీవప్పుడు రాధేయుని మనమునకుఁ గలఁకపుట్టునటుల నిరాకరించి పలికి గాండీవికిఁ గాపాడవలయు"నని కోరెను. శల్యుఁ డందుల కంగీకరించి యుధిష్ఠిరు నాలింగనము సేసికొని "సమరమున విజయుఁడవగుదు"వని యాశీర్వదించి నిజసేనాపరివృతుఁడై హస్తిపురమున కేఁగెను.

మున్ను ద్రుపదునిచేఁ బంపఁబడిన భూసురోత్తముఁడు కరిపురమున కరిగి కౌరవసభయం దుచితాసనాసీనుండై, ద్రుపదుఁడు తనకుఁ జెప్పిన వాక్యములఁ దెలుప, "పాండునందనులకు రాజ్యము నొసఁగుట ధర్మం" బని గాంగేయుఁడును వచించెను. అప్పుడు కర్ణుఁడా ధరణీసురు నుద్దేశించి "కౌరవనాథుఁడు పాండవులకు వెఱచి పుడమిఁ బంచి యిచ్చునా" యని వచింప, ధృతరాష్ట్రుఁడు "విప్రవర్యా! నేను పుత్త్రమిత్త్ర వృద్ధామాత్యులతో నాలోచించి పాండవులకడకు దూతనంపెద. నీవు మం దరుగు" మని చెప్పి యాతనిఁ బంపించెను.

అనంతరము ధృతరాష్ట్రుఁడు సంజయుఁడను నాతని

పాండవుల పాలికిఁ బంప, నతఁ డుపప్లావ్యమున కరుదెంచి పాండవులను దర్శించి "మహామహులారా! కురువృద్ధుఁడు మీకుఁ దెలుప నాజ్ఞాపించిన వచనములఁ జెప్పెద నాకర్ణింపుఁడు. "ధర్మనందనా! మందబుద్ధియగు సుయోధనుఁడు నా పలుకుల నాలించి రాజ్యము నొసంగువాఁడుగాఁడు. నీ యట్టి ధర్మనిరతుఁ డఖిలప్రజానాశకరమగు సమరమునకుఁ దలపెట్టుట సమంజసము గాదు. కావున నీవు కార్యక్రమము జక్కఁగ నాలోచించి శాంతి వహింపుము." అని చెప్పి నన్నుఁ బుత్తెంచె" ననుచు సంజయుఁడు ధృతరాష్ట్రుని సందేశముఁ జెప్పెను. "సంజయా! మేము స్నేహము నభిలషించువారమే గాని, కయ్యమునకుఁ గాలుదువ్వువారము గాము. మా రాజ్యసంతతియు మా కీయనొల్లరేనిఁ గుశస్థలమును, వృకస్థలమును, నింద్రప్రస్థమును, వారణావతమును, మాకందియు ననునైదూళ్ళైన మా కిచ్చినఁ దృప్తినొందుదుము. ఇట్లు సేయ సంగీకరింతురేని యెల్లవారికి శుభమగు" నని యజాతశత్రుఁడు సంజయునకుఁ బ్రత్యుత్తర మొసఁగి పంపించెను.

అంతట సంజయుఁడు కరిపురమున కరిగి ధృతరాష్ట్ర దుర్యోధనాదులకు ధర్మతనయుని వచనములఁ జెప్పెను. ధృతరాష్ట్రుఁడు కిరీటిపరాక్రమముఁ దలఁచి భీతినొంది "కుమారా! నీవు పాండవులకు రాజ్యముఁ బంచి యిచ్చుట శ్రేయస్కర" మని సుయోధనునకు హితోపదేశముఁ జేయ నతఁడు దానికంగీకరింపక "భీష్మ ద్రోణ కర్ణాశ్వత్థామాది యోధవరేణ్యులు మన పక్షమున బెక్కుమంది గలరు పాండవులు వీరి నందఱిని జయింప నేర్తురే! అర్జునుని పరాక్రమమునకు నీవు

భీతిల్లఁ బనిలేదు. ఆతనిఁ జయింపఁ గర్ణుఁడు గలఁడు." అని
తండ్రికిఁ బ్రత్యుత్తర మొసంగెను. అప్పుడు గాంగేయుఁడు
"సుయోధనా! మీరు ఘోషయాత్ర కరిగి గంధర్వులచేఁ
బట్టుపడినప్పుడును, మొన్న మత్స్యభూమీశుని పశువులఁ
బట్టినప్పుడు కర్ణుని శౌర్య మెటకేఁగె? ఈతఁడు ధనంజయు
నెంతమాత్రము జయింపఁజాలఁడు. నీవిఁక నిద్దురాశం ద్యజించి
పాండవులకు రాజ్యముఁ బంచి యి" మ్మని వచింపఁ, గర్ణుఁడు
రోషావేశుఁడై "పితామహుఁడు నన్ను నిరంతరము నిరసించి
పలుకుచుండుఁ గావున, నేనీతఁడు జీవించియున్నంతవఱకు
సమరముఁ జేయను. ఈతఁడు పడిపోయిన మీఁదట నేనాయుధ
హస్తుఁడనై బాహుబలము మెఱయ నని సేయువాఁడ"
ననుచు భీష్మునిపయిఁ గల కోపముచే నస్త్రసన్న్యాసము సేసి
కొలువుకూటము విడిచిపోయెను.

ధర్మపరతులగు పాండవులు బంధువధము సేయ నొల్లక
యెవ్విధముననైన సుయోధనునితో సంధి సేసికొననెంచి
మధుసూదను నవలోకించి

క. "అపదఁ గడవంబెట్టఁగ
నోపి శుభంబైన దాని నొడఁగూర్పను మా
కీ పుట్టువునకు బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా.

తే. సమయమిది మిత్రకార్యంబు చక్కఁజేయ
నీ కతంబున నే మవినీతుఁడైన
యా సుయోధనుతోడి పోరాటఁ దక్కి
యనుభవింతుము మీ యంశమగు ధరిత్రి."

నీకు మేము ప్రద్యుమ్నాదికుమారుల తోడివారము; మమ్ము
దురితములు వొరయకుండ నరసి రక్షించు భారము నీయది.

కావున నీవు కరినగరమున కరిగి సుయోధనాదులతో దండ
గిన మాటలాడి సంధి సేయు" మని ప్రార్థింప, వాసుదేవుఁడు
ప్రీతుండై పాండవులకుఁ బ్రియము సేయ నిశ్చితుఁడై తన
ప్రియానుజుఁడైన సాత్యకిఁ దోడ్కొని యాదవసేనాపరివృతుఁడై
గరుడధ్వజ విరాజితమైన యరద మెక్కి గజపురమున కేఁగెను.

శ్రీకృష్ణుని రాక విని దుర్యోధనుఁడు పుర మంతయు నలంక
రింప నాజ్ఞాపించి, మిత్రామాత్య బంధువర్గము నద్దేవుని కెదురు
బంపించి గౌరవపూర్వకముగా సభకుఁ దోడ్కొని వచ్చి
యర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారముల నాచరించి కనకా
సనాసీనుఁ జేసెను. కృష్ణుఁడు భీష్మ ధృతరాష్ట్ర దుర్యోధ
నాదుల నుచితరీతినిఁ గుశలప్రశ్నము సేసి, పిమ్మటఁ బాండవ
విరోధియగు సుయోధనుని గేహమున భుజింపనొల్లక విదు
రుని సదనమున కేఁగెను.

భక్తాగ్రేసరుఁడైన విదురుఁడు వాసుదేవు నతిభక్తిఁ
బూజించి, యిష్టమృష్టాన్నముల నొసఁగి ప్రీతాత్మునిఁ గావిం
చెను. దేవకీనందనుఁడు కుంతీదేవి కుశలము నరసి, యద్దేవికిఁ
బాండవుల క్షేమముఁ దెలిపి యారాత్రి విదురుని సదనమున
శయనించెను.

ప్రభాతమైనతోడనే సుయోధనుఁడు మిత్రవర్గముతోఁ
గృష్ణునికడ కరుదెంచి యమ్మహామహునిఁ దమ మందిరము
నకుఁ దోడ్కొనిపోయెను. వాసుదేవుఁడు కౌరవసభాంతర
మునఁ గనకాసనాసీనుఁడై ధృతరాష్ట్రు నుద్దేశించి "మహీ
నాథా! చిన్ననాఁటనుండియు నీవు పాండవుల నధికప్రేమతోఁ
బెంచినవాఁడవు. కావునఁ బాండవ ధార్తరాష్ట్రులు నీకు

సములు. ఈయిరుపక్షముల వారిలో నెవ్వరు సమరమున సమసినను నీకు సంతాపమే సంభవించును. మఱియు సమరమువలన సకలజనక్షయము గాఁగు; ధర్మాధర్మ విదుండవగు నీవు పాండవధార్తరాష్ట్రులకు సమముగా రాజ్యము బంచి యిచ్చి, సోదరకములవలె మీరును వారును గలసి యుండుట సమంజస" మని వచించెను. "అనఘా! నీవు ధర్మయుక్తములగు వాక్యములు జెప్పితివి; మందబుద్ధియగు సుయోధనుఁ డీదుల కంగీకరింపఁడు. నేనేమి సేయుదును? ఎవ్విధముననైన వానికి నీవు హితోపదేశముఁ జేయు"మని ధృతరాష్ట్రుఁడు శ్రీకృష్ణునకుఁ బ్రత్యుత్తర మొసఁగెను. "సుయోధనా! పావన వంశమున జనించిన నీవు దుర్మార్గము నవలంబించుట యుక్తముగాదు. సన్మహానుశీల సించుచున్న పాండవులకు రాజ్యముఁ బంచి యిచ్చి, సకల జనానందకరముగా నీరాజ్యమును నీవు పాలించుచుండుము. నీవు పాండవులకు రాజ్యమునీయనొల్లనేని, వారలు సమరమున మిమ్ములఁ జయించి రాజ్యము నవశ్యము గైకొనఁగలవా" రని దామోదరుఁడు గాంధారేయునకు హితోపదేశముంజేసెను. భీష్మద్రోణ గాంధారీధృతరాష్ట్రులును "కుమారా! పాండవులకు రాజ్యము నొసంగు" మని యనేక విధముల నుపదేశించిరి. ఎవ్వరెన్ని విధములఁ జెప్పినను సుయోధనుఁడు మాత్రము పాండవులకు రాజ్య మీయ నొల్లక "మధుసూదనా! పలుమాటలేల? నేను సూదిమొన మోపఁజాలినంతమాత్రపు భూమినైనఁ బంచి యిచ్చువాఁడఁగాను. ఎవ్వరైనను సంగ్రామమున జయించి పుడమి నేల నిశ్చయించితి" నని కృష్ణునకుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

మఱియు సుయోధనుఁడు కర్ణ, శకుని, దుశ్శాసనులఁగూడి "పాండవులకు నేడు కడయగు శ్రీజనార్దనునిప్పుడు చెఱఁబట్టితిమేని, ఱెక్కలు విఱిగిన పులుఁగులఁ బోలెఁ బాండవులను సమరమున ననాయాసముగ నిర్జింపవచ్చు" నని యోచించుచుండెను. సాత్యకి వారల దుర్మంత్రము నెఱిఁగి, కృష్ణునకు ధృతరాష్ట్రాదులఁగాంచి

మ. "అది కౌరవ్యుల శక్తి మగ్గనతఁ జేయంబూని పయిఁబాఱఁ జూ
చెదరమ్మై దమచేతఁ దీరునె జయ శ్రీకాంతు దైత్యాంతకున్
బొదువం దారు దలంచు టెల్ల ననలంబుం జీరబంధింపఁగా
మదినూహించిన యట్లగాకఁ దమ దుర్మంత్రజాలం బోవునే."

అని పచింప, విదురుం డదరిపడి వైచిత్రవీర్యు నుద్దేశించి

ఉ. "భూవర నీతనూభవులు పుణ్యు నగణ్యపరాక్రముఁ గ్రీహరిం
గేవలమర్త్యుఁగాఁ దలంచి కీటినఁ బట్టినఁ దారుమంటపై
వావిరిఁ గ్రమ్ము నాశలభవర్గము చాడ్పునఁ బొందిపోరె కా
లావధియయ్యెఁ గావలయు నక్కట వారికి వారి వారికిన్."

అని పద్దయెలుంగునఁబలికెను. అప్పుడు ధృతరాష్ట్రుఁడు కుమారుఁ బిలిచి "సుయోధనా! నీవీ దుర్బుద్ధిం ద్యజింపు" మని మందలించెను. మధుసూదనుఁడు మందస్మితవదనారవిందుఁడై సుయోధను నవలోకించి "నేనొక్కఁడననితలంచి పట్టనెంచితే" యనుచుండ నద్దేవుని ఫాలప్రదేశమున బ్రహ్మయు, వక్షమున విరూపాక్షుఁడును, వదనమున వహ్నియు, పార్శ్వములనింద్రయమవరుణ కుబేరాదులును నుద్భవించిరి. దుర్నిరీక్ష్యమై ప్రకాశించుచున్న యా దివ్యతేజోరూపముఁ జూడఁజాలక సకల జనములు నయనములు మొగిడ్చి యద్భుతభయానక రసములఁ జొత్తిల్లు చిత్తములతో నిశ్చేష్టితులై యుండిరి. పరమభాగవతులగు భీష్మ, విదురాదులు

మాత్రము విశ్వరూపధరుండైన శ్రీకృష్ణునిం గాంచి సాంద్రానంద మునం దేలుచుండిరి. అప్పుడు బృందారకులు వాసుదేవునిపయిం గుసుమవర్షముం గురియించిరి.

క. కరుణింపుము సంశ్రితభయ
హరణధురీణా సహింపు మజ్ఞానంబుల్
శరణంబు వేడెద భవ
చ్చరణంబులు గనుగొనం బ్రసాదింపఁగదే."

అని ధృతరాష్ట్రుఁడు వాసుదేవునిఁ బ్రార్థింప సమ్మహానుభావుఁడు ప్రీతుండై యాతనికి నయనములు నొసంగెను. ధృతరాష్ట్రుఁడా దివ్యమూర్తినిఁ దనివిదీర నవలోకించి "జగదీశ్వరా! నిన్నుం గాంచిన నేత్రములతో నితరులఁ జూడనొల్ల, ఇఁక నాలోచనములను సంహరింపు" మని వచింపఁ, గృష్ణుఁ డాతని నెప్పటియట్లు గావించెను. అనంతరము వాసుదేవుఁడు నిజవిశ్వరూప ప్రపంచము నుపసంహరించి, కుంతీసదనమునకరిగి, కౌరవసభయందు జరిగినవిశేషముల నామె కెఱింగించి, యాసాధ్వీమణి సెలవుం గైకొని యుపప్లావ్య మునకుం బయలుదేరెను.

కృష్ణుఁడు రథారూఢుఁడై, తన్నుఁ బంపవచ్చిన భీష్మ ధృతరాష్ట్రాదుల నవలోకించి "మీరలిఁక నిలువుఁ" డనిచెప్పి, కర్ణునిఁ గాంచి "నన్ననిచివత్తుగాని ర"మ్మని యాతని హస్తముఁ బట్టుకొని యరద మెక్కించికొని కొంత దవ్వరిగి "మిత్రమా! నీవు జనులెల్లఱు దలచునట్లు సూతసుతుండవు గావు. కన్యాత్వమునఁ గుంతి నిన్ను సూర్యునివరమునఁ బడసె; అక్కారణమున నీవు పాండునృపాలున కగ్రసుతుండవైతివి. నీవిప్పుడు కౌరవులను

విడిచి నియనుజులకడకు వచ్చెదేని నిన్ను సామ్రాజ్యమునకు నభిషిక్తుఁ జేయుదు. యుధిష్ఠిరాది యనుజులు నిన్ను సేవింతురు; పాంచాలరాజపుత్రి నీకుఁ బత్నియగు. కావున నీవు నీ తమ్ముల పాలికరుదెంచి మహేంద్ర విభవముతో మహీతలము నేలు" మని రహస్యముగఁ జెప్పెను. "పుండరీకాక్షా! కొన్ని దినములక్రిందట నే మదీయ జననవృత్తాంతము నెఱింగితి. అయినను, సుయోధనుఁడు పిన్ననాఁటనుండియు నన్ను నాత్మసోదరుం డని చులకనజేయక రాజ్యాభిషిక్తుఁ జేసి యధికప్రీతి నాదరించుచు, సమరమున ధనంజయునిఁ గెలువఁగలవాఁడను నే యని విశ్వసించి పాండవులతో వైరముఁ బెంపెట్టె. నే నిప్పు డాతని విడిచి పాండవుల కడ కేఁగుట పాడిగాదు. ఇట్టి నీతి నేని దుర్యోధనునకుఁ దెలిచి పాండవులఁ గలిపించినను నపయశమును వాటిల్లు; కావున నేను సుయోధనుని విడిచి రానొల్లను. ధర్మనిరతుఁడగు యుధిష్ఠిరుఁడు నే నగ్రజుఁడ నని యెఱింగినచో రాజ్యాభిషేకమున కంగీకరింపఁడు. కావున నీ పీరహస్యము నెవరికిఁ దెలుపవలదు. నీసహాయమున నజాతశత్రుఁడు కౌరవులఁ జయించి మహీతలము నేలుఁ గాక" యని పలికి కర్ణుఁడు వాసుదేవు నాలింగనము సేసికొని యమ్మహానీయుని సెలవుఁ గైకొని రథావతరణము సేసి నిజ సదనమున కరిగెను. కృష్ణుఁడు సాత్యకీ సహితుఁడై యుపప్లావ్యమున కరిగి, జరిగిన వృత్తాంతమంతయుఁ బాండవుల కెఱింగించి యిక సామమునఁ గార్యము చక్కఁబడదని చెప్పెను.

అంతట యుధిష్ఠిరనృపాలుఁడు ధార్తరాష్ట్రులతో సమరము సేయ నిశ్చితుఁ డయ్యెను. ఆతనికి సహాయార్థము మగధ, చేది,

పాండ్య, కేకయ, పాంచాల, మత్స్యభూమీశులు దమతమ బల
ములతోడ నరుదెంచిరి. ఆ సైన్యమంతయు నేడక్షౌహిణులయ్యెను.
ధర్మరాజు కృష్ణానుమతము వడసి ద్రుపదసేనకంతకును, శాత్రవ
భయంకరుండైన ధృష్టద్యుమ్ను నధిపతిగా నభిషేకించెను.

ఇట్లు సమరసన్నాహములు జరుగుచుండ నొకనాడు కర్ణుం
డుమస్థానార్థము భాగీరథీతీరమున కరిగిన సమయమున నచటికిఁ
గుంతీదేవి యరుదెంచెను. రాధేయుఁడామెకుఁ బ్రణామము సమర్పిం
చి "వచ్చిన కార్యము నెఱింగింపు" మని యడుగ నద్దేవి
"కుమారా! నీవు భాస్కరుని వరమున నాకు జనించినవాడవుగాని,
రాధాసుతుఁడవుగావు. కావున నీవు దుర్యోధనుని విడిచి నీతమ్ములఁ
గూడి జయశ్రీవిభాసితుండవై సామ్రాజ్యచక్రము నేలు" మని వచించెను.
"జననీ! నీవు నన్నుఁ బుట్టినతోడనే త్యజించితివి. నా జన్మ మతి
రహస్యమై యున్నది. నేనిప్పుడు కౌంతేయుఁడ ననుచు పాండవులఁ
జేరితిని, ధనమునకు మెచ్చి వారిఁ గూడితినను నపయశము
నేఁదాల. సుయోధను డన్నటినుండి నన్నాదరించెను. సుయోధను
నిట్టిసమయమున విడుచుట ధర్మముగాదు. కావున నేను పాండ
వులతోడ సమరము సల్పితీరవలయును; అయినను నీవిట కరుదెంచితివి
గావున నొక్కప్రియము నొసఁగెద; యుధిష్ఠిర భీమ నకుల
సహదేవులు నాచేతఁ జిక్కినను వారలఁ జంపక విడిచెద. ఈసమరమున
నేనర్జునునిఁ జంపుటయో, లేక నేనతనిచేతఁ జచ్చుటయో నిక్కము.
ఎట్లయిన నను నీకుఁ దనూజు లేవురేగాని, యార్వురనుతలంపువిడువు"
మని కర్ణుఁడు కుంతీదేవికిఁ బ్రత్యుత్తరమొసఁగి యామె సెలవుఁ

గైకొని నిజ నివాసమున కేఁగి, సుయోధన హితార్థము సమర ప్రయత్నములఁ జేయుచుండెను.

దుర్యోధనునకు సహాయార్థము మద్ర, కాంభోజ, సాల్వ, త్రిగర్త, కోసల, గాంధార, సింధు, సౌవీర, మాహిష్మతి, యవంతీ దేశ భూపతులు తమతమ బలములతో నరుదెంచిరి. ఆ సైన్య మంతయుఁ బదునొకం డక్షౌహిణు లయ్యెను. దుర్యోధనుఁ డవ్వాహిని కర్తకును భీష్మునిఁ బతిగా నభిషేకించెను.

అనంతర మయ్యిరువాగుల వారును దమతమ చతురంగ బలములతోడను శంఖభేరీమృదంగాదినిస్వనములతోడను బయలు దేరి, కురుక్షేత్రమున కరుదెంచి, యందు తృణ, కాష్ఠ, జలసమృద్ధము లయిన రమణీయప్రదేశముల విడిసిరి.

కౌరవపాండవులు కయ్యమునకుఁ గడంగిరని బలరాముఁడు విని కురుక్షేత్రమునకుఁ బోయి యిరువాగులవారినిగాంచి "నే నీ ఘోరసంగ్రామముఁ జూడఁజాలకఁ దీర్థయాత్ర కేగుచుంటి" నని చెప్పి వారలను వీడ్కొని సరస్వతీ తీర్థమున కేఁగెను.

అనంతర మయ్యిరువాగులవారును దమతమ సేనలకును సేనాపతులకును రేపు సంగ్రామమని చెప్పి సమస్త సాధనములు నాయితములు సేయుచుండిరి.

అప్పుడు సుయోధనుఁడు గాంగేయు నవలోకించి స్వపక్ష, పరపక్ష వీరుల సామర్థ్యము నడుగ నద్దేవవ్రతుఁడు "దుర్యోధనా! భీముఁడును, విజయుఁడును, నభిమన్యుఁడును, సాత్యకియు, ద్రుపదుఁడును, ధృష్టద్యుమ్నుఁడును మొదలుగాఁగల యోధా

గ్రేసరులు పాండవపక్షమునఁ గలరు. వీరలు వైరుల కజేయులు! ద్రోణ, కృప, కర్ణాశ్వత్థామాది వీరవరేణ్యులు నీబలమునఁ బెక్కండ్రు గలరు. నేను నీవు మెచ్చునటులఁ బాండవపక్షమునఁ గల యోధవరేణ్యులందరితోఁ రణము సేయఁజాలుదు. పాంచాల రాజనందనుఁడైన శిఖండితో మాత్రము సేయనొల్ల" నని చెప్పెను. "పితామహా! శిఖండిఁ జంపనొల్లమి కేమికారణము" మని సుయోధనుఁ డడుగ, నదీసూనుఁడు "కుమారా! తొల్లి నేను విచిత్రవీర్యునకు వివాహము సేయ నెంచి, కాశీరాజు తన దుహితలకు స్వయంవరోత్సవము సేయుచుండ నచటి కరిగి యంతని కుమార్తెల ముగ్వురఁ దెచ్చితి. అప్పు డాముగ్వురిలోఁ బెద్దదైన యంబ నన్నుఁ గాంచి "నామనసు మిదివఱకే సాళ్వుని పయిఁ దగిలియుండెఁ గావున నీవు నన్నాతనిపాలికిఁ బంపుట ధర్మ" మని వచించెను. నే నంతట సాళ్వునికడ కామె ననిపి, యంబికాంబాలికలను విచిత్రవీర్యునకు వివాహము సేసితి. అంబ సాళ్వునికడ కేఁగి తన్ను వరింపుమని యడుగ నతఁడు "విచిత్రవీర్యునకుఁ బెండ్లి సేయ నిశ్చయించి గాంగేయుఁడు నిన్నుఁ గొనిపోయెఁ గావున నేను నిన్నుఁ బరిగ్రహింప నొల్ల" నని యప్పుడతని వెడలఁ గొట్టెను. అంత నాయంబ మఱియు గురుశ్రేష్ఠుఁడైన పరశురాముని పాలికిఁ బోయి, నావలనఁ దనమనోరథము భగ్నమయ్యెనని విలపింప, నమ్మహనీయుఁ డామెను వెంట నిడుకొనివచ్చి నన్నుఁ బిలిచి "ఈమెను విచిత్రవీర్యునకు వివాహము సేయు" మని యుపదేశించెను. పరానురక్తచిత్తయగు నక్కాంతను నాయనుజున కెట్లు వివాహము సేయుదునని నేను దాని కంగీకరింపనందున, భార్గవుఁడు

నాపయిఁ గోపించి సమరము సేయ నుపక్రమించెను. అంతట నేనును సమరసన్నద్ధుఁడనై నిలిచి భార్గవునితో నిరువదిమూఁడు దినము లుగ్రముగఁ బోరితిని. అప్పుడు నారదాదిమహామును లరుదెంచి నాయఁ దపరాధము లేదని చెప్పి భార్గవుని శాంతచిత్తుఁ జేయ నమ్మహాత్ముఁడు ప్రసన్నుఁడై సమరము చాలించి మహేంద్ర నగరమున కరిగెను. అనంతర మాయంబ నన్నుఁ జంప నుద్దేశించి విపినమున కేఁగి యుగ్రతపమాచరించి హరుని మెప్పించి, జన్మాంతరము నన్నుఁ జంపునట్లు వరము వడసి యాత్మహత్య నొనరించి, ద్రుపదునకు స్త్రీరూపమున జనించెను. ద్రుపదుఁడు తనకు పుత్రుఁడు జనించెనని యెల్లరకుఁ జెప్పి కుమారుఁ డుదయించెనని చెప్పుచు దానికి శిఖండి యని పేరిడి కొంతకాలమున కొక రాజపుత్రినిఁ దెచ్చి దానికి వివాహ మొనరించెను. కొంతకాలమునకు రహస్యము వెల్లడిగాఁ గన్యాప్ర జనకుండు ద్రుపదునిపై దండెత్తివచ్చెను. అప్పుడు శిఖండి స్థూణాకర్ణుఁడను నొకయక్షుని ప్రార్థించి పురుషత్వము నొందవచ్చి తన శ్వశురుని సంశయముఁ దీర్చి యాతని యనుగ్రహము వడసెను. శిఖండి తన జీవితకాలమున నిట్లు పురుషరూపమున నుండి మరణసమయమున మరల స్త్రీరూపము నొందఁగలఁడు. వీని జననప్రకారమిట్టి దగుటచే నే నయ్యంగనాపురుషునితో నని సేయనొల్ల" నని శిఖండివృత్తాంతమును సవిస్తరముగఁ జెప్పెను.

## —* భీష్మపర్వము *—

మఱునాఁటి యుదయమున గంగానందనుఁడు మానుష వ్యూహముఁ బన్ని తాలధ్వజ విరాజితమైన యరదమధిరోహించి

తా నగ్రభాగమున నిలిచి కౌరవవాహిని నతి చతురముగ నడిపించి కొనుచు సమరమున కరుదెంచెను. అటఁ బాండవసేనాపతియైన ధృష్టద్యుమ్నుఁడును తమవాహిని నచలవ్యూహముగఁ బన్ని రయమున నడిపించుచు సంగరమున కరుదెంచెను. ఇటుల నయ్యిరుబలముల నాయకులు కవచకార్ముకధారులై స్యందనారూఢులై, నిజధ్వజములు విరాజిల్ల, మణిమకుటములు మెఱయ, భేరీమృదంగాది నిస్వనములు సెలఁగ నడచి, కురుక్షేత్రమున నుత్తమప్రదేశమగు శమంతపంచకమున నెదురొడ్డి తమతమ శంఖములఁ బూరించిరి.

అప్పుడు ధర్మపుత్రుఁడు తన రథాసనము నాయుధములం బెట్టి పాదచారియై భీష్మునికడకుఁ బోవుచుండ నాతని వెంటఁ బాండవులును, శ్రీకృష్ణుఁడును నరిగిరి. ధర్మరాజుఁడు పితామహునకుఁ బ్రణామము సేసి

ఆ. "అనఘ నీకు మ్రొక్కి యనిసేయువాఁడనై
మున్నవాఁడఁ గావఁగ నిన్నుఁ గాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన
వడసి చనిన నేను బగఱ గెల్తు."

అని వినయమున వచింప శాంతనవుఁడు ప్రీతుఁడై "కుమారా! సమరమున విజయుఁడవగు" మని దీవించెను. "పితామహా! నిన్నుఁ జయించు నుపాయమును నుపదేశింపు" మని ధర్మతనయుఁడడుగ దేవవ్రతుఁడు "కుమారా! ఆయుధపాణినై యుండ నన్ను నిమిషులు సైతము నిర్జింపఁజాలరు. నన్ను జయించువిధము నింకొకదినమునఁ జెప్పెద" నని వచించెను. పిమ్మట ధర్మరాజు ద్రోణాచార్యునికడ కేఁగి వందనము సేయ నతఁడు ప్రీతచిత్తుఁడై "జయలక్ష్మిఁ

గైకొను"మని దీవించెను. "గురువరేణ్యా! నిన్ను జయించు తెఱంగు నానతి"మ్మని యుధిష్ఠిరుఁ డడుగ "కుమారా! ఆయుధహస్తుఁ డనై యున్నంతవఱకు నన్నెవ్వరును జయింపఁజాలరు. సత్య సంధుఁడవగు నీవలన నధిక దుస్సహమైన దుర్వార్తను వినినయేని ప్రాయోపవేశమున సన్న్యస్తశస్త్రుండనగుదు. అప్పుడు నన్ను వధింపనగు"నని ద్రోణుఁడు స్వవధోపాయము నెఱింగించెను. అనంతరము ధర్మతనయుఁడు కృప, శల్యుల కడకుఁబోయి వారి దీవెనలఁ బడసివచ్చి తనరథము నధిరోహించి యుద్ధాభి ముఖుఁడై నిలిచెను. భీమార్జున నకుల సహదేవులును దమతమ రథముల నధిరోహించి విల్లమ్ములు గెలుపుఁబూని నిలిచిరి.

అప్పుడు కిరీటి తన గాండీవముం జైకొని గుణంబుఁ దాటించి సోదర, సుత, పితామహ, మాతు లాచార్యాదులగు బంధుమిత్ర జనముల నవలోకించి పరమకృపావేశమున నత్యంతవిషాదము నొంది తనకు సారథ్యము సేయుచున్న వాసుదేవునిఁ గాంచి,

చ. "సరసిజనాభ బంధుజనసంతతిఁ గయ్యపు నేలఁ జూడఁగా
విరవిరఁబోయి మేను నిడువెండ్రుక నెట్టుచుఁ గంపమొందెఁ జే
నిరతము గాదు గాండివము నిల్వఁగ నోర్వవు గాళ్ళు నేను ని
ష్ఠురతకుఁ జాలనొల్ల నొకఁడుం మహి నేలుట యేటి సౌఖ్యముల్.

ఉ. తాతల మామలన్ సుతులఁ దండ్రుల దమ్ముల నన్నలన్ గురు
వ్రాతము శిష్టకోటి సఖివర్గముఁ దుష్టజనానురూప దు
ర్నీతి వధించి యేఁ బడయు నెత్తుటఁ దోఁగిన రాజ్యభోగముల్
ప్రీతి యొనర్చునే యశము పెల్లొకఁ గూర్చునె పెంపొనర్చునే.

కావున నేను సమరము సేయనోప" ననుచు శోకవిహ్వలమానసుఁడై గాండీవము విడిచి రథముపయిఁ గూలఁబడియె.

అప్పుడు మురమర్దనుఁడు సవ్యసాచి నుద్దేశించి "ధనంజయా!

క. సమరంబు రాజులకు ను
త్తమకర్మంబది యపావృత స్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగఁ గ
య్యము సేయుము దీనికేల యనుమానింపన్.

తే. ఫలముల గోరక బ్రహ్మార్పణ
కలనపరుండగుచుఁ గార్యకర్మము సలుపన్
వలయుం దత్త్వజ్ఞానము
తెలకొనినం గర్మశమము దానై కలుగున్ ''

అనుచు కర్మత్యాగఫలత్యాగమును దత్త్వజ్ఞానమును బెక్కువిధముల నుపదేశించి అన్యులకు గోచరముగాని దివ్యరూపమును దాల్చి విశ్వరూపమును జూపి "నేను లోకక్షయకారియగు కాలుండను. ఇచ్చట నీవు చూచు రాజసమూహప్రాణములు నా గ్రస్తములైనవి. నీవు చంపవలసినదేమియు లేదు. భీష్మద్రోణాదులెల్లను వధింపబడువారై నాచేతం జచ్చియున్నవారలను జంపుటకు నీవు నిమిత్తమాత్రుఁడవుగమ్ము. లెమ్ము. రాజ్యముం గైకొను" మని పలికెను. అప్పుడు విజయుఁడు వాసుదేవునకు పునః పునః ప్రణామము లాచరించి "దివ్యరూపధారుండవైన యచ్యుతా! నాయందు కరుణవహించి సౌమ్యరూపధారుండవుగమ్ము. జగదీశ్వరుండవని యెఱుంగక నిన్ను సఖుఁడవనియు, బావవనియు భావించి సల్లాపము లాడుచుండుదును. నా యజ్ఞానము సైరింపు" మని ప్రార్థింప నద్దేవుఁడు ప్రీతుఁడై విశ్వరూపమును విడిచి శ్రీకృష్ణరూపముఁ దాల్చెను.

ఇట్లు విజయుఁడు వాసుదేవునిచేఁ జ్ఞానోపదేశము వడసి రణోత్సాహుఁడై గాండీవము గైకొని గుణధ్వని సేయఁ దొడఁగెను.

అనంతర మిరువాగులముల వారును నధికోత్సాహముతో నొండొరు లం దాకి శరవర్షముఁ గురియించుచు తమతమ విక్రమము మెఱయ నని సేయసాగిరి. దుర్యోధన ప్రేరితుండై భీష్ముఁడు దారుణ ఘనఘోరాస్త్రములను విసర్జించి పాండవబలముల చిందరవందర గాఁ జేయఁ దొడంగెను. ఇట్లు కౌరవులును పాండవులును దిన నాథుఁడు పశ్చిమాంబుధిఁ గ్రుంకువఱకును సమరము సేసి పిమ్మటఁ దమతమ నివాసముల కేఁగి విశ్రమించిరి.

ప్రభాతంబైన పిమ్మట ధర్మతనయునిచే ననుజ్ఞాతుండై ధృష్ట ద్యుమ్నుఁడు పాండవవాహినిని క్రౌంచవ్యూహము బన్ని సమ రారంభము సేసెను. భీష్ముఁడును సర్వసేనాధిపతియై నడిపింపఁ గౌర వులును సహోత్సాహులై సమరాంగమున కరుదెంచిరి. అప్పుడు భీష్ముఁడు శ్రీకృష్ణు నవలోకించి

మ. "ఘనసేనం గలఁగింగఁ జేయుచు మదిన్ మందారికి నీ నందనుం
డు నిముం కొనకున్న వాఁడితని యాటోపంబడంగించెదన్
నిను మెప్పించెదఁ జూడు ఖేచరులు వర్ణింపన్ విజృంభించెదన్
దనుజఘ్నా యిపుడీ రథంబులే పఱపు ముద్యద్విక్రమ ప్రక్రియన్."

అని వచింప, కృష్ణుఁడు మందస్మితవదనారవిందుఁడై, కపిధ్వజ, శ్వేతహయములచే నలరారు నర్జునరథము నతివేగముగ గాంగే యుని దెసకుఁ దోలెను. అంతట భీష్మార్జును లతిభీకరముగ సంగ్రా మము సేసిరి. అప్పుడు ద్రోణ, కృప, శల్య, దుర్యోధన, వికర్ణులు భీష్మునకు సహాయులై ధనంజయునిపై ననేక సాయకములఁ బఱపసాగిరి. కిరీటి యందఱకన్న ప్రోడయై నిజశౌర్యము విరాజిల్ల నని సేయుచుండెను. సాత్యకియు, నభిమన్యుఁడును, ద్రౌపదేయులును

ధనంజయానకుఁడోడ్పడిరి. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితోఁ బోరఁ దొడఁగెను. భీమసేనుఁడు విజృంభించి కళింగభూమిపతినిఁ దాకి సమరమున సంహరించి, యాతని యనుజుఁడగు భానుమంతునిఁ బరిమార్చెను. ఇవ్విధమున నుభయపక్షముల వారును దమ మహాపరాక్రమము జూపుచుఁ బవలెల్ల నాయోధనము సేయుచు, వారిజమిత్రుం డస్తగిరి శిఖరమునకుఁ జేరఁ బిమ్మట సమరమును జాలించి తమతమ శిబిరములకేఁగి విశ్రమించుచుండిరి. ఉభయపక్షముల సైన్యములును సంఖ్యాతీతముగ రణావనిం ద్రెళ్ళుచుండెను.

ఎనిమిదవనాఁటి రణమున, ధనంజయుని సుతుండును, భుజగరాజదౌహిత్రుఁడును నైన యిరావంతుఁ డలంబుసుఁడను రక్కసునిచే మృతుఁడయ్యెను. సునాభుఁడును, నాదిత్యకేతుఁడును, నపరాజితుండును, బహ్వాశియుఁ బండితకుండును, కుండధారుండును, విశాలాక్షుండును, మహోదరుండును నను ధృతరాష్ట్రతనూజులెనమండ్రు వృకోదరునిచే నిహతులైరి.

సుయోధనుఁడు తన యనుజుల మృతికి వగచుచు నాఁటిరాత్రి గాంగేయుని పాలికిఁ బోయి

మ. "నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నేఁ జీరికిం
గొననీవారలు చందముల్ దెలియఁ జెక్కుల్ సూచితిం జేరి చే
రి నయంబిచ్చుచు నోంపమాల్కొనక వారిం బట్టి పోలార్చెదోం
డన నేరం గురుముఖ్య యింక నిటనీ వాలంబు సాలింపవే."

చ. అని కొనదేవ దానవుల కైనను మార్కొనరాదు నిన్ను నేఁ
డెనిమిది నాళ్ళు లయ్యె సమయింపవు నోంపవు సవ్యసాచిన
ప్పని యటులుండనిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టునా
చనువునఁ బోవనిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే.

అని పలికెను. అవ్వచనములు పితామహుని మనమున శూలములవలెఁ గాఁడ నద్దేవవ్రతుండును నిట్టూర్పు నిగిడించి సుయోధను నవలోకించి

సీ. "కాల్పఁడే మహనీయు ఖాండవం బింద్రుని
నమరగణంబుతో విముఖుఁ జేసి
బహుదివ్యశరములు వడయఁడే యొక్కటి
బవరాన మెప్పించి శివుని చేత
గంధర్వులకు నోడి కర్ణుండు నీ తమ్ములును
బాఱ విడిపించికొనఁడె నిన్ను
నిను నను ద్రోణు నాతనిపుత్త్రుఁ గృపుఁ గర్ణు
గెలిచి విరాటుగోవులఁ గొనఁడె

ఆ. తక్కు పెక్కులెడలఁ బెక్కండ్ర నేమేమి
సేసె వినమె యట్టి జెట్టి నిన్ని
దినములిట్లు దొడరి పెనఁగియు నీచేత
నేఁడు వినఁగవలసె వేడిపలుకు."

దైవబలసంపన్నులగుపాండవులఁ గెలువశక్యముగాదని మే మెన్నివిధములఁ జెప్పినను వినక వారలతో రణమునకు గడంగితివి. నేనుశక్తివంచనలేకఁ బోరాడుచుంటి నింకేమి సేయఁగలవాఁడ? అయినను రేపటి సమరముఁ జూడు" మని చెప్పి పంపించెను.

తొమ్మిదవనాఁటి యుదయమున నుభయపక్షములవారును, భేరీభాంకారశంఖాది నిస్వనగర్జాస్ఫూర్జిత బహుళముగా నొండొరులఁ దాకి పోరఁదొడఁగిరి. పితామహుఁడు విజృంభించి పాండవసైన్యముఁ జెండాడుచుండఁ గపికేతనుఁ డమ్మహానీయు నెదుర్కొని వాడినారాచములం బ్రయోగింపసాగెను. మందాకినీ

నందనుఁడును గాండీవిపై నిశితసాయకములఁ బ్రయోగించి యాతనిని నొప్పించుచుండెను. అర్జునుఁడు కొంచెము డస్సినటులఁ గానఁబడినతోడనే దేవకీనందనుఁడు రోషపరవశుఁడై "నేనీక్షణమునఁ భీష్మునిఁజంపి, సవ్యసాచికిజయముఁ గూర్చెద" ననుచుధరణిపై కుఱికెను. గాంగేయుఁ డదిగాంచి "అనంతా! శీఘ్రముగ వచ్చి నన్నుఁ గడదేర్చి పరమపదము నొసంగు" మని ప్రార్థింపఁ దొడఁగెను. అప్పుడుకిరీటియుఁ బుడమిపైకిదుమికి జనార్దనునిబట్టుకొనిఁ "దనుజభంజనా! నీవుమున్ను రణమునఁ గయ్యము సేయనని ప్రతిజ్ఞ సేసి, యిప్పుడు సంగరమున కేఁగినఁ బ్రజ లేమందురు? నీయట్టి మహానుభావుఁ డాడినమాటఁ దప్పవచ్చునా? నాప్రార్థనాలించి యీ ప్రయత్నము మానుము" మని వేఁడ, కృష్ణుఁడు ప్రీతుఁడై మరల నరద మధిరోహించి విజయునకు సారథ్యము సేయఁదొడఁగెను. విజయుఁడు మరలవిజృంభించిసమరము సేయఁదొడఁగెను. ఆనాఁటి రణమునఁ బాండవవాహిని నంతయుభీష్ముఁడుబీభత్సము సేసెను. అంశుమంతుఁ డస్తాద్రిం జేరినపిమ్మట నిరుబలములవారును సమరము చాలించి తమతమ శిబిరముల కేఁగిరి.

ఆ నాఁటి రాత్రి యుధిష్ఠిరనృపాలుఁడు తన వారెల్లఱుఁ బరిశ్రాంతులై భీష్మునెదుర్కొనఁజాలరై రని చింతించి వాసుదేవునితో నాలోచించి, యనుజ సమేతుఁడై రహస్యముగ భీష్ముని శిబిరమున కేఁగెను. పితామహుఁ డత్యాదరమునఁ బాండవుల సేమము నడిగి "వచ్చిన కార్యము నెఱిఁగింపుఁ" డన, ధర్మనందనుఁడుదీనాననుండై "పితామహా! మాయెడఁగరుణాళుఁడవై మాకు

జయము సేకూరునుపాయము నుపదేశింపు" మని వేడెను. గాంగే యుఁ డవ్వాచనములకుఁ బ్రీతుఁడై "ధర్మనందనా! నన్ను జయించినఁ గాని నీకుఁ జయము సేకూరదు. ఆయుధపాణినై యున్నంతవఱకు నన్ను నిమిషులు సైతము గెలువఁజాలరు. కావున నన్ను జయించు విధముఁ దెలిపెద నాకర్ణింపుము. పుట్టినప్పుడు స్త్రీ యై మధ్యకాల మున నొరుల నాశ్రయించి పురుషత్వము నొందిన వాఁడగుటచే శిఖండితో నే నని సేయనొల్లఁ; ధనంజయుండు వానిం బురస్క రించుకొనివచ్చి, నేనేయుట మానిన సమయమున నాపై శరములఁ బ్రయోగించి నొప్పించి పడద్రోవవలయు; పడంపడి ధార్త రాష్ట్రులఁ జయించుట సుకరము. మీరలు శంకింపక నిర్విరోధమున నన్నుఁబడద్రోచి జయలక్ష్మిఁ జేకొనుఁ" డని నిజవధోపాయమును మనుమలకుఁ జెప్పి పంపించెను.

అనంతరము విజయుఁడు పురుషోత్తము నవలోకించి "కమల నాభా! ధర్మనిరతుఁడును, లోకమాన్యుఁడును నగు దేవవ్రతునిఁ గృతకవృత్తిం జంపఁజాలను. అమ్మహామహుండు బాల్యమున నాటలాడునసమయమున నన్నెత్తుకొని నా మేనంగల ధూళినిఁదులిపి యతిప్రేమమునఁ గౌఁగిలించుకొని మాతండ్రిసుగుణములఁ దలఁచి కన్నీరునించుచు, ననేకవిధముల నాకుఁ బ్రియముసేయుచుఁ బెని చెను. అట్లు తండ్రికంటె నెక్కుడుప్రేమతోఁ బెంచిన పితామహుని వంచనచేఁ జంపనొల్ల" నని మిక్కుటముగఁ జింతింప, వాసుదేవుఁ డాతనికి క్షాత్రధర్మము నుపదేశించి దుఃఖోపశమనము సేసెను.

ప్రభాతమైన పిమ్మట నిరుబలములవారును రణరంగమున

కరుదెంచి యొండొరులం దాకియుగ్రముగఁ బోరదొడఁగిరి. అప్పుడు
గాండీవి శిఖండిని ముందిడుకొనివచ్చి పితామహునితో ననిసేయ
నారంభించెను. అవిగాంచి దుశ్శాసన, కృపాశ్వత్థామాది యోధు
లెల్లరును భీష్మునకు సహాయులై వచ్చి కిరీటితోఁ బోర నారంభింప
సాత్యకి, ధృష్టద్యుమ్న భీమాదులు ఫల్గునునకుఁ దోడై వారితో నని
సేయఁదొడఁగిరి. గాంగేయుఁడు విజృంభించి సంగ్రామము సేయుచు విర
టుని తమ్ముండ్రగు శతానీకునిఁ జరిమార్చెను. పురందరనందనుండు
శాత్రవుల కందఱకన్ని సాధ్యులై వారుణాగ్నేయాది మహాశర
ములం దెగఁబడుచు, శిఖండిచాపము వెనకఁ దనవిల్లునిల్పి యాతఁ
డేసినటులఁ దాను వాఁడి నారాచములఁ బ్రయోగించి మందాకినీ
నందనుని నొప్పించుచు, నమ్మహామహుఁ డేసిన వింశత్తిన
నన్నిటినిఁ దాను ఖండించుచుండెను.

అప్పుడు శాంతనవుఁడు తనమనమున "పాండవులకువిజయము
సేకూరు నుపాయమునుపదేశించితిఁ గావున నేనిఁక సమరము
చాలించి శాంతివహించుట సమంజస" మని యోజించుచుండ
బృందారకులమ్మహానీయు తలంపునెఱింగి "ఇదియేమాకుసమ్మత"
మని, యొరు లెఱుంగరాని విధమున దేవవ్రతునకుఁ జెప్పి
యమ్మహాత్మునిపయిఁ గుసుమవర్షముఁ గురియించిరి. అనంతరము
శాంతనవుండు దుర్యోధన దుశ్శాసనుల నవలోకించి

సీ. "అశనికల్పములివి యర్జునుబాణముల్
గాని శిఖండివి గావుసుమ్ము
కర్కటి గర్భము కరణిగాత్రముబ్రచ్చి
నిట్టివి దీనికి నెందుఁగలవు

బ్రహ్మదండంబుల పాటిరై మర్మంబు
　　　　విట్టి నొప్పాఁటునే యితనిచేత
జముదూతలట్లఁ బ్రాణముల వే
　　　　ర్పంగ నీద్రుపదాత్మజుఁడెన్నఁడేసె
దృఢవిముక్తములును దీప్తాకృతులు లక్ష్య
శుద్ధిమంతములును సునిశితములు
నైన నారసంబు లతినివి గాక యా
తనివియగునె యెవ్విధమునఁ జూడ.''

అనిపలికి మఱియొక ఘనశక్తిని ధనంజయునిపయి బ్రయోగింపఁ బార్థుఁడు దానిం దునుమాడి పితామహుని విరథునిఁజేసెను. పిమ్మటసురనదీ సుతుఁడు తన యరదముఁడిగ్గివాలును, బలుకయుఁ జేఁబూనిపోరాడసాగెను. పాండవసైనికులెల్లఱును భీష్మునిపయిఁ గవిసి నిష్ఠురాస్త్ర శస్త్రములఁబ్రయోగించి క్షతగాత్రునిఁజేయఁ దొడఁగిరి. అప్పుడుభానుమంతుఁడస్తాద్రిం జేర నుద్యుక్తుండగుచుం డెను. ఆసమయమునఁ గిరీటి నిశితసాయకములఁ బ్రయోగించి పడఁద్రోయ భానుసమతేజుఁడగు భీష్ముఁడు తూర్పుతలగాఁ బడి పోయెను. అప్పు డమ్మహాపితామహుని తనువు ధరణినంటకుండునట్లు శరములూఁతయై తల్పముభంగినుండెను. అది దక్షిణాయనంబగు టచే దేవవ్రతుండప్పుడు మృతినొంద నొల్లక నుత్తరాయనము వచ్చువఱ కాయంపశయ్యపైనుండ నిశ్చితుండయ్యెను.

పాండవధార్తరాష్ట్రులు పితామహుని పాటునకుఁ గడు దుఃఖితులై సమరముసాలించి యమ్మహానీయుని పాలికిఁబోయిరి. దేవవ్రతుఁడువారలఁగాంచి "నాకుఁదలగడ కావలయు" ననియడిగెను. అంత నందఱును మెత్తని పట్టుతలగడలఁ దీసికొనిరాఁ గాంగే

యుఁడు తనకుఁగావలసిన తలగడలవి గావనిచెప్పి కిరీటినిగాంచి "నా కీశరతల్పమునకుఁ దగినయుపధానంబు వెట్టు" మనికోరెను. సవ్యసాచి యవ్వచనములనాలించి శోకాకులితమానసుఁడై, గాండీవముఁగైకొని మూఁడువాలమ్ములభిమంత్రించి పెడతలఁదాఁకి యెత్తిపట్టుకొని పుంఖంబులు భూమిమోచి నిలుచునట్లుగా నేయఁ బితామహుఁడు ప్రీతుఁడై "తగినతలగడ నేర్పఱచితి"వని యాతనిఁ బొగడెను. అప్పుడు శల్యచికిత్సకులు కొందఱు చికిత్స సేయ నరుదేర భీష్ముఁడు వలదని వారలను వారించి, తనపౌత్రులను సకల ధాత్రీపతులను నవలోకించి "నాకు సలిలంబులం ద్రావవలయు" ననియడిగెను. పితామహునితృష్ణందీర్ప ధార్తరాష్ట్రులు నిగ్గులోదకముఁదెచ్చి యీయఁబోవ దేవవ్రతుండు "శరతల్పగతుండనైన నేనీసలిలముల బానము సేయఁజనదు. తేజోమయాస్త్రవిన్యాసవిధి సముత్థితమైన భూజలము గావలయు" ననివచించి కవ్వడినుద్దేశించి

క. "శరవేదన సర్వాంగము
నెరియఁగ నాకిపుడు పెదవులెండెనుఁ దృష్ణా
భర ముడుపఁ దగిన నీరులు
వెరవునఁదే నేర్తు వీవ వేలెమ్మనఘా."

అనిపలికెను. అంతటఁ గిరీటి పితామహునకుఁ బ్రదక్షిణము సేసి తేజోమయమైన మార్గణము పర్జన్య మంత్రాభి మంత్రితము గావించి మహీతలముగాడ నేయ భాసురచ్ఛాయమగు తోయము ధారారూపమున దివ్యగంధరసోపేతమై యొగసెను. దానిందెచ్చి యీయఁ బితామహుఁడు తృప్తుఁడై విజయునిఁ గీర్తించెను. పిమ్మటఁ బాండవధార్తరాష్ట్రులచ్చోటఁబరిఘతోడి ప్రాకారముఁ

గట్టించి పితామహుని రక్షణమునకుఁ బెక్కువారిని నియమించి యద్దేవవ్రతుని యనుజ్ఞ గైకొని దీనాననులై తమతమ నిలయములకేఁగిరి.

అనంతరము కర్ణుఁడు గాంగేయుని పాలికిఁబోయి భక్తివినయములతోడఁ బ్రణామ మాచరించి "మహాత్మా! నాయందలి యలుకవిడిచి వాత్సల్యమునుంచవు" మని వేడ దేవవ్రతుఁ డాతని నాలింగనము సేసికొని "కుమారా! నీవు కౌంతేయుఁడవుగాని రాధేయుఁడవుగావు, అక్కారణమున నాకు నీయెడ వాత్సల్యముగాని క్రోధ మెన్నఁడును లేదు. మీరలు దురాలోచనలఁ జేయునప్పుడు మీ ప్రతిమఁ గాంచి సదుపదేశము సేసితి: అది వాత్సల్యాతిశయమునఁ జేసినసుశిక్షగాని, క్రోధముగాదు. సుయోధనుఁడు మదీయవచనముల నాలింపక పాండవులతోడి వైరముఁ దెచ్చికొనియె. శ్రీకృష్ణుఁడు సహాయుఁడై యుండుటచే నీరణమునఁ బాండవులే విజయులయ్యెదరు. కావున నీవిపుడు పాండవులఁ గలసి సామ్రాజ్యాభిషిక్తుఁడవై సుఖింపు"మని వచించెను. "పితామహా! ఇంతకాలమునుండియు సుయోధనుని యన్నముఁదిని యిప్పుడాతనిని విడిచిపోవుట యధర్మముగావున, సుయోధనుపక్షమునఁ బాండవులతోఁ బోర నాకనుజ్ఞ నొసంగు"మని కర్ణుఁడు గాంగేయునిఁ బ్రార్థించి యమ్మహాత్మునిచే ననుజ్ఞాతుఁడై నిజ నివాసమునకేఁగెను.

## —* ద్రోణ పర్వము *—

పదునొకండవనాఁడు సుయోధనుఁడు కర్ణుని సమరమునకుఁ బిలిచి యాతనితో నాలోచించి, సర్వసైన్యాధిపత్యమునకు ద్రోణా

చార్యునభిషేకించెను. భీష్మునవంతరమున సుయోధనుఁడుతన్నుఁ గౌరవించినందులకు ద్రోణుఁడు ప్రీతుఁడై "కౌరవనాథా! నీవు నాయెడనధికగౌరవము సూపితివిగావున నీకొక్క వర మొసఁగెద. ఇచ్చవచ్చినదానిఁ గోరు"మని చెప్పెను. "గురువరేణ్యా! ప్రాణములతో ధర్మతనయునిఁ బట్టి నాకొసఁగు" మని సుయోధనుఁడు కోరెను. "అవనీతలేంద్రా! అజాతశత్రునిఁ జంప గోరక ప్రాణములతోఁ దెచ్చియిమ్మనుట కేమికారణ" మని భారద్వాజుఁ డడుగ దుర్యోధనుఁడు "యుధిష్ఠిరునిఁ జంపినచోఁ గిరీటికోపించి కౌరవుల నందఱిని బరిమార్చును. మఱియు పాండవులనందఱిని వధించినను కృష్ణుఁడు కుపితుఁడై మమ్మునందఱిని జక్కాడి కుంతీదేవికైన రాజ్యమునొసంగును. ప్రాణములతో ధర్మనందనునిఁ దెచ్చినవో మరలజూదమాడి నిరోధించి వనమునకుఁ బంపించి నేనునిరాటంకముగ రాజ్యము నేలవచ్చునని యిట్లుకోరితి" ననుచుఁ దన యభిమతము నాచార్యున కెఱిఁగించెను. ద్రోణుఁడు దానిని గూరాలోచనమునకుఁ బోసి

చ. "నరుఁడెడసొచ్చెనేని విను నాకది దుష్కరమైన నొక్కఁడనే
సురగణమైన ద్రెళ్ళఁగని చూపఁగఁజాలరు వాఁడులేనిచోఁ
దొరమై పోరనిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టినింటి వే
ల్పురు వెలఁగంది మానవలవుంజలముం జెనఁబట్టి తెచ్చెదన్."

అని వచింప దుర్యోధనుఁడు సంతసిల్లి గురుప్రతిజ్ఞ నెల్లెడలఁ జాటఁబనిచెను.

అప్పుడుకౌంతేయాగ్రజుఁడు గురుప్రతిజ్ఞనాలించి విజయునిఁ గాంచి "తమ్ముఁడా! ఆచార్యుఁడిట్టి ప్రతిజ్ఞఁ జేసెఁ గావున సమర

మున నీవు నిరంతరము నన్నెడఁబాయకఁ గాపాడుచుండవలయు"
నని వచింప, సవ్యసాచి

క. "క్షోణీవల్లభ వినుమేఁ
బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టికొనఁగ నా
ద్రోణునకె కాదు సగణ
స్థాణునకైనను వశంబె తలఁకేమిటికిన్.

చ. అలవి యెఱుంగ కిప్పొయి దురాశఁ దలంచిరి గాక ధార్తరా
ష్ట్రులు త్రిజగమ్ములం గని యొటు స్ఫురణం జనుఁ దెంచిరే నియు
బలవదరాతిపుంజ మదభంజన నీకని భంగపడ్డ నీ
యుల శకలంబులై చెడఁ నిలుంక వారిధి నింగి కూలదే."

అనుచు నగ్రజునకు ధైర్యముఁ జెప్పెను.

అనంతర మిరువాగులవారును రణరంగమునకరుదెంచి విజృంభించి యొండొరులతోఁ బోరాడఁ దొడగిరి. ద్రోణాచార్యుఁడు దివ్యాస్త్రములఁ బ్రయోగించి పాండవసైన్యముఁ జెండాడుచు యుధిష్ఠిరు నెదుర్కొని పోరనారంభింప ధనంజయుఁ డడ్డపడి యాచార్యునితో ననిసేయఁ దొడఁగెను. ఇరుబలములవారును నిట్లు సూర్యాస్తమయ మగువఱకు సమరము సేసి యనంతర మెప్పటియట్లు దమతమశిబిరముల కేఁగి విశ్రమించిరి.

అప్పుడు దుర్యోధనుఁడు ధర్మనందనుఁడు పట్టువడమికి విచారింప నాచార్యుఁడు "నృపాలా! విజయుని దవ్వునకుఁ దీసికొని పోయి పోరాడఁజాలిన యోధు లెవ్వరైనఁ గలరేని, కడమవారని నేనుజయించి యుధిష్ఠిరునిఁ బట్టఁజాలుదు; మఱియు నప్పుడజాత శత్రుఁడు రణభూమినిఁ దొలఁగిపరుగిడకుండెనేనిఁ బట్టఁగలవాఁడ" నని వచించెను.

మఱునాఁటి యుద్ధమునఁ ద్రిగర్తనాథుఁడైన సుశర్మ సుయోధనుపాలి కరుదెంచి "రాజేంద్రా! ఈసమరమున మే మర్జునునితోఁ బోరి యాతనిఁ దెగటార్తుము. అట్లు సేయలేనిచో నాతనిచేఁ జత్తుము. నేఁడు రణభూమియందు ధనంజయుం డొండెఁ ద్రిగర్తు లొండెఁ గావలయు" నని ప్రతిజ్ఞ సేసి, సంశప్తకు లనం బఱఁగు తనవారి ననేకవేల రథములవారినిఁ గూడి సమరభూమి కరుదెంచి "మాతోడ రణము సేయ నరుదెంచి నీశౌర్యముఁ గనఁ బఱుపు"మని సవ్యసాచినిఁ బిలిచెను.

అప్పుడు సవ్యసాచి యుధిష్ఠిరు నవలోకించి "అగ్రజా! సంశప్తకులు నన్నా యోధనమునకుఁ బిలుచుచుండిరి. నేనిపుడచటి కేఁగకుండుట పౌరుషహీనముగావున, నీరక్షణమునకుఁ బాంచాల కుమారుఁడైన సత్యజిత్తును నిలిపి నే నని సేయనరిగెద" నని చెప్పి యాతని సెలవుఁగైకొని సంశప్తకులతోఁ బోరనేఁగెను. సంశప్తకు లాతని నతిదూరముగఁ దీసికొని పోయి సమరము సేయఁదొడఁగిరి.

ఇటఁ గౌరవ పాండవ వ్యూహములు నొండొంటిం దాకి యెప్పటివలెసంగ్రామము సేయుచుండెను. ఆనాఁటిరణమున నాచార్యునిచే సత్యజిత్తు నిహతుఁడయ్యెను. ధర్మనందనుఁ డదిగాంచి గురుని పరాక్రమమునకు వెఱచి రణభూమినివిడచి పాఱఁదొడఁగెను. అప్పుడు విరటుని తమ్ముఁడైన సూర్యదత్తుఁడు ద్రోణుని మార్కొని యాతనిచే హతుఁడయ్యెను. అభిమన్యు, సాత్యకి, ధృష్టద్యుమ్న ప్రముఖులు యుధిష్ఠిరునిఁ గూడివచ్చి భారద్వా

జునిపై విజృంభించి పోరఁదొడఁగెను. భీమసేనుఁడు వంగదేశ నాధునితోఁ బోరి యాతనిఁ దెగటార్చెను. అప్పుడు ప్రాగ్జ్యోతిష దేశాధీశుఁడగు భగదత్తుఁడు సుప్రతీకమను తనగజమును పాండవ వాహినిపై నుఱికింపఁ బోరఁగొల్పె నది పాండవయోధుల సంహతిని నొప్పించి వాహినినంతయు భీభత్సముసేయ నారంభించెను. ఆసమయమున [illegible] ఘోరవిక్రమంబున భగదత్తు నెదుర్కొని యాతనిచే నొచ్చెను.

అప్పటికి విజయుఁడు సంశప్తకులందుఁ బదియేనువేల రథముల వారింగూల్చి, భగదత్తుఁడంతి తన వాహినినంతయుఁ గలంచు చుండుట గాంచి, భగదత్తునిపైఁ గేఁగ నుద్యుక్తుఁడుగాఁ, పెక్కు సంశప్తకులు పదునాలుగువేల రథములతో నాతనిపైఁ గవిసిరి. విజయుఁడు నిజగాండీవబలము ప్రకాశింపదివ్యాస్త్రములఁ బ్రయోగించి యవ్వీరుల సంహతిని బరిమార్చి, సుశర్మను మూర్ఛ నొందించి వాసుదేవునిచేఁ బ్రశంసితుఁడై దేవదత్తంబు బూరించుచు భగదత్తునిపైఁ గరుదెంచి, సుప్రతీకయుతముగ నాతనిం బరిమార్చెను.

అప్పటికి భానుఁడు పశ్చిమాంబుధిని మునుఁగుటచే నుభయ పక్షములవారును రణముసాలించి శిబిరములు కేఁగిరి.

పదుమూఁడవనాఁడు సమరము : కేఁగు సమయమున సుయోధనుఁ డాచార్యునవలోకించి "గతదినమున యుధిష్ఠిరునిఁ బట్టవైతి"వని నిష్ఠురోక్తులాడ భారద్వాజుఁడు "నేఁడు నా సమరము వీక్షింపు"మని పలికి రిపులకభేద్యమగు పద్మవ్యూహము

వన్ని యమ్మొగ్గరము మొగమునఁ దానునిలిచి రణరంగమున కరుదెంచెను. అప్పుడు మరల సంశప్తకుల నేకులు వచ్చి విజయు నతిదూరముగఁ దీసికొనిపోయి పోరాడసాగిరి.

అప్పుడు యుధిష్ఠిరుఁడు సౌభద్రు నవలోకించి "కుమారా! పద్మవ్యూహమును భేదించుక్రమము విజయునకును, కృష్ణునకును నీకునుఁదక్క నన్యులకుఁ దెలియదు. కావుననీవు నేఁ డివ్వ్యూహ మ్యూహము భేదించి మనగౌరవము నిలుప వలయు" నని వచింప నక్కుమారుఁడు మందస్మిత వదనారవిందుఁడై "తండ్రీ! నేను పద్మవ్యూహమును భేదించువిధము నెఱుంగుదునుగాని, యచ్చట శాత్రవులు చుట్టుముట్టినచో మరలివచ్చు విధము నెఱుఁగ" నని పలుకులు సెప్పెను. "నీవు కొంచెము భేదించి మార్గము నీసినచో సాత్యకి, ధృష్టద్యుమ్న, భీమ నకుల ప్రముఖులును నేనును నీవెంబడిన యరుదెంచి [illegible] సేయఁగలవార" మనియుధిష్ఠిరుఁడు పలుక నభిమన్యుఁ డధికోత్సాహుఁడై తన యరదము నతిత్వరిత ముగఁ బోనిచ్చుకొనిపోయి దుస్సభేద్యమగు పద్మవ్యూహము భేదించి యమ్మొగ్గరము సొచ్చి రౌద్రరసోల్లసిత మూర్తియై, మహార్ణవమునఁ దిరుగు మందరనగము చందమున నందుఁ జరి యించుచు శాత్రవవాహినిఁ జెండాడఁ దొడఁగెను. అప్పుడు దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, కృప, ద్రోణాశ్వత్థామాది యోధ వరులెల్ల రాతనిపయిఁ గవిసి శరవర్షముఁ గురియింప సుభద్రా సుతుఁడు విజృంభించి యందఱ కన్నిరూపులై యుగ్రముగఁ బోరుచు కొందఱిని మూర్ఛితులఁ జేసియుఁ గొందఱినిఁ

బరిమార్చియుఁ గొందఱిని విరథులఁ జేసియు ననేక విధముల నందు వీరవిహారము సలుపుచుండెను.

అభిమన్యుని పెలుండనఁ బాండవులు మొగ్గరము సొచ్చుచుండ సైంధవుఁడు వారల కడ్డుపడి పోరసాగెను. మున్ను పశుపతి యొసంగిన వరప్రభావమున వాఁడానాఁడు యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల కడ్డుపడి వారిని మొగ్గరము సొరనీయక యుగ్ర ముగఁ బోరుచుండెను.

కాననమునఁ జరియించు తీవ్రానలము చందమున నమ్మొగ్గ రమున సంచరించుచున్న ధనంజయ నందనునిచే, దుర్యోధన పుత్రుఁడగు లక్ష్మణుఁడు మృతుఁడయ్యెను. పమ్మట గౌరవ యోధులెల్ల నక్కుమారునిపైఁ గవిసి కొందఱాతని ముందరనిలిచి పోరాడుచుండ, మరికొందఱు వెనుక భాగమునకువచ్చి నిశితాస్త్రముల ప్రయోగించి ధనువుఁ ద్రుంచి హయసారథులఁ గూల్చి యక్కుమారుని విరథునిఁజేసిరి. అంత నక్కుమారసింహుఁడు తనవాలును బలకయుఁ గేలఁబూని గగనభాగమున కెగసి వినతా తనయుని విధమున సంచరించు చుండ నాచార్యుఁడు శస్త్రమును బ్రయోగించి యాతని వాలునుఁ బలకయును దునుమాడెను. అనంతర మక్కుమార రత్నము తనగదఁగైకొని యాయోధనము సేయుచు నరివీరులఁ జక్కాడుఁ బరిమార్చుచుండ దుశ్శాసనునిసుతుఁ డాతని నెదుర్కొని పోరు సాగెను. అక్కుమారద్వయము ఘోరముగ గదా యుద్ధము సేయుచుఁ గొంత తడవున కొకరి గదాఘాతమున కొకరు

ధరణిం గూలి విగత జీవులైరి.

అభిమన్యుని మరణమువిని పాండవులు దుఃఖాకులిత మానసులై, యంబరమున యపర రత్నాకరము సొచ్చినపిమ్మట సమరము చాలించి తమనివాసముల కేఁగి విచారాక్రాంత మనస్కులై, "ధనంజయుఁడు వచ్చిన నేమి సెప్పుద"మని చింతించుచుండిరి.

విజయుఁడచ్చట సంశప్తకులనందఱినిఁ బరిమార్చి శిబిరమున కరుదెంచుచుండ మార్గమధ్యమున నాతనికిఁ బెక్కు దుశ్శకునములు గానవచ్చెను. కిరీటియదిగాంచి తనవారికేమి విపత్తు సంభవించెనో యనుకొనుచువచ్చి నిజతనయుని మరణవార్తనాలించి "హా! కుమారశేఖరా! భరతాన్వయరత్నదీపా! నన్నుడఁ బాసి నాకమున కేఁగితివా? అనుచు ధరణిపైఁబడి దుఃఖాతిశయమునఁ బెక్కువిధముల విలపింపఁ దొడఁగెను. దేవకీతనయుఁ డాతనిఁ గ్రుచ్చియెత్తి "ధనంజయా! వీరస్వర్గమునొందిన యకుమారరత్నము కొఱకు నీవింత విలపింపవల"దని యనేకవిధములఁ జెప్పి యోదార్చెను. విజయుఁడు యుధిష్ఠిరు నవలోకించి గద్గదకంఠుఁడై

ఉ. "పావని సేరకుండఁ గొకొ పార్థుఁడు వచ్చుట లేదె యొండుమై
బోవఁగ బంచితే ద్రుపదుఁ బోరికి సాత్యకి రాక తక్కెనే
భూవర మత్స్యనాథుఁ డెటవోయెనొ చెప్పఁగఁదైన నీకు నం
గావఁగఁ రాక తక్కెనో తెగం గతమేమి సుభద్రపట్టికిన్."

అని నిట్టూర్పులతో నడుగ, ధర్మనందనుఁడు, పశుపతి వరప్రభావమున సైంధవుఁడు తమకడ్డుపడిన విధమును సౌభద్రుఁడు పెక్కండ్రు యోధులఁ బరిమార్చి రణావనిం ద్రెళ్ళిన విధమును నాతనికి సవిస్తరముగఁ జెప్పెను. అంతట విజయుఁడు గాండీవహస్తుఁడై

చ. "అనిమిషదైత్య కింపురుషులాదిగ నెవ్వరువచ్చి కాచినం
దునుముదు నెల్లిసైంధవుని దోయజమిత్రుడు గ్రుంకకుండ ము
న్న నరవరేణ్య యిత్తెఱగు నాకొనరింపగ రాకయున్న నే
ననలముసొచ్చువాడ నృపులందఱు జూడగ గాండివంబుతోన్."

అని ప్రతిజ్ఞ జేసెను. పిమ్మట శ్రీకృష్ణుడు దూతగాను, సుభద్రను, ద్రౌపదిని నూరడించివచ్చి తన సారథియైన దారుకుని బిలిచి "నేను రేపు సంగ్రామమునందు పాంచజన్యము పూరించిన తోడనే నీవు గరుడధ్వజ విరాజితమైన మన యరదము దోలుకొని రమ్మ"ని యాజ్ఞాపించి శయనించెను. ధనంజయుడును కుమారుని దలంచి మనమున దుఃఖించుచు శయనించి కొంత తడవునకు నిద్రాపరవశుడయ్యెను. అప్పుడు స్వప్నమున నాతనికి శివుడు ప్రత్యక్షమై పాశుపతాస్త్రమును మరల నుపదేశించెను.

అర్జునుని ప్రతిజ్ఞను విని సైంధవుడు భీతిల్ల ద్రోణు డాతనికి ధైర్యము గఱపి పదునాలవదినమున దన సైన్యమును, సూచీవ్యూహమును, పద్మవ్యూహమును, శకటవ్యూహమును నను మూడు వ్యూహములుగ నన్ని సూచీముఖస్థానమున సైంధవు నునిచి, శకటవ్యూహ ముఖమున దాను నిలిచి సమరాంగణమున కరుదెంచెను.

అట ధనంజయుడు నిజస్వప్నవృత్తాంతము దన వారి కెఱిగింప నది శుభసూచకమని యెల్లరును సంతసించుచు రణరంగమున కరుదెంచిరి. పిమ్మట నర్జునుడు సాత్యకిని ధర్మనందనుని రక్షణమునకు నియోగించి, తాను మొగ్గరము సొరనెంచి దాని యగ్రభాగమున నిలిచిన ద్రోణాచార్యునితో నని సేసి యాతని

గడచి మొగ్గరము సొచ్చి తన్నెదుర్కొనిన యోధులనందఱిఁ జెండాడుచుండెను. అప్పుడవంతిపురాధీశులైన విందానువిందులును మఱికొందఱును నృపాలురును నాతనిచేఁ జచ్చిరి. పాండవసేనయంతయు వెలుఁగులనుండి చీఁకటులలోఁ బోవుచుండెను. ఆ సమరమున ఘటోత్కచుఁ డలంబుసునిఁ దెగటార్చెను.

కొంతతడవునకు ధర్మనందనుఁడు గాండీవగుణ ఘోషమును, దేవదత్తారావమును వినకుండినందున ధనంజయునకుఁ బ్రమాదము సంభవించెనేమో యని కలఁతనొంది సాత్యకినిఁ బిలిచి "యదునందనా! నీకు గురుఁడును, సఖుఁడును, బావయునగు ధనంజయుఁ డొక్కఁడుఁ మొగ్గరముసొచ్చి తడవయ్యె; అచ్చట నాతని కేమియాపద సంభవించెనోయని నాచిత్తమధిక వ్యాకులము నొందుచున్నది. కావున నీ వాతనికి సహాయము సేయనరుగు" మని వచింప, సాత్యకి యుధిష్ఠిరుని రక్షణమునకు భీమసేనుని నిలిపి, వారణ సమూహమును గాంచు వ్యాఘ్రము చందమునఁ గౌరవ వ్యూహముఁ జొచ్చుచు విజయునకుఁ దోడ్పడనేఁగెను.

కృష్ణానుజుఁ డట్లునని ద్రోణాచార్యునిఁ గడచి మొగ్గరము సొచ్చి యోధాగ్రేసరుల నందఱినిఁ జిందరవందర సేయుచు, జలసంధ, సుదర్శను లను నృపతులఁ బరిమార్చి తన యరదమును సవ్యసాచియున్న దిక్కునకుఁ దోలించుచుండెను.

"అట ధర్మనందనుఁడు మఱికొంత తడవునకుభీమునవలోకించి తమ్ముఁడా! సాత్యకియు మొగ్గరముసొచ్చి తడవయ్యె; అయ్యిరువురి సేమమును మనకుఁ దెలియనందున నా మనము కలంక

నొందుచుండె; కావున నీవు మొగ్గరముసొచ్చి యాదవ పాండవ కుమారసింహుల సేమముల నరసి సింహనాదము సేయుము. నీసింహనాదము వినినపిమ్మట నేను భీతినుడిగి ధైర్యమున నుందు" నని వచింప, నమ్మారుతాత్మజుఁడు ద్రోణుని ప్రతిజ్ఞ నగ్గడించి పాండవాగ్రజుని రక్షణమునకు ధృష్టద్యుమ్ను నునిచి తాను సాత్యకిధనంజయుల కుశలము నరయ నేఁగెను.

పవనతనయుఁ డట్లు సని మొగ్గరిముఖమున నున్న యాచార్యునితో నని సేసి యస్వీరవతంసుని నొప్పించి మొగ్గరముసొచ్చి, సాత్యకిధనంజయుల సముల్లాసముఁ గనుఁగొని సింహనాదము సేసెను. అమ్మహానాదము విని యుధిష్ఠిరుఁడు భీతినుడిగి సంతుష్టాంతరంగుఁడై "ఫల్గునుఁ డెప్పుడు తన ప్రతిజ్ఞ నెఱపివచ్చి నన్నాలింగనము సేసికొనునో" యని మనమునఁ దలఁచుచు పార్థునిరాకకు నిరీక్షించుచు శాత్రవులతో నని సేయుచుండెను.

అట్లు మొగ్గరము సొచ్చిన భీమసేనునిఁ గర్ణుఁ డెదుర్కొని పోరుచుండ ధృతరాష్ట్రనందనులు పలువు రాతనికిఁ దోడు సనుదెంచిరి. పవనతనయుఁ డానాఁటిరణమున ధార్తరాష్ట్రుల నిరువది తొమ్మిది మందినిఁ బరిమార్చెను. పిమ్మట భీమసేనుఁడు కర్ణుని రథాశ్వములను సారథినిఁ దునిమి విరథుఁడైనయాతనిఁ బట్టుకొన రాఁ గర్ణుఁడు పవనతనయునిపై నిశిత సాయకములఁ బ్రయోగించి నొప్పించి, తొల్లి తాను కుంతీదేవి కొసఁగిన వరముఁ దలఁచి యాతనిఁ జంపనొల్లక,

ఆ. "తిండిపోత నీకు భండనం బేటికిఁ
 గడవఁజేర మనసు కాంతుదీఱ

నోఁపు కొలఁది ద్రుంగి యూరక నీవింటి
కడనయుండు మింక నడచి పడక."

అనుచు సవమానించి పంపించెను.

సాత్యకి తన్ను మార్కొనిన యోధుల నందఱి నోడించుచు వచ్చి విజయుని సమీపించుచుండఁ, గురువంశజుఁడైన బాహ్లీకుని పౌత్రుఁడగు భూరిశ్రవుఁడను యోధాగ్రేసరుఁ డాతని కడ్డుపడెను. అప్పుడు సాత్యకి భూరిశ్రవుని హయములను సారథినిఁ జంప, భూరిశ్రవుఁడు సాత్యకి రథాశ్వములను సూతునిఁ బరిమార్చెను. ఇట్లే యొకరి విల్లు నొకరు దునుమాడిరి. అంత నయ్యాదవకౌరవసింహు లిరువురును మల్లయుద్ధము సేయఁ దొడగిరి. అంతకు మున్న పెక్కండ్రు యోధులతోఁ బోరి యలసియున్నవాఁ డగుటచే నప్పుడు సాత్యకి భూరిశ్రవునితోఁ బోరఁ జాలకఁ గడుడస్సియుండెను. భూరిశ్రవుఁడాతనిఁ గ్రిందఁ బడవైచి కంఠముఁ దునుమ నుద్యుక్తుఁడై కృపాణము నెత్తెను. అప్పుడు కృష్ణుఁడు తనయనుఁగు తమ్మునిదురవస్థఁ గాంచి కిరీటికిఁ దెలుప నతఁ డొక ఘనమగు శరముఁ బ్రయోగించి కృపాణము నెత్తిన యా కురువీరుని బాహువుఁ దునుమాడెను. అంతట సాత్యకి లేచి భూరిశ్రవుని శిరముఁ దెగటార్చెను. అప్పుడు కృష్ణుఁడు పాంచజన్యముఁ బూరింప దారుకుఁడు శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకములనునశ్వములును గరుడకేతనమునుగల యరదముఁ దోలుకొనివచ్చెను. త్రికాలవేదియగు కృష్ణుఁడానాఁడు తనయనుజునకు భంగపాటు సంభవించునని యెఱిఁగియే గతరాత్రమున "పాంచజన్యముఁ బూరించినపుడు నాయరదముఁ దె"మ్మని దారుకునకుఁ

చెప్పియుండెను. కావున నప్పుడు కృష్ణుఁడు తన ప్రియానుజాన కయ్యరదము నొసఁగ నతఁడు గాని సధర్గోహించి సమరము సేయఁదొడఁగెను.

విజయుఁడు సైంధవుని వెదకఁబోవ సుద్యుక్తుఁడుగాఁ శల్య, కృప, కర్ణాశ్వత్థామాదియోధులెల్ల రాతని బ్రాపడి ఘోరముగఁ బోరఁదొడఁగిరి. అప్పటికి దిననాథుఁడు శాంతకిరణుఁడై పశ్చిమ ధరాధరము సేరఁబోవుచుండెను. అప్పుడు యుధిష్ఠిర, ద్రుపద, విరాటాదులెల్లరును చింతాక్రాంతులై "మన ధనంజయుఁ డసాధారణ ప్రతిజ్ఞఁ గావించె; ఇఁకఁ గొలఁదికాలములో సైంధవునిఁ జంప లేనిచో నతఁ డగ్ని ప్రవేశము సేయు. ఏమి సేయఁగలవారము" మనుచు పలువిధముల విచారించుచుండిరి. దుర్యోధనాదులు "మనమింకఁ గొంచెము సేపు సైంధవునిఁ గాపాడఁ జాలితిమేని విజయుఁడు తనయంతఁ దానె మడియు"నని తలఁచి సంతసించుచుండిరి.

అప్పుడు కృష్ణుఁడు గాండీవినిఁ గాంచి "ధనంజయా! నీవీ వీర వరేణ్యులనందఱినిఁ గెలిచి సైంధవుఁ బరిమార్పనవకాశములేదు; కావున నేనొక్క యుపాయము గల్పించెద" నని చెప్పి మాయాతిమిరమును గల్పించి దినకరుని మఱుఁగు పఱచెను. కౌరవులెల్ల అదిగాంచి రవి గ్రుంకెననితలఁచి సంతోషధ్వానములఁ జేయఁదొడఁగిరి. అంతట సైంధవుఁడు తనశిరమునెత్తి పశ్చిమదిశ నుపలక్షించుచుండ, వాసుదేవునిచే ననుజ్ఞాతుఁడై విజయుఁడు వాని మస్తకముఁ ద్రెళ్ళనేసెను. "అర్జునా! వీని శిరమును ధరణిం

బడసేయుకుము. వీనితండ్రియగు వృద్ధక్షత్రుఁడనువాఁ డధిక తపోవంతుఁడై "సైంధవుని మస్తకమును మహిం గూల్చినవాని శిరము నూరు శకలములగునని మున్ను వచించియుండె. ఆవృద్ధక్షత్త్రుఁడిప్పుడు శమంతపంచక సమీపముననుండె. కావున నీవీతని మస్తకము నాతని తొడపైఁ బడునట్టుల నేయు" మని కృష్ణుఁ డుపదేశింప విజయుఁడు పాశుపతాస్త్రమును జపించెను. అమ్మహాస్త్ర మాశిరముఁ దీసికొనిపోయి, శమంతపంచక సమీపమున జపము సేయుచున్న వృద్ధక్షత్త్రుని తొడపై నుంచివచ్చెను. ఆతఁడు దానిస్పర్శనమునకులికి లేవ నమ్మస్తకము ధరణింబడియె. తోడ నే వృద్ధక్షత్త్రుని శిరము నూఱుశకలము లయ్యెను.

సవ్యసాచి సైంధవునిఁ దెగటార్చిన తోడనే కృష్ణుఁడు మాయాతిమిరమును హరింపఁ దోయజమిత్త్రుఁడు మరల ప్రకాశింపఁ దొడఁగెను. అదిగాంచి కౌరవానీకము ఖేదమునుఁ బాండవానీకము మోదమునునొందెను. పిమ్మటఁ గృష్ణార్జునులు సాత్యకి భీమసేన సహితులై ధర్మతనూజుని సన్నిధికిఁ రాఁ నతఁ డతిప్రేమమున విజయు నాలింగనముసేసికొని యానందాశ్రువులచే నాతని మస్తకముఁ దడుపఁ జొచ్చెను.

అట సుయోధనుఁడు ద్రోణాచార్యుని కడకుఁ బోయి "నీవు పక్షపాతము వహించి విజయుని మొగ్గరమునఁ జొరనిచ్చి సైంధవునిఁ జంపించితి" వని నిష్ఠురాలాపములాడ, నతఁడు "మహీపాలా! నేను శక్తివంచనలేక పోరాడుచున్నను నీవు శూలములఁ బోలు వాక్యములచే నన్ను నొప్పించుచుంటివి. ముల్లోక విజయుఁడగు

ధనంజయుఁ గెలువ నాకుశక్యమే? అయినను నీరాత్రి విశ్రాంతిని మఱచి సమరముసేసి నిన్ను మెప్పించెద; పాంచాలురఁ జంపక నేఁడు కవచమువిడువ" నని ప్రతినఁ జేసి కౌరవానీకమును మరల రణమునకుఁ బురిఁగొల్పెను.

అంతటఁ బాండవ యోధులును సమర సన్నద్ధులై శాత్రవ వాహినిఁ దాకి ఘోరముగఁ బోరజొచ్చిరి. ఆ సంగ్రామమున దుర్మద, దుష్కర్ణాది ధార్తరాష్ట్రులు పండ్రెండుగురు మారుతిచేఁ జచ్చిరి. ఘటోత్కచుని సుతుఁ డంజనపర్వుఁ డనువాఁడు గురుపుత్రునిచే వధింపఁబడియె. కురువృద్ధుఁడైన బాహ్లికుఁడు వడముడిచే నిహతుఁడయ్యె. బాహ్లికుని సుతుఁడును భూరిశ్రవుని తండ్రియు నగు సోమదత్తుఁడు సాత్యకిచేమడిసెను. బకుని సోదరుఁడగు నలాయుధాసురుఁడు ఘటోత్కచునితోఁ బోరి సమసెను. మఱియు ఘటోత్కచుఁడు కౌరవయోధుల కజేయుఁడై శాత్రవ వాహినిఁ జిందరవందర సేయుచుండఁ గర్ణుఁడు వాని నెదుర్కొని పోరఁదొడఁగెను.

మున్ను కర్ణుఁడు నిరంతరము విప్రభక్తి పరాయణుఁడై వారలకుఁ గోరినయర్థముల నొసఁగుచుండుట నెఱిఁగి పాకశాసనుఁడు కిరీటిహితార్థము కర్ణునికవచకుండలముల నపహరింపఁ దలఁచుచుండ సరోజమిత్రుఁ డాతనితలంపు నెఱిఁగి యొకనాఁడు కర్ణునికడ కరుదెంచి "కుమారా! అర్జున హితార్థమై పురందరుఁడు ధరణీసుర వేషముతో నరుదెంచి నీకవచకుండలముల నడుగును. నీ వాతనికి వానినీయవలదు. ఈకవచ కుండలములు

ధరించియున్నచో నీవు దేవాసురులకు సైత మజేయుఁడ వగుదువు. ఇవిలేనిచో శాత్రవులు నిన్ను జయింతు" రని హితోపదేశముఁ జేసెను. కర్ణుఁడా యుపదేశము నాలించి "దేవా! నేను ధరణీదేవులకుఁ గోరినయర్థముల నొసంగుదునని పలికి పెక్కు కాలమునుండి యట్లాచరించుచుంటిని. నేఁడు పురుహూతుఁడు విప్రవేసముతో వచ్చి నన్నడిగిన వానినీయనిచో నాకపయశము వాటిల్లు: కావున నతఁ డడిగినచో వానినిచ్చి తీరవలయు" నని బదులు చెప్పెను. "కుమారా! నీవట్టి నిశ్చయముతో నుంటివేని వాసవునికడనున్న ఘనశక్తినైనఁ గైకొని పిమ్మట నీకవచకుండలముల నీయు"మని చెప్పి యాదిత్యుఁ డంతర్హితుఁడయ్యెను. పిమ్మట నింద్రుఁడు భూసురవేసముతో నరుదెంచి కర్ణునిఁ గవచకుండలముల నడుగ నతఁడు "రహస్యము నెఱింగితి" నని పలికి పాకశాసను నడిగి యొక ఘనశక్తిఁ గైకొని తన కవచకుండలముల నద్దేవునకొసఁగి పంపించెను. నాఁటనుండియు కర్ణుఁ డాశక్తిని ధనంజయునిఁ బరిమార్పఁ దాచియుంచెను. ఆతఁడే మహాసంగ్రామమున ననుదినమును నిశాసమయమున నాశక్తిఁ దలఁచి "నేను రేపు దీనిఁ బ్రయోగించి సవ్యసాచిని బరిమార్ప వలయు" నని యోజించుచు సమరభూమికేఁగిన తోడనే కృష్ణుని మాయచే నాశక్తిని మఱచుచుండెను. ధార్తరాష్ట్రులుగూడ దానిని నిశాసమయమునఁ గర్ణునకుజ్ఞాపకము సేయుచు రణరంగమునఁ కరుదెంచిన తోడనే మఱచుచుండిరి.

ఇప్పుడా శక్తి దుర్యోధనునకు స్ఫురణకురాఁ నతఁడు కర్ణు నుద్దేశించి "మిత్రమా! కిరీటివిషయముఁ దరువాత నాలోచింప వచ్చును. మనవారెల్లరు నేఁడే ఘటోత్కచుని బాధఁ బడుచుండిరి. కావున నీవాశక్తి నిప్పుడితనిపైఁ బ్రయోగింపు" మని చెప్పెను. అంతటఁ గర్ణుఁ డాఘనశక్తిని ఘటోత్కచుని పయిఁ బ్రయోగింప నది యారాత్రినిఁ గడ తేర్చెను. అప్పుడు కృష్ణుఁడు "పార్థునిపీడ నేఁడు వదలె" నని తనవారికిఁ జెప్పి సంతోషించెను.

అనిశాసమయమున నుభయపక్షములవారును నిద్రాభరముచే మిగుల డస్సియుండఁ గిరీటి కరుణాయత్తచిత్తుఁడై యెలుఁగెత్తి "ఉభయపక్షములవారును మిగుల నలసి యుండిరిగావునఁ గొంత తడవు విశ్రమించిన పిమ్మట ననిసేయుట యుక్త" మని వచింప దానికెల్లరు నంగీకరించి, ధనంజయునిఁ గొనియాడుచు నెక్కడి వారక్కడఁ గొంచెముసేపు నిద్రించిరి. కొంతతడవునకుఁ గుముదినీకాంతుఁడు గగనమండలమునఁ బ్రకాశింప నెల్లవారును మేల్కని మరల సమరమునకుఁ గడఁగిరి. అనంతరము ద్రోణాచార్యుఁ డతి రౌద్రమూర్తియై పాంచాల, కేకయ, మాత్స్యబలములఁ జెండాడుచు, విరాటద్రుపదులఁ బరిమార్చెను. భారద్వాజుఁడట్లు మఱునాఁటి మధ్యాహ్నము వఱకును బాండవ వాహినిఁ జిందరవందర సేయుచుండ, సాత్యకి, ధనంజయ ధృష్టద్యుమ్న ప్రముఖులు సైతము విప్రవరేణ్యునిఁ గెలువ లేకపోయిరి.

అప్పుడు వాసుదేవుఁడు పాండవుల దైన్యముఁ గాంచి "సమ

రమున నిమ్మహానీయుని జయింప నేరికి నలవిగాదు. అందుల కే నొక్క యుపాయము చెప్పెద నాలింపుఁడు. ఇప్పుడు మన వాయు తనూజునిచే నశ్వత్థామ యనఁబఱఁగు నొక్క మాతంగము మడిసె; కావున నానెపమున నిప్పుడొక్కరుఁ డాచార్యుని పాలికిఁబోయి యశ్వత్థామ నచ్చెనని చెప్పినచో నతఁడు సంగ్రామము సాలించు"నని వచింప, యుధిష్ఠిరార్జును లట్లు సేయనొల్లకఁ జింతించుచుండిరి. అంతటఁ బవన నందనుఁడు ద్రోణుని పాలికిఁబోయి "అశ్వత్థామ నచ్చె"నని వచింపఁ నతఁడు తన తనయున స్త్రవీర్యాది గుణములు గణుతించి యాతని వచనములు పెడచెవులఁబెట్టి రణము సేయుచుండెను.

అప్పుడు విశ్వామిత్ర భరద్వాజ గౌతమాది మునివరేణ్యులు కొందఱు ద్రోణాచార్యునకుఁ బొడసూపి "భారద్వాజా! భూసురోత్తముఁడవు, వేదవేదాంగ విదుఁడవునగు నీవు సంగ్రామము సేయుట ధర్మమగునే? ఇంతకు బూర్వము చేసినఁ జేసితివి; ఇక నీకుఁ గాలము పూర్ణమయ్యెఁ గావున నాయుధము విడిచి శాంతి వహింపు"మని చెప్పి యంతర్ధానులైరి

అంతనాచార్యుఁడు తనసుతుఁడు మృతుఁడైనదియు లేనిదియు సత్యవ్రతుఁడగు యుధిష్ఠిరుని వలనఁ దెలిసికొనఁగోరి యాతని నడిగెను. అంతకుమున్నె వాసుదేవ భీమసేనాదులెల్లరును "ద్రోణుఁడీదివసమంతయు నిట్లు సమరము సేయునేని మన వారెల్లఱు మడియుట నిక్కము; నీవారి నందఱి నీతని బారిఁ బడద్రోయక నిప్పుడొక్క యనృతమాడి రక్షింపుము. దాన

నీకస్మృతి దోషము సేకూర"దని యుపదేశించినందున ధర్మనం దనుఁడు "అశ్వత్థామ సచ్చె"నని పెద్దయెలుఁగున బలికి యనంతరము "కుంజర" మనుచు గుసగుసకు వినఁబాకుండు నటుల మెల్లఁగ వచించెను. అంత నమ్మహీసురోత్తముఁడు చింతావేశిత మానసుఁడై తనకు ఋషులుపదేశించిన వాక్యములఁ దలఁచి, తాను సమరము సేయుచున్న పాండవులకు విజయము సేకూర దని యమ్మహానీయులట్లుపదేశించిరని భావించి తానికనస్త్ర సన్న్యాసము సేయుట సమంజసమని నిశ్చయించుచుండ ధృష్టద్యుమ్నుఁడాతనితో నని సేయనరుదెంచి వాడి నారాచములఁ బ్రయోగింపఁదొడఁగెను. ద్రోణుఁడని సేయనొల్లకయు, నాతనిఁ గాంచి సహింపఁజాలక దివ్యాస్త్రములఁ బ్రయోగింపనెంచ నవి ప్రతిఘటింపక యుండ: అంతనతఁడు ప్రకృతిబాణములఁ బ్రయోగించి ధృష్టద్యుమ్నుని సారథిని తురంగములనుగూల్చి యాతని తనువుఁ బాలసేయ భీమసేనుఁడువచ్చి యాద్రుపదనందనుని గురుని బారికిఁ తప్పించుకొనిపోయెను. అనంతరగ మాభూసురోత్తముఁడు శాంతచిత్తుఁడై యస్త్రసన్న్యాసముసేసి తన యరదముపయిఁ గూర్చుండి యోగనిష్ఠ నత్తనువుఁ ద్యజించి ప్రకట జ్యోతీరూపమున నెగసి పరమస్థానమునకుఁ జనియె. ఆ దివ్య తేజము కృష్ణార్జున యుధిష్ఠిరనృపులకు మాత్రము గోచరమయ్యె!

అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు కృపాణపాణియై వెడలి, యుధిష్ఠిరార్జునులు "వలదువల"దని కేక లిడుచున్నను వినక, మృతుఁడైన యమ్మహానీయుని కేశములఁబట్టుకొని గళముఁద్రుంచి యా

పవిత్ర దేహమును ధరణిఁ దలఁగఁ దమ సేసెను. అట్టి దుష్కార్యముఁ
జేసినందులకు సాత్యకీధనంజయు లాతని పయిఁ గోపించిరి.

ఆచార్యుఁడు మృతుఁడైనతోడనే కౌరవవాహిని చెల్లా
చెదరై పరుగులిడ నారంభింప, వేఱొక దిశనఁ బోరాడుచున్న
యశ్వత్థామ యది గాంచి వచ్చి నిజజనకుని మరణవృత్తాంతము
నాలకించి శోకాకులితమానసుఁడై, ధృష్టద్యుమ్నుఁ డమ్మహా
నీయు నవమానించెనని విని క్రోధారుణితనయనుఁడై సుయో
ధను నవలోకించి "కౌరవేశ్వరా! రణరంగమున నాచార్యు నిట్లవ
మానించిన యాధృష్టద్యుమ్ను సహితముగఁ బాండవవాహిని
నంతయుఁ జరిమార్చి నీకు జయముఁగూర్చెద; నాదివ్యాస్త్ర
మహిమముఁ జూడు" మని పలికి సైనికుల నందఱిని మరల రణము
నకుఁ బురికొల్పి, పాండవానీకము పైకి నారాయణాస్త్రముఁ
బ్రయోగించెను.

అమ్మహాస్త్ర మనలజ్వాలలచేఁ బ్రకాశించుచు వచ్చుచుండ
వసుదేవనందనుఁ డవలోకించి "సైనికులారా! మీరెల్లరును
సామజహయరథములు దిగ్గి యాయుధములు విడిచి నిలువుఁడు.
భూమి గతులగు నిరాయుధుల నిమ్మహాస్త్ర మేమియుఁ జేయ"దని
పెద్ద యెలుఁగునఁ బలుక నచటి వారెల్లరు దమతమ యాయు
ధములు విడిచి పుడమిపై నిలువఁబడిరి. అప్పుడు సమీరనంద
నుఁడు రోషపరవశుఁడై తనవారినిఁ గాంచి

చ. "దిగకుఁడు వాహనములు గడిందిమగంటిమిఁ గోలుపోవ మీ
రు గడఁక దక్కఁ బెట్టకుఁడు రూపఱ నాయుధముల్ మహాస్త్రక

త్రిఁ గెలుతుగోత్రభిత్కులిశ తీవ్రశరముల బెట్టనుభూ
రిగదవిహారభంగియుఁ బ్రశరములు కీచ్ఛలింపఁగన్."

అనుచు సింహనాదముసేసి యశ్వత్థామ నెదుర్కొనియె. తక్కిన వారందఱును నిరాయుధులై భూమిపై నిలువఁబడుటచే నారాయణాస్త్రము వారల నేమియుఁ జేయక, కార్చిచ్చులోఁగూడ్పు చందమునఁ బవనతనూజునిఁ జుట్టుముట్టెను. కృష్ణార్జును లదిగాంచి బలవంతముగ నాతనిఁబట్టుకొని ఘడమునుపై కీడ్చికోంచి నిరాయుధునిఁ జేయ నారాయణాస్త్రము ప్రశాంతిఁబొంది యేమికి నపాయము సేయక యదృశ్యమయ్యెను.

తన పరమసాధనము కృష్ణుని యుపాయముచే నట్లు వ్యర్థమగుటఁగాంచి యశ్వత్థామ విషాదాక్రాంత చిత్తుఁడై యరుణగభస్తి యస్తగిరిసమీపమున కరుగువఱకు సమరము సేసి పిమ్మట బలములఁ దెలియ నియమించి దీనాననుఁడై తన శిబిరమున కేగెను. పాండవులును సమరము చాలించి తమతమనివాసములకేఁగి విశ్రమించిరి.

## —* కర్ణపర్వము *—

పదునాఱవనాఁడు సుయోధనుఁడు తన ప్రియమిత్రుఁడగు కర్ణుని సర్వసేనాధిపతిఁజేయ నతఁడు సైన్యమును చతురముగనడిపించుకొనుచు సమరభూమికరుదెంచెను. పిమ్మట నుభయపక్షముల వారునుదమతమ శౌర్యముఁ బ్రకాశింప నని సేయుచుండిరి. ఆనాఁటి యాహవమున, కులూత దేశపాలకుఁడైన క్షేమధూర్తియను రాజు భీమునిచే హతుఁడయ్యెను. యుధిష్ఠిర నందనుఁడగు ప్రతి

వింధ్యునిచేఁ, జిత్రుఁడను నృపాలుఁడు సమసెను. కర్ణుఁడు సహదేవునితోఁబోరి యతనిఁబట్టుకొనియు జంపనొల్లక యవమానించి విడిచెను. ఇరువాగుల వారును నిట్లు దిననాధుఁడ స్తమించువఱకుఁ బోరాడి పిమ్మటఁ దమతమ సేనలను మరలించుకొని నిజ నివాసముల కేఁగిరి.

మఱునాఁటి ప్రాతఃకాలమున నందఱును సమరభూమి కేఁగు సమయమునఁ గర్ణుఁడు కురురాజు నుద్దేశించి "మహీనాథా! కృష్ణుఁడు సారథ్యము చేయుచుండుటచే సవ్యసాచి నాకఁ జేయుఁ డయ్యెను. అశ్వహృదయజ్ఞానమునఁ గృష్ణునితో సముఁడగు శల్యుఁడు నాకు సారథ్యముచేయునేని నేఁటిదినమున గాండీవిని జయింతు"నని చెప్పెను. అంతట సుయోధనుఁడు మద్రమహీపాలునిఁ బెక్కువినయముల బ్రతిమాలి కర్ణునకు సారథ్యము సేయ నొడంబఱచెను.

పిమ్మట శల్యుఁడు రాధేయుని తేరు నడుపుచుండ నతఁడు "నేఁటిదినమున ధనంజయునిఁ బరిమార్చి కురుపతికిఁ బ్రియము సేయుదు"నని పలికెను. శల్యుఁడప్పలుకు లాకర్ణించి "అంగరాజా! సురాసురులకు జేయుఁడగు విజయుని నీ వెంతమాత్రము గెలువఁ జాలవు. ఈవ్యర్థ ప్రలాపము లుడిగి నీవాతని నెదుర్కొనక వేఱొకనితో నని సేయుము. నాయుపదేశము నాలించి దుస్సాధ్యపు పనికిఁ బోరకు"మని వచింప, రాధేయుఁడు "మద్రభూపాలా! నీవు ధనంజయునివిక్రమము పొగడుచు నన్నుఁ దూలనాడెదవు. పార్థుఁడెఱిఁగిన దివ్యాస్త్రము లన్నియు నేను నెఱుఁగుదు; తొల్లి

నేనస్త్రశిక్షార్థినై పరశురామునికడ కేఁగ నమ్మహాత్ముఁడు నన్నుఁ గులముఁ దెలుపుమని యడిగెను. అప్పుడు నేను సూతుఁడనని చెప్పినచో నమ్మహాశయుఁడు దివ్యాస్త్రముల నుపదేశింపఁడని తలఁచి విప్రుఁడనని చెప్పితి. అంతట నమ్మునీంద్రుఁడు నాయెడఁ గరుణాళుఁడై భార్గవాస్త్రాదివరమాస్త్రముల నొసఁగెను. అనంతరమొకనాఁడు తత్తపోధనుఁడు నాయంకతలమున నొరఁగి నిద్రించుచుండ, సుత్రామసుతుఁడు ధనంజయుని హితముఁగోరి యొక వికృత కీటకరూపధారియై వచ్చి నాతొడఁ దొలచ నారంభించెను. గురువునకు నిద్రాభంగమగునని నా బాధకు సహించియుండ నెత్తురు వెల్లువయై ప్రవహింపఁ దొడఁగెను. కొంత తడవునకమ్మహాత్ముఁడు మేల్కాంచి నెత్తుటి వెల్లువఁ గని, తత్పరితాపమున నన్నుఁ గని "తెలిసికొంటి నా దేహమున కిన్ని గాయములగ "నీవు భూసురుఁడవు గావు. మఱి యే కులజుఁడవో నిక్కముఁ దెలుపు" మని యడుగ నేను సూతుఁడనని చెప్పితిని. అమ్మునియగ్నిసమానుఁడదివిని కోపించి "కపటమున భార్గవాస్త్రము గ్రహించితివి గావున నయ్యస్త్రము నీకవసరసమయమున నుపయోగపడకుండుఁగాక!" యని నన్ను శపించెను. అనంతరమొకనాఁడు నేను శ్రమమునకై వివిధాంశకములు ప్రయోగించుచుండ నచటికొక ధేనువత్సము పరుగెత్తుచువచ్చి, నాయజ్ఞానవశమున నంపతాఁకున విగతజీవి యయ్యెను. దాని బోషించు ధరణీదేవుఁడది గాంచి యధిక కోపముతో "ఓయీ! నిష్కారణముగ మదీయ హోమధేనువత్సమును జంపితివి. కావున నీ వేశూరుని గెలువఁగోరి శ్రమము సేయు

సేనుని వధించెను. పిమ్మటఁ గర్ణుఁడు మూర్ఛఁ దేరి విజృంభించి పాండవవాహినిఁ జెండాడ నారంభించెను.

అటఁ గిరీటి తన్నుఁ జుట్టుముట్టిన సంశప్తకుల నందఱిని దెగటార్చి కౌరవానీకముఁ దాఁక నరుదెంచి దండధారుఁడను మాగధునిఁ గూల్చి యశ్వత్థామ నోడించి, ధర్మతనయుని క్షేమము నరయఁ గోరి సమరప్రదేశమున నెదకి యమ్మహీపాలునిఁ గానక భీమునిఁ గాంచి "భూనాథుఁ డేఁడి" యని యడిగెను. అనుజా! మన యగ్రజుఁడు కర్ణునిచేఁ గడునొచ్చి శిబిరమున కరిగెను. కావున నీవు శిబిరమున కేఁగి యాతని కుశలము నరసిర"మ్మని పవనతనయుఁడు పలికెను.

అంతట మాధవ ధనంజయులు ధర్మతనయుని శిబిరమున కరిగి రాధేయుని శరజాలములకుఁ గడునొచ్చి శయ్యాతలమునఁ బరుండియున్న మహారాజచంద్రుఁ గాంచి యాతఁడు కుశలియైయుండుటకు సంతోషించిరి. కర్ణునిఁ జంపియే గాండీవి మరలి వచ్చె నని పాండవాగ్రజుఁడు కినియ, నంతట ధనంజయుఁ డాతనిఁ బ్రసన్న చిత్తుం జేసి "నేఁడు తప్పక రాధేయునిఁ దెగటార్చి వచ్చెద" నని చెప్పి మరల రణాంగణమున కరుదెంచెను. ఇరుసేనలవారలు ధర్మతనయుని కుశలవార్త ధనంజయునివలన వినుటచేతఁ బ్రోత్సాహచిత్తులై యని సేయఁదొడఁగిరి.

ఆనాఁడు కర్ణుఁడు "భీష్మద్రోణులకంటె నీతఁడు శౌర్యమునఁ బోరుచుండె" నని యెల్లరు దన్ను మెచ్చునటుల విజృంభించి పోరాడుచు పాండవవాహినిఁ గలంచుచుండఁ గిరీటి కర్ణుని సుతుఁ డగు వృషసేనునిఁ దాఁకి యాతనిని సమయించెను. అప్పుడు వృకో

దరుఁడు దుశ్శాసనునితోఁ బోరి వాని వక్షముఁ జీల్చి రక్త
పానముఁ జేసి తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనియె. తమ సోదరుని
దుర్మరణమును గాంచి ధార్తరాష్ట్రులు పదుగురు భీమసేనుఁ
జుట్టుముట్ట నవ్వీరుఁ డాకుమారదశకమును గూల్చి వీరవిహారము
సలుపుచుండెను.

తన తనయుని కిరీటి సమయించుటఁ గాంచి కర్ణుఁడు
శోకాకులుఁడై వచ్చి యాతని నెదుర్కొని పోరఁదొడఁగెను.
అంతటఁ బార్థకర్ణులన్యోన్యజయాకాంక్షులై పెనఁగుచు నొండొరులపై
ననేక దివ్యాస్త్రములఁ బ్రయోగించుకొనుచుండిరి. కొంత తడవు
నకు రాధేయుఁడు నాగబాణమును ధనంజయుని శిరమునకు
గురిపెట్టుచుండ శల్యుఁడు గాంచి సవ్యసాచిని రక్షింపనెంచి
"రాధేయా! ఈసంధానము మెడదునుముట కనుగుణముగాదు.
ఇంకఁగొంచెము పైకి గురిపెట్టు"మనివచింపఁ గర్ణుఁడు కోపించి
"నాకు నీవు లక్ష్యముఁ దెలుపనవసరములే" దని శల్యునిఁ గసరి
యాశరముఁ బ్రయోగించెను. వాసుదేవుఁ డానాగశరము నవ
లోకించి సవ్యసాచియరదమును పంచాంగుళ మాత్రము ధరణిం
గ్రుంగ నదిమెను. ఆకారణమువలన నాగాస్త్రముచే విజయున
కేయపాయము వాటిల్లక, నాతని శిరమున నున్న యింద్రదత్త
మైన దివ్యకిరీటము మాత్రము ధరణిఁ గూలెను.

అంత నాక్రూర భుజంగము తనచేఁ బుడమిఁ గూలినది
కిరీటమేగాని, కిరీటిశిరము గాదని యెఱిఁగి మరల ధనంజయుని
పైకి వచ్చుచుండ నతఁడు వాడినారాచములు ప్రయోగించి

దానిని సంహరించి "వాసుదేవా! ఈనాగమిట్లు వచ్చుటకు గతమేమి?" యని యడిగెను. "ఫల్గునా! మున్ను ఖాండవ వనము దగ్ధమగు నప్పు డయ్యశ్వసేనాభిధానభుజంగము తన తల్లి నయ్యనలము నుండి తప్పించుకొనిపోవుచుండ నీవు బాణముఁ బ్రయోగించి యానాగాంగనను జంపితివి. అప్పటినుండియు నీసర్పము నీపైఁ బగఁబూని కర్ణునియొద్దనుండి నేఁడాతనిచేఁ బ్రయోగింపఁబడి నిన్నుఁ జంప నరుదెంచె" నని యాసర్ప వృత్తాంతమును కృష్ణుఁడు విజయునకుఁ విశదపఱచెను.

పిమ్మట ధనంజయుఁడు తన శిరస్సునకు మెఱుఁగైన పాగఁ జుట్టుకొని కర్ణునిపైఁ దీక్ష్ణాస్త్రములుఁ బ్రయోగించి యతనిని క్షతగాత్రునిఁ జేయఁ గర్ణుఁడును తన నాగశరము వ్యర్థమగుటకుఁ జింతించుచు విజయునిపై వాఁడి నారాచములఁ బ్రయోగించు చుండెను. పరశురాముని శాపమున నప్పుడాతనికి భార్గవాస్త్రము ప్రతిభాసింపకుండెను. మఱియు బ్రాహ్మణశాపమున నప్పు డాతని రథచక్రము పుడమిం గ్రుంగెను.

అంతఁ గర్ణుఁడు "ధనంజయా! నా రథచక్రము ధరణిం గ్రుంగెను. నేను దీని నెత్తునంతకు నాపై నస్త్రములఁ బ్రయోగింపకుము. రథస్థుఁడు భూమిస్థునితో ననిసేయుట ధర్మవిరుద్ధ" మనుచు నరదము డిగ్గి తన బలమంతయు వినియోగించి యాచక్రము నెత్తుచుండెను. అప్పుడు కృష్ణుఁడు కర్ణునుద్దేశించి

సీ. "గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి
కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ డగు
ధర్మసుతు సిరి యపహరించి

యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి
సభాస్థలి నమ్మాయి భంగపఱచి
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోష
యాత్రావిధి నెపమున దాడివెట్టి
బాలునభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాదిక ర్తవీవ
యిన్ని యెడలను నీపాడి యెందుఁ బోయె!"

అని పలుకుచుండఁ గవ్వడి రోషపరవశుఁడై రాధేయునిపై వాడి నారాచములఁ బ్రయోగింపసాగెను. కర్ణుఁడు భూమిస్థుఁడయ్యును పార్థునిపై బాణములఁ నేయుచు తన శక్తినంతయువిని యోగించి యాచక్రము నెత్త నది ధరణీసహితముగ నాలుంగుళములు పై కెగసెను. అంతట రాధేయుఁ డరదము నధిరోహించి బాణముసంధింప నాచక్రము మరలఁగ్రుంగెను. కర్ణుఁడందులకుఁ గటకటఁ బడుచు మరల రథావతీర్ణుఁడై చక్రమునెత్తుచుండ విజయుఁడు కృష్ణప్రేరితుఁడై యొక ఘోరశరముఁబ్రయోగించి యా వీరవరేణ్యుని శిరమును నేలఁగూల్చెను. అప్పుడు సకల జనములు వీక్షించుచుండఁ గర్ణునిచే తనువునుండి యొక దివ్యతేజము వెలువడి వారిజాప్తబింబమునఁజొచ్చెను.

కర్ణుని మరణవార్తనాలించి దుర్యోధనుఁడు మిక్కుటముగ దుఃఖించుచు నప్పటికి సూర్యాస్తమయసమయమగుటఁ గని బలములఁ దెలియ నియమించి నిజశిబిరమునకుఁ జనియెను. కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తములఁ బూరించుచు నతి సంతోషముతోఁ దమసేనలను మరలించుకొని శిబిరమున కరిగి ధర్మతనూజునిఁ బ్రమోదభరితమానసునిఁ జేసిరి.

## —♦ శల్య పర్వము ♦—

ఆనాఁటి రాత్రి సుయోధనుఁడు కర్ణునిఁ దలఁచి యధిక పరితాపము నొందుచుండఁ గృపాచార్యుఁ డమ్మనుజేంద్రునిఁ డగ్గఱి "కౌరవేశ్వరా! భీష్మద్రోణకర్ణాదియోధవరేణ్యులెల్లరు సమసిరి. ఇఁక మనకుఁ బరాజయము సిద్ధము; కావున నిప్పుడైనను నీవు ధర్మతనూజునితో వైరము విడిచి సఖ్యము సేయుట సమంజసము. ఆ ధర్మశీలుఁడు నిన్ను విడనాడక రాజ్యమునఁ బాలొసఁగి రక్షింపఁగలవాఁ" డని యుపదేశించెను. దుర్యోధనుఁ డయ్యుపదేశము నాలించి వేఁడి నిట్టూర్పు నిగిడించి "ఆచార్యా! నీవు నాయందలి ప్రేమచే నిట్లుపలుకుచుంటివి గాని, యీపలుకులు నాకు మాత్రము రుచింపవు. మొదటి నుండియు నే ననేక విధములఁ బాండవులను జిక్కులుపెట్టి యిప్పుడు తుచ్ఛప్రాణమున కాసపడి వారిమరుఁగుఁజొచ్చు టెంతయు నీచకరము. కావున నేనట్లు సేయనొల్లను. ప్రాణమున్నంతవఱకుఁ బాండవులతోఁ బోరి వారినిజయించి రాజ్యమునైనను, లేనిచోఁ కర్ణాదులవలె వీరస్వర్గమునైనను బొంద నిశ్చయించితి" నని వచించి, కృప కృతవర్మాశ్వత్థామ శకుని శల్యులతో నాలోచించి యారాత్రి శిబిరమున నిద్రించుట యుచితము గాదని తలఁచి యచటికి రెండామడల దూరమున నున్న సరస్వతీనదీతీరమునకుఁ జని యచ్చటఁ దనవారితో మజ్జనభోజనాదులనాచరించి శల్యునిఁ జమూపతినిఁ జేసి పిమ్మట విశ్రమించెను.

పదునెనిమిదవనాఁడు మరల నిరుపక్షములవారును భేరీ ప్రముఖతూర్య నిస్వనములు చెలఁగ రణరంగమున కరుదెంచి యొండొరులం దాఁకి పోర నారంభించిరి. అప్పటికి దుర్యోధను నకుఁ బదునొకండువేలు రథములును, పదివేల నేఁడునూఱు గజములును, రెండులక్షలు హయములును, మూఁడుకోట్లు పదాతులును మిగిలియుండిరి. పాండవుల కాఱువేలు రథములును, మూఁడువేలు వారణములును, లక్ష తురంగములును, కోటి కాల్బలములును మాత్రముండెను. ఆనాఁడుభయబలములు నధికోత్సాహముతోఁ బోరుచుండఁ గర్ణనందనులు చిత్రసేన, సత్యసేన, సుశర్ములను వారు నకులునిచేఁ జచ్చిరి. సురథుఁ డను పాంచాలకుమారుఁ డశ్వత్థామచేఁ జచ్చెను. భీమసేనుఁడు శల్యుఁ డును గొంతతడవు గదాయుద్ధము చేసి యొకరి గదాఘాతమున కొకరు మూర్ఛితులైరి. అప్పుడు కృపాచార్యుఁడు వచ్చి శల్యునిఁ దనస్యందనముపైఁ బరుండఁబెట్టుకొని తొలంగం గొనిపోయెను. అంతట భీమసేనుఁడును దెప్పిఱిలేచి మరలఁ గౌరవబలములఁ జక్కాడఁ దొడఁగెను.

అశ్వత్థామయు, సంశప్తకులును ధనంజయునిఁ జుట్టుముట్టి పోరాడుచుండ, శల్యుఁడు సేదదీర్చికొని వచ్చి విజృంభించి పాండవబలములను జెండాడుచు, ధర్మతనయు నెదుర్కొని యాతనిపై నిశితసాయకములఁ బ్రయోగించి మూర్ఛితునిఁ జేసెను. అంతట సాత్యకి ధృష్టద్యుమ్న భీమసేన ప్రముఖులువచ్చి యాతనితోఁ బని సేయసాగిరి. కృపకృతవర్మాదియోధులు

శల్యునకు బాసటయై పోరఁదొడఁగిరి. అంతలో ధర్మతనూజుఁడు పేదఁదేరి మద్రనాథునితో మరల నతిరౌద్రముగఁ బోరఁ దొడఁగెను. అట్లు పోరుచు యుధిష్ఠిరుఁడు మున్నొకపరి దాను ఫాలలోచనువలనఁ బడసిన మహనీయశక్తి నాతనిపైఁ బ్రయోగింప నది మద్రనాథునివక్షమును భేదించెను. అంత నతఁడు రుధిర ధారలొలుకఁ బుడమిపైఁ గూలి విగతజీవుఁ డయ్యెను.

శల్యుని బాంధవులెల్ల నదిగాంచి యుధిష్ఠిరునిపైఁ గవియ, సాత్యకి భీమసేనాదులు వారినిఁ జెండాడఁ దొడఁగిరి. ధనంజయుఁడు సంశప్తకుల సంహతిని సుశర్మయుతముగఁ జంపివచ్చి తనవారికి బాసటయై నిలిచి యనిసేయసాగెను. ఆనాటి సంగ్రామమున ధృష్టద్యుమ్న సాత్యకులచే సాల్వుఁడు సమసెను. దుర్విషహ, దుష్టదర్శనాది గాంధారేయులందఱును వృకోదరునిచే మడిసిరి. గాంధారపతియైన శకుని సహదేవునిచే నిహతుఁడయ్యెను.

అట్లు తనవారెల్లరు రణావనిం ద్రెళ్ళుటఁ గాంచి శోకాక్రాంతచిత్తుఁడై సుయోధనుఁడు హతశేషులగు నిజసైనికులను బురిగొల్ప వారలు రక్షకరహితులయ్యును దెంపుపెంపున శక్తికొలఁది సవ్యసాచిని బొడవి యాతని బాణశిఖా సందోహమునఁ బ్రమసిపోయిరి. అంతఁ గౌరవనాథుఁడు తానొక్కఁడు రణరంగమున నిలువనోపక గదాయుధము భుజమునపై నిడుకొని పలాయనపరుఁ డయ్యెను. కృతవర్మకృపాశ్వత్థామలును సమరభూమినుండి దొలఁగిపోయిరి. పాండవబలమునం దప్పటికి రెండు

వేలస్యందనములును, నేఁడునూఱులు మాతంగములును, నైదు వేలు గుఱ్ఱములును, పదివేల పదాతులును మాత్రము బ్రదికి యుండిరి.

దుర్యోధనుఁడు జలస్తంభన విద్య నేర్చినవాఁ డగుటచే ద్వైపాయనహ్రదమున డాఁగియుండెను. పాండునందను లాతనిఁ జాలసేపు వెదకి యెచ్చోటను గానక విసుగునొంది, కురునాథుని జాడనరయుఁ గొందఱు చారులను నియమించి తాము నిజ శిబిరముల కేఁగిరి.

పిమ్మట నాహ్రదము కడకుఁ గృతవర్మ కృపాశ్వత్థామ లరుదెంచి "కౌరవేంద్రా! దీనివలె నీ విమ్మడుఁగున డాఁగ నేల? మమ్ము ముువ్వురను బురస్కరించుకొని సమరభూమి కరుదెంచి పాండవులను జంపి రాజ్యలక్ష్మిని గైకొనుము. కాని-చో వీరస్వర్గముఁజూఱఁగొను"మని వచింప సుయోధనుఁడు "వీరవరేణ్యులారా!

చ. తనువుఘనాస్త్రశస్త్రముల తాఁకున నొప్పిని దప్పిఁబుట్టె నా
మనము వశంబుగా కెడలె మాటల చందము నూవమీరు డ
స్సినయటులున్న వారలను జీవులు లేరు తొలంగి నేఁటి మా
త్రనిలువుఁ డెల్లిపైకొని యురాతుల గెల్తము లావు వచ్చినన్."

అని చెప్పెను.

అప్పు డాసమీపమునఁ జరించుచున్న బోయలు కొంద ఱావచనముల నాలించి, సుయోధనుఁ డమ్మడుఁగున డాఁగి యుండెనని నిశ్చయించి, పాండవులు సుయోధనుని వెదకఁ

దమకాజ్ఞాపించియుండిరి కావున సత్వరముగఁ బాండవశిబిరమున కేఁగి యవ్వార్తవారల కెఱిఁగించిరి.

అంతటఁ బాండవులు తమవారలం గూడి ద్వైపాయనహ్రద సమీపమునకు వచ్చుచుండఁ గృతవర్మ కృపాశ్వత్థాము లాకలకలము నాలించి "సుయోధనా! పాండవులు వచ్చుచుండిరి. నీవనుజ్ఞ నొసఁగిన యో మేమిప్పుడు వీరిని మార్కొనెదము. లేనిచో నెందైన డాఁగియుండెద" మని పలికిరి. "మీ రిప్పుడు పాండవుల నెదుర్కొనక నెందైన డాఁగియుండి రాత్రియైన పిమ్మట నిచటికి రండు. అప్పుడు కర్తవ్యము నాలోచింతము. ఇమ్మడుఁగున డాఁగియుండ నన్నుఁ బాండవు లెఱుఁగఁజాలరు. ఒకవేళ నెఱిఁగినను బట్టుకొనఁజాలరు. నే నీదు నిర్భయుడనై యుండెద. మీరు సత్వర మిచ్చోటువిడిచి యరుగుఁ"డని సుయోధనుఁడు పలుకఁ నారథికత్రయము పొగులు మనములతో వేఱొక తావునకుఁ జనిరి.

అనంతర మచ్చటికి బంధుజాలముతో యుధిష్ఠిర నృపాలుఁ డరుదెంచి కురునాథు నుద్దేశించి—

చ. "ఇటు తగునే సుయోధన, మహీవలయంబున నట్టి దైన్య మె
చ్చట వినఁజూడఁ గల్గెనె యసంఖ్యులు రాజులు నీకు గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్రులు విశుద్ధచరిత్రులు పోరనట్లు త్రుం
గుటయును జూచి తేమిటికి గ్రుంకితి నీళ్ళను జావు దప్పునే?

చ. "అని మము నోర్చినం బృథివియంతయు నేలఁగవచ్చు లేక చ
చ్చినసురసద్మ సౌఖ్యములు చేకుఱు రెండు దెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగ నగుబాటును బ్రాణము చేటుఁ దెచ్చుకోల్
వినుమము నీ కెదుర్పఁదగు వేయువిధంబులఁ జాటి చెప్పెదన్.,,

అని గంభీరముగఁ బల్కెను. "ధర్మనందనా! బంధుమిత్ర పరివార జనమెల్ల రణభూమిం దెగుటవలనను, శరఘాతములచే నామేను మిగుల నొచ్చియుండుట వలనను నిచటికివచ్చి కొంచెము సేదఁ దీర్చుకొనఁ దలఁచితి. కొంతతడ విట విశ్రమించినపిమ్మట సమరమున కరుదెంచెదను. అంతదనుక మీరును విశ్రమించి నం" డని సుయోధనుఁ డాతనికిఁ బ్రత్యుత్తర మొసఁగెను. "నీవిట కరుదెంచి చాలతడవయ్యె. ఇంతవఱకు విశ్రమించినదిచాలును. ఇఁక సత్వరము బయటకిర"మ్మని ధర్మతనయుఁడు వచింప సుయోధనుఁడు "కౌంతేయాగ్రజా! సోదరసుతాది బంధువర్గ మెల్ల సమసినపిమ్మట నాకింకను సుఖ మేల? రాజ్యమేల? రాజ్యమును నీకొసఁగి విపినమున కేఁగి జటావల్కలధారినై తపముచేయ నిశ్చయించితిని. బంధుమిత్రవిరహితమగునిప్పుడమిని నీవే గట్టికొను" మని పలుచెప్పెను. "సుయోధనా! నీవు నాకిప్పుడు రాజ్యమును దానము చేయనక్కరలేదు. కదనమున నిన్ను జయించినగాని ధరణినేల నొల్లను. మున్ను నీవు ధర్మశీలుండవై నాకు రాజ్యమీయ నంగీకరించినచో నిట్టి కులక్షయ మేల సంప్రాప్తమగును? ఇఁక నీకపటోపాయములఁ గట్టిపెట్టి సమరమున కరుదె"మ్మని యజాతశత్రుఁడు పలుక నచటి వారెల్లరు నవ్వచనములనే వచించిరి. అంతట సుయోధనుఁడు "పాండవాగ్రజా! మీరేవురును పరివార బాంధవ మిత్రశస్త్రాస్త్ర సహితులై యుండిరి. నేనొంటినై యుంటిని. కావున మీరంద ఱొక్కపెట్టున నన్నుఁ జుట్టుముట్టి పోరక యొక్కరొక్కరుగ

వచ్చి పోరఁడ లేని నేను సమరము సేయ నరుదెంతు" నని వచింప యుధిష్ఠిరుఁడు "ధృతరాష్ట్రనందనా! మీరు పెక్కండ్రుగూడి యభిమన్యుకుమారునిఁ జంపినటుల మేము నిన్ను వధించువారముగాము. మాలో నొక్కనితో నీయిచ్చ వచ్చిన యాయుధముఁగొని పెనఁగుము. నీవాతని జయింతువేని సకలమహీచక్రము నీకు విడిచిపెట్టెద"నని ప్రత్యుత్తరమొసఁగెను. అంతటసుయోధనుఁడు గదాహస్తుఁడై హ్రదము వెడలివచ్చి భీమసేనునితో గదాయుద్ధము సేయఁ దలపడియెను.

మున్ను తీర్థయాత్రకేఁగిన బలరాముఁడు, భీమ దుర్యోధనులు తనయొద్దగదాయుద్ధము నభ్యసించిన వారగుటచే వారల రణము నవలోకింప నేఁచి యరుదేర నచ్చటివారెల్ల రాతనికిఁ బ్రణతులై కుశల ప్రశ్నముచేసిరి. ఆ రేవతీరమణునిగాంచి సుయోధనుఁడు నూతన బలోత్సాహము నొందెను. రోహిణీసుతుఁడు తన ప్రియశిష్యుఁడగు సుయోధనునియొక్కయుఁ గడమవారియొక్కయు క్షేమము నరసి యనంతరము వారలఁగూడి సమరభూమి కరుదెంచెను. అంతట భీమదుర్యోధనులు బలరాముని యనుజ్ఞవడసి యని సేయ నారంభించిరి.

అట్లు భీమ దుర్యోధను లెదుర్కొని తమ నేర్పును దర్పమును జూపుటకు వెఱపుఁగొలుపునట్లు పెక్కుభంగులఁ బోరాడుచుండఁ గృష్ణుఁడు సవ్యసాచినిఁ గని "ధనంజయా! దుర్యోధనుఁడు గదాయుద్ధమున నతికౌశలము గలవాఁడు. మనవృకోదరుఁడు బలశాలి యగునుగాని గదాయుద్ధమున నంత నిపుణుఁడు గాడు.

యుధిష్ఠిరనృపాలుఁ డనాలోచితుఁడై భీమదుర్యోధనులను గదాయుద్ధమునకు నియమించి, సుయోధనుఁడు గెలిచినచో సకలరాజ్య మిత్తునని పలికెను. పవననందనుఁ డీకఁ గొంత తడ విట్లు ధర్మయుద్ధము సేసినచో సుయోధనునిచేఁ జచ్చుట నిశ్చయము. వాయుసూతుఁడు మున్ను తాను దుర్యోధనుని యూరువులను గదాయుధముతో భగ్నముసేయుదునని చేసినప్రతిజ్ఞ మఱచి నటులఁ గన్పట్టుచున్నాఁడు. గదా యుద్ధమున నాభికిఁ దిగువభాగమునఁ గొట్టుట యధర్మమని యోజింపకఁ దనప్రతిన నెరవేర్చికొని యిక్కులపాంసనుఁ బరిమార్చుట కర్తవ్య" మని రహస్యముగఁ జెప్పెను. అంతట గాండీవి భీమునకుఁ దనయూరువులఁ జూపి సైగఁజేయ నతఁడు దానియర్థమును గ్రహించి గదాదండముతో సుయోధనుని తొడలు విఱుగఁగొట్టెను. అప్పుడు మృగేంద్రునిచేఁ గూలిన మదమాతంగము చందమునఁ దన గదాఘాతమునఁ దొడలు విఱిగి పుడమిం గూలిన సుయోధనునుద్దేశించి భీమసేనుఁడు "దురాత్మా! నాఁడు సభామధ్యమునఁ బాంచాలిని భంగపఱచిన ఫలమనుభవింపు" మనుచు నాతని శిరముఁ దన్నెను.

అజాతశత్రుఁ డదిగాంచి సహింపనోపక "రారాజైన సుయోధనుని దన్నవలద"ని యనిలతనయుని మందలించి, సుయోధనుని దురవస్థఁగాంచి బాష్పాకులలోచనుఁడై "తమ్ముఁడా! విధి ప్రతికూలుఁడై మాకును నీకును వైరముఁ గలిగించి యిట్టి దురవస్థ పాలు గావించె"ననుచుఁ బెక్కుభంగుల దుఃఖించెను.

భీమసేనుఁడు గదాయుద్ధమున నధర్మముగ దుర్యోధనుని తొడలుభగ్నముసేయుటఁ గాంచి హలాయుధుఁడుగ్రుఁడై "అధర్మముగఁ గౌరవేశ్వరునిఁ గూల్చిన యీపాపాత్ముని మస్తకము ఖండించెద" ననుచుఁ దనహలముఁ గైకొని వాతాత్మజునిపైకిఁ బోవుచుండఁ గృష్ణుఁ డాతనిఁ బట్టుకొని "అగ్రజా! సుయోధనుఁడు మున్ను ద్రుపదరాజపుత్త్రిని సభాంతరమునఁ దనతొడపై నెక్కరమ్మని పరిహాసించిన భీముఁడు కోపోద్దీపితుఁడై తనగదాయుధముతో నాతని యూరువులు భగ్నమొనర్చెదనని ప్రతిన గావించి యుండెను. ప్రతిజ్ఞాపాలనము నృపతులకుఁ బరమధర్మముగుటచే నాతఁ డిప్పుడు తనప్రతినఁ దీర్చుకొనియెను. కావున భీమసేనునిపయిఁ గోపింపవల" దని యనేకవిధములఁ జెప్పి యాతని నుపశమింపఁ జేసెను. అంత నాబలదేవుఁడు "ఇట్టి చెనఁటి గెలుపుగెలిచిన భీమసేనుని నీవు పొగడినఁ బొగడుదువుగాక! రణధర్మముఁ దప్పకఁ బెనఁగిన ధర్మాత్ముఁడగు సుయోధనునకు నుత్తమలోకము సేకూరు" ననిపలుకుచు రథారూఢుఁడై నిజపురమున కేఁగెను.

అప్పుడు సుయోధనుఁడు ప్రాణాంతకమైన వేదనాభరము ననుభవించుచు మధుసూదను నుద్దేశించి "కృష్ణా! నీవు సవ్యసాచికిఁ జెప్పి సైగఁజేయించుట నీపాపకర్ముఁడు ధర్మముఁ దప్పి నాతొడలు భగ్నము గావించెను. ధర్మముగఁ బోరినచో నన్నుఁ గెలువనోపునే? మఱియు నీవు శిఖండిధనువు చాటున నర్జునుని ధనువుఁ బెట్టి కొట్టించి పితామహునిఁ బడఁ

ద్రోహించితివి. పాండవాగ్రజునిచే బొంకించి యాచార్యునిఁ జంపించితివి. మాయాతిమిరముఁ బన్ని సైంధవునిఁ జంపించితివి. పుడమిని గ్రుంగిన రథచక్రము నెత్తుకొనుచుండ నన్యాయముగఁ గర్ణునిఁ గూలనేయించితివి. కురువీరుఁడగు భూరిశ్రవుఁడు సాత్యకితోఁ బోరుచుండ, ధనంజయునిచే నాతని చేయిఁ దెగఁగొట్టించి యన్యాయము చేసితివి. ఇట్టి యకృత్యములాచరించిన నిన్నేమనవచ్చు" నని క్రోధాయత్తచిత్తుఁడై పలుక గోవిందుఁడు "సుయోధనా! నీవు నిద్రితుఁడైన భీమునిఁ బాములచేఁ గఱపించియు, నీటఁ ద్రోయించియు, విషాన్నముఁ బెట్టించియుఁ బలుమారులు చంప యత్నించితివి. కుంతియుఁ గుమారులు నిద్రాసక్తులై యుండుసమయమున లాక్షాగృహము దగ్ధము చేయించితివి. కపటద్యూతమున ధర్మతనయుని సిరి నపహరించి పరమసాధ్వియగు ద్రౌపదిని సభామధ్యమున నవమానించితివి. భీమసేనుఁ డానాఁడే నీయూరువులు భగ్నము సేయ నెంచియు ధర్మబద్ధుఁడై నేటివఱకు నాఁగియుండెను. ఇట్లు నీవు పెట్టిన బాములనెల్ల ననుభవించియుఁ బాండవాగ్రజుఁడు నీతో సమరము సేయనొల్లకఁ బుడమి పాలుకుఁగ నన్నుఁ బంప నీవు సూదిమొన మోపఁజాలు భూమి నైన నీయనని పలికితివి. దుశ్శీలుఁడవగు నీ కతముననే పూజనీయులగు భీష్మద్రోణులు చనసిరి. నీవాచరించిన పాపములకెల్ల మూలమైన కర్ణుని రథము పుడమిఁ గ్రుంగ ధనంజయుఁ డాతని నేయకఁ గాచియుండునా? కాచియున్నను,

భూసురశాపమునఁ గ్రుంగిన రథమునకు నిష్కృతి గలుగునే? కావున నాతనిని నమయించుట సముచితము. అరణ్యమునఁ గృష్ణను బరిభవించి, యభిమన్యుని మరణమునకుఁ గారణుఁడైన సైంధవుని జంపక విడిచి యర్జునుఁ డగ్నిని బ్రవేశించునే? పెక్కండ్రు యోధులతోఁ బోరి డస్సియున్న సాత్యకినిఁ జంపఁ బూనిన భూరిశ్రవుని వధింపకుందుమే? ఇవియన్నియు వృథా జల్పములు. ఊరకుండు" మని వచించెను. సుయోధనుఁ డవ్వచనముల నాలించి "కృష్ణా! నీకుఁ జూడ నేనెట్టివాఁడ నైననేమి?

చ. చదివితి నెల్ల వేదములు జన్నము లొప్పఁగఁ జేసితిన్ గమా
స్పదమగు వృత్తిఁ బోల్చి పరపాలకు లెల్లనుఁ గొల్వఁగఁ గంటి దు
ర్మద రిపు గాఢ గర్వపరిమర్దన కేళి యొనర్చితిం దగం
దుదిసని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబునఁ కేఁగుటొప్పదే?

మీరలికఁ బశ్చాత్తాపదుఃఖితులగుచు నిష్పాడమి నందురు గాక" యని ధీరముగఁ బలికెను. అప్పు డక్కురునాథునిపైఁ గుసుమవర్షము గురిసెను.

అప్పటికి దినానాథుఁ డస్తమించుటచేఁ గృష్ణుఁడు పాండవులఁ దోడ్కొని కౌరవ శిబిరమున కేగుచుండ, ధృష్టద్యుమ్నాది పాంచాలురును, ద్రౌపదీ సూనులును, దక్కిన ధరణీశులును దమ విడిదలలనే విశ్రమింప నెంచి యుధిష్ఠిరు ననుజ్ఞవడసి నిజశిబిరముల కేఁగిరి. సాత్యకి మాత్రము పాండవులతో నరిగెను. పాండవులు పాడువడియున్న కౌరవశిబిరమున కరిగి తమ తమ స్యందనములు డిగినతోడనే, యగ్నిదగ్ధమైన

ధనంజయుని రథము దగ్ధమయ్యెను. పాండుసూనులది గాంచి విస్మితులై "ఇట్లగుటకుఁ గారణమే" మని కృష్ణు నడుగ నద్దేవుఁడు "భీష్మద్రోణకర్ణుల యస్త్రాగ్నులు ధనంజయు నంటకుండ నియ్యరదమున డాచియుంచితిని. ఆబాణాగ్నులచే నిప్పు డిది దగ్ధమయ్యె" నని వారలకుఁ దేటపఱచెను.

పిమ్మటఁ బాండవులు కనకీయాంభరణములును, కనక రాసులును, రత్నసంచయములును మొదలుగా మహనీయ వస్తువిస్తారములతోఁ బ్రస్తుతి పాత్రమైన సుయోధనుని భాండా గారముఁ జేకొనిరి. అనంతరము కృష్ణుఁడు "పాడువడిన యీ శిబిరము మనకు విశ్రమయోగ్యముగా" దని చెప్పి, ఓఘవతీ యను నొక పుణ్యనదీతీరమునకుఁ బాండవులఁ దోడ్కొని పోయి యట విశ్రమింపఁజేసెను. అప్పుడు యుధిష్ఠిరుఁడు మధుసూదను నవలోకించి "పుండరీకాక్షా! నీవిప్పుడు హాస్తి పురమున కరిగి గాంధారీ ధృతరాష్ట్రులకు దుఃఖోపశమనము చేసి రావలయు" నని వచింప నద్దేవుఁడును రథారూఢుఁడై హాస్తినగరమున కరిగెను.

కృష్ణుం డట్లు చని గాంధారీ ధృతరాష్ట్రులఁ గాంచి, జరిగిన వృత్తాంతము వారల కెఱింగించి "దుర్యోధనుఁడు దుర్బుద్ధియై నిష్కారణముగఁ బాండవులతో వైరముఁ దెచ్చుకొని మిమ్మిట్లు శోకానలసంతప్తమానసులఁ జేసెను. కావున నిరపరాధులగు పాండునందనులపైఁ గోపింపకుఁ" డని యనేకవిధములఁ జెప్పి వారల నూరార్చి మరల నప్పుడే పాండవులకడ కరుదెంచెను.

అటఁ దొడలు విఱిఁగి పడియున్న సుయోధనునికడకుఁ గృతవర్మ కృపాశ్వత్థామ లరుదెంచి "సకల సామంతులుఁ బరివేష్టింప ధరాచక్రము నేలు చక్రవర్తికి నేఁడెట్టి దుర్దశ ప్రాప్తించె" ననుచుఁ బెక్కుభంగుల విలపించిరి. పిమ్మట నశ్వత్థామ "కౌరవేశ్వరా! అసత్యమాడి నాజనకునిఁ జంపి యధర్మయుద్ధమున నీతొడలు విఱుగఁగొట్టిన పాండవులను ధృష్టద్యుమ్నాది పాంచాలురను నేఁడు బరిమార్చివచ్చి నీకు ముదముఁ గూర్చెద" నని పలికి యానృపతి యనుజ్ఞ వడసి కృతవర్మ కృపాచార్యులఁ గూడి బయలుదేరెను.

—* సౌప్తికపర్వము *—

ఆరథికులు ముగ్వురును పాండవశిబిరాభిముఖులై చని, యచ్చటి వీరుల సంతోషధ్వానములు నాలకించి శిబిరమునకుఁ జేరవచ్చి కొంత దవ్వున కరిగి యొక్క వటమహీరుహము క్రింద విశ్రమించి, కౌరవ సంహారమును దలంచి చింతాక్రాంత మానసులై కొంత తడవునకుఁ గృప కృతవర్మలు నిద్రించిరి. క్రోధాతిశయమున మనము జేకాకుగనుండుటచే గురునందనుఁడు మాత్రము నిద్రింపక పాండవుల నెట్లు వధింతునని యాలోచించుచుండెను. అప్పుడచ్చటి కొక్క యులూకము వచ్చి యావృక్షశాఖలపై నిదురించుచున్న వాయసముల నన్నింటిఁ బరిమార్చి యథేచ్ఛం జనుచుండ నశ్వత్థామ యదిగాంచి "ఈ కౌశికము కాకములఁ జంపినటుల నే నీరాత్రి నాశత్రువులఁ గడతేర్తు" నని దృఢనిశ్చితుఁడై తనవారిని మేలుకొలిపి

తాను సేయఁబూనిన కార్యమును వారల కెఱిఁగించెను. అప్పుడు కృపాచార్యుఁడు "ద్రోణనందనా! నిద్రాసక్తులఁ జంపుట యకృత్యము కావున నట్లు సేయఁదగదు. మన మిప్పుడు కరిపురమున కరిగి గాంధారీ ధృతరాష్ట్రులకు సమస్త వృత్తాంతము నెఱిఁగింతము. వారలు ధర్మనిరతుఁడగు విదురునితో నాలోచించి మనల నే పనికి నియోగించిన నాపని నాచరింత" మని చెప్పెను. అశ్వత్థామ యావచనముల కొడఁబడక "పాండవులు భీష్మద్రోణకర్ణభూరిశ్రవ దుర్యోధనుల నన్యాయముగ వధించిరి. అట్టి పాపాత్ముల నిట్టివేళఁ జంపుట యన్యాయముగాదు. నాజనకునిఁ బరిభవించిన ఖలుఁడగు నాధృష్టద్యుమ్ను యుతముగఁ బాండవుల నీసౌప్తిక సమయమున బరిమార్చినఁగాని నాచిత్తమున కూఱట గలుగ"దని పలుకుచు నతఁడు పాండవశిబిరాభిముఖుఁడై బయలుదేరఁ గృపకృతవర్మ లాతనివెంట నేఁగిరి.

ఆరథికత్రయము నిద్రావివశమైన పాండవ శిబిరముఁ జేరిన తోడనే యచట గరళకంఠుఁడు భూతాకృతియై వారికిఁ బొడసూపెను. అశ్వత్థామ యమ్మహాభూతముఁ గాంచియు భీతుఁడుగాక దానిపై ననేక దివ్యాస్త్రములఁ బ్రయోగింప నాభూతము వానినెల్ల మ్రింగఁ దొడఁగెను. తన యస్త్రము లన్నియు నట్లు నిష్ఫలములగుటకుఁ జింతించి యశ్వత్థామ తనకీశభవానీపతియే శరణ్యుఁడని తలఁచి మనమున మహేశ్వరుని ధ్యానించుచు నద్దేవున కాత్మోపహార మొసఁగ దృఢనిశ్చితుఁడై యనలమునఁ

ప్రవేశించెను. అప్పు డుమారమణుఁడు ప్రీతుఁడై యాతనికిఁ గన నిజరూపముఁ జూపి "వత్సా! నీధైర్యముఁ బరీక్షింప నీ భూతరూపముతో వచ్చి పరీక్షించి నీభక్తికిఁ బ్రీతుఁడనైతి. నేఁడీ శిబిరమున నిద్రించుచున్న వారల కింకఱకుఁ గాల మాసన్నమయ్యె! నీవీ కృపాణముఁ గైకొనిపోయి నీ శాత్రవులఁ జయింపు" మని పలికి యాతని కొక్క ఖడ్గము నొసఁగి, తేజోరూపమునఁ దా నాతని దేహమునఁ బ్రవేశించెను.

అంత నాగురుపుత్రుఁడు హర్షపూరితాంతఃకరణుఁడై తానొక్కఁడే శాత్రవుల నంపఱిని బరిమార్ప నెంచి కృపకృతవర్మలను వాకిటఁ గావలియుంచి నిజాయుధముఁ గేలఁబూని మొదట ధృష్టద్యుమ్ను సదనమున కేఁగి యవ్వీరవరేణ్యునిఁ దన్ని లేపెను. గాఢనిద్రాసక్తుఁడై యున్న యుప్పాంచాలరాజనందనుఁడు గురుపుత్రుని పదప్రహారమున నదరిపడిలేచి తన బాణాసనముఁ గైకొననుంకించుచుండ ద్రోణనందనుఁడాతనితలఁ బట్టుకొని యీడ్చి ధరణిం బడవైచి యురమును గళమును నిరుగాలఁ ద్రొక్కసాగెను. ధృష్టద్యుమ్నుఁ డాబాధకుఁ దాళఁజాలక "గురుపుత్రా! బాణముతోఁ గొట్టి శీఘ్రముగ నన్ను స్వర్గమున కనుపుము. ఇక నిట్లు బాధింపకు" మని, యెలుఁగు వెడలకుండుటచే నెట్టకేలకు మాటలు వెడవెడ నెలుంగవచ్చు తెలుఁగునఁ బలికెను. "ఓరీ! గురుద్రోహీ! మదీయజనకునిఁ బరిభవించిన కారణమున నిన్నిట్లే నలిపి పశువును జంపు విధమునఁ జంపుదు" ననుచు గురుపుత్రుఁ డాతనిఁ గాలను గేలను

జరిపి మిక్కుటముగ బాధించి జముని వీటి కనిపెను. సేవక జనము లాకలకలమునకు మేల్కాంచి పీనుఁగై పడియున్న రాజ కుమారునిఁగాంచి దుఃఖావేశిత మానసులై విలపింప నవ్విలా పమువిని చుట్టుప్రక్క శిబిరములలో నిద్రించుచున్న నృపాలురు లేచివచ్చి యశ్వత్థామను ముట్టడించిరి. అశ్వత్థామ తన భుజ బలము ప్రకాశింప వారిలో ననేకుల యందఱి నంతకసదనమున కనిపి, యుత్తమౌజ, యుధామన్యులను ద్రుపదరాజ నందనుల నిలయమునకేఁగి వారినిఁ బరిమార్చెను.

పిమ్మట నతఁడు రాజమందిరమునఁ బ్రవేశింప నచ్చట శయనించిన శిఖండియు, ద్రౌపదీపుత్రపంచకమును మేల్కాంచి యాతని నెదుర్కొని పోరఁదొడఁగిరి. అశ్వత్థామ నిశితాస్త్ర ములఁ బ్రయోగించి వారిని వధించి పిమ్మటఁ దన్నెదిర్చిన పరివారమును బరిమార్పఁ దొడఁగెను. ఇట్లు గురుపుత్రుఁడా నాటిరాత్రి నిద్రానక్తులైయున్న వారినిఁ గొందఱిని, గలత నొంది లేచుచున్న వారినిఁ గొందఱిని, మేల్కొని తన్నెది రించినవాఱినిఁ గొందఱిని, బరిమార్చుచుండ మఱికొందఱు భటులు భయభ్రాంతచిత్తులై హాహారవములు సేయుచు "నేఁ డిచ్చటఁ గృష్ణ సాత్యకులును భీమార్జునులును లేకుండుటచే నిట్టి మహోపద్రవము సేకూరె" నని యడలుచు శిబిరము విడిచి పారిపోవ నుంకించి బయటికి వచ్చి యచ్చటఁ గావలియున్న కృపకృతవర్మలఁగాంచి "మహాత్ములారా! నిరపరాధులమగు మమ్ము వధింపకుఁ" డని వేఁడుచు వారిని

శరణుఁజొచ్చిరి. అప్పుడు కృపకృతవర్మలును రాక్షసావేశ సంభృతక్రౌర్యులై యుండుటవలన ధర్మాధర్మముల నాలోచింపక, తమ్ము శరణుఁజొచ్చినవారి నందఱినిఁ బట్టి వధించిరి.

అశ్వత్థామ పాండవ శిబిరమున రెండుజాములు వీర విహారముసలిపి యచటనున్న నృపాలురను చేది, మాత్స్య, పాంచాల, ప్రభద్రాది బలములను, గజాశ్వాదినివహములను నిరవ శేషముగ హతముగావించి రక్తసిక్తగాత్రుఁడై, శవసంకులమైన యాశిబిరము విడిచి తనవారిఁగలిసి కురుపతిపాలికిఁ బోయెను.

అప్పుడు కౌరవేశ్వరుఁడు రక్తసిక్తమైన ధరణిపయిఁబడి దుర్భరమగు మరణవేదన ననుభవించుచు ప్రాణములు విడువ నుంకించుచుండఁ గృపకృతవర్మాశ్వత్థామ లచటికరుదెంచి నృపతియవస్థఁ గాంచి శోకాక్రాంతమనస్కులై యాతని నతి ప్రియంబున నెత్తి కౌఁగిలించుకొని విలపింపసాగిరి. అప్పుడశ్వత్థామ యమ్మహీపతి ముఖంబునఁ జూడ్కి నిలిపి, "కౌరవేశ్వరా!

చ. కుడువఁగఁ గట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్టజన్నము
ల్నడుప ననేక ధర్మవిధులం బొగడొందఁగఁ జాలునట్టి యొ
క్కఁడు సిరియిచ్చి పేర్మినొక కొండఁగ మన్చిన నీవు చావఁగా
నొడలిటులో మితిఁ గురుకులోత్తమ యేనొక సేవకుండనే.

ఉ. న్యాయము దప్పకుండఁగ రణంబొనరించి దివంబుఁగైకొనం
బోయెద వందురాఁ దగినపుణ్యము సేయుట లేదుగాని మా
చేయు మనంబునుం దనియఁ జెండఁగఁ బడ్డవిరోధివర్గమున్
నీయెడ కిం బొనర్పఁగ గణింపఁగ భాగ్యము గల్గె భూవరా.

అధర్మముగ నీయూరువులు భగ్నము సేసి విజయము సేకొన్న పాండవుల శిబిరమున కేనరిగి శిఖండి ధృష్టద్యుమ్నాదులను, ద్రౌపదేయులను, సమస్తపరివారమును దెగటార్చి వచ్చితి. పాండుసూనులు, కృష్ణసాత్యకులును మాత్రము నా కచ్చటఁ గానరారైరి. వార లెట కేఁగినదియుఁ దెలియలేదు. నీవు దివమున కేఁగినతోడనే భారద్వాజునకు నామముగ నమస్కరించి, నీచుఁడగు ధృష్టద్యుమ్నుని నేను వధించితినని శ్రవణానంద కరముగఁ జెప్పుము. బాహ్లీక, సోమదత్త భూరిశ్రవ, కర్ణప్రముఖ భవదీయబాంధవజనములతో నా చేసినకుశలప్రశ్నముగా సంభావింపు" మని పలుకుచు దీనాననుఁడై దుఃఖాశ్రువులు విడువసాగెను.

సుయోధనుఁ డవ్వచనముల నాలించి "ధరణీసురవరేణ్యా! భీష్మ ద్రోణ కర్ణుల కంటె నీవెక్కుడు పరాక్రమము సూపి యద్భుతకార్యము సేసి నాకధికప్రియము సేసితివి. ఇఁక మీరు ముప్వురును నాకొఱకు విలపింపక సుఖముగఁ జనుఁడు. మనకుఁ బునర్దర్శనము త్రిదివమున నయ్యెడుఁగాక" యని యధిక వేదనముతోఁ బలుకుచు ప్రాణములు విడిచెను. కృతవర్మకృపాశ్వత్థామ లమ్మహీపతి శరీరము నాలింగనము సేసికొని కొంత తడవు విలపించి పిమ్మటఁ దమ యరదముల నెక్కి యచ్చోటుఁ బాసి చనిరి.

భానుమంతుఁ డుదయగిరి శిఖరము నలంకరించినపిమ్మట ధృష్టద్యుమ్నుని సారథి పాండవులపాలికిఁ బోయి "మహా

మహాబలులారా! నిశీథసమయమున నశ్వత్థామ కృపకృతవర్మ లతో మనవీటి కరుదెంచి శిఖండి ధృష్టద్యుమ్నాదులను, భవదీయ పుత్రపంచకమును, సకలపరివారమును బరిమార్చెను. నే నొక్కఁడనుమాత్రము వారిబారిఁ బడక మీకీ దుఃఖవార్త నెఱిగింప వచ్చితి" ననుచు జరిగిన వృత్తాంతము నామూలాగ్రముగ వారల కెఱింగించెను.

పాండవాగ్రజుఁ డాఘోరవార్త నాలించినతోడనే దుఃఖాతిశయమున మూర్ఛాక్రాంతుఁడై, సాత్యకి భీమసేనాదులసముచితోపచారములచేఁ గొంతతడవునకుఁ దెలివొంది "హా! తనయులారా! భీష్మద్రోణకర్ణాదియోధాగ్రేసరులబాణాగ్నులకు సైత మోర్చి పరవాహినీభయంకరులై చరించిన మీరలు నేఁ డీగురుపుత్రునిఁ బాఱిఁ బడితిరా? శాత్రవుల నందఱిని నమయించి జయము నేఁ గొంటినిగదాయని యానందించుచుండ నింతలో శాత్రవు లరుదెంచి నావారల నందఱినిఁ గడ తేర్చి నన్ను దుఃఖభాజనునిఁ గావించిరి. హా! విధిచెయ్దము లెంతవిచిత్రములు?

చ. జనకుఁడు లేమికిం గడువిషాదము నొందెడు కృష్ణ యిమ్మెయిం
దనయులు భ్రాతలుం జెగుట దాఁవిని మూర్ఛ మునుంగు నెమ్మనం
బును నవశంపుమేనునయి భూస్థలిఁ ద్రెళ్లకయున్నె తేజె నే
నినిఁ బటుశోక వేగమున నిర్భరవేదనఁ జెందకుండునే"

అని చింతించుచు ద్రౌపదిని సత్వరముగఁ దోడ్కొనిరమ్మని నకులున కాజ్ఞాపించి, దామోదర సాత్యకీభీమార్జున సహదేవులఁ గూడి వీనుఁగుపెంటయైన శిబిరమున కరుదెంచెను.

అచ్చట హతులై పడియున్న పుత్రమిత్రబాంధవుల కళే
బరములఁ గాంచి పాండవులు విలపించుచుండఁ గృష్ణసాత్యకులు
వారల నూరార్చి మృతులైన వారల కందఱకు నగ్ని
సంస్కారము సేయించిరి.

విరాటద్రుపదులు మృతులైన మఱునాఁడు కృష్ణ విరటు
పురమున కరిగి సుధేష్ణకును, నచ్చటనేయున్న తన జనయిత్రి
కివి దుఃఖోపశమనము సేసి పిమ్మటఁ దన జననిఁ గూడి
యుపప్లావ్యపురమునకు వచ్చియుండుటచే నప్పుడు నకులుఁ
డుపప్లావ్యమున కరిగి యా దుర్వార్త నామె కెఱింగించి తన
సోదరులపాలి కవ్వధూమణిని దోడ్కొనివచ్చెను.

ద్రౌపది దుఃఖాతిశయమున నాక్రందనము సేయుచు వచ్చి
"నిద్రాసక్తులై యున్న నా కుమారపంచకమును వధించిన
యాదురాత్మునిఁ దెగటార్చినఁ గాని నామనస్తాప ముపశ
మింపదు. ఇప్పుడు వాయుతనూజునిఁ బంపించి యానీచుని
సమయింపనిచో నేనీ దేహముఁ ద్యజింతు" నని వచించెను.
అంతట భీమసేనుఁడు రథారూఢుఁడై వెడలి కురుక్షేత్రసంచారి
జనములవలన నశ్వత్థామ జాడ నరయుచు నతఁడు వ్యాసా
శ్రమమున కరిగెనని యెఱిఁగి తన యరదము నచ్చటికిఁ
దోలించుచుండెను.

అప్పుడు కృష్ణుఁడు ధర్మతనయు నవలోకించి "కౌంతే
యాగ్రజా! అశ్వత్థామ ద్రోణునివలన, దేవమనుజదనుజలోక
ములు భస్మము సేయు బ్రహ్మశిరోనామకాస్త్రము వడసి

యుండెఁ. ఆతఁ డిప్పు డయ్యస్త్రముఁ బ్రయోగించినచో భీమ
సేనుఁ డెదుర్కొనఁజాలఁడు. దానికిఁ బ్రతి ధనంజయుఁడు
మాత్రమే యెఱుంగు. కావున నిప్పుడు నీవును నేనును విజయుఁ
డును భీమసేనునకుఁ దోడుగ నేఁగవలయు" నని వచింప,
యుధిష్ఠిరార్జునులు కృష్ణునితోఁ బయలుదేరి భీమసేనుని గలిసి
కొనిరి.

భీమసేనుఁడు వ్యాసాశ్రమమున కేఁగి యశ్వత్థామ నవ
లోకించి "ఓరీ! దురాత్మా! మేము లేని సమయమున వచ్చి
నిద్రాసక్తులం జంపి, యిచటికి వచ్చి తాపస వేసముం దాల్చినఁ
జావు దప్పునని తలంచితివా? నీ తపంబిఁకఁ జాలు. రణ
మునకు ర"మ్మని గంభీరస్వరమునఁ బలికెను. అంతట గురు
పుత్రుఁడు రోషప్రదీప్తుఁడై యొక్క యిషీకముఁ జేతఁబట్టుకొని
బ్రహ్మశిరోనామకాస్త్రమును జపించి యపాండవంబగుఁగాక
యనుచు దానిం బ్రయోగించెను.

అమ్మహాస్త్రము ఘోరానలజ్వాలలతో వచ్చుచుండఁ
గృష్ణుఁ డవలోకించి "ఫల్గునా! ఫల్గునా! బ్రహ్మశిరోనామ
కాస్త్రంబు వచ్చుచుండె. దీని నొండస్త్రము ప్రతిహతము సేయఁ
జాలదు. కావున నిప్పుడు నీవును బ్రహ్మశిరముఁ బ్రయోగించి
నీసోదరులను, నన్నునుఁ గాపాడుకొను" మని వచింప ధనం
జయుఁడు మనమున ద్రోణాచార్యునకు నమస్కరించి, గురు
పుత్రునకుఁ గీడుపొందకుండ నాతని యస్త్రమును మాత్రము
మరల్పవలయు నని తలఁచి తానును బ్రహ్మశిరోనామకా

స్త్రమును ప్రయోగించెను. అంత నయ్యిరువురి యస్త్రములును ఘోరముగఁ బోరాడుచుండ దిశలన్నియుఁ గంపింప నారంభించెను.

అప్పుడు వ్యాసనారదమహర్షు లచటికి కరుదెంచి "వీరోత్తములారా! మీమీ యస్త్రముల నుపసంహరించి లోకమునకు హితము సేయుఁ" డని పలుక ధనంజయుఁడు తన యస్త్రము నుపసంహరించెను. అశ్వత్థామ నిజాస్త్రసంహారము సేయఁ బోవ నది శక్యము గాకయుండె!

బ్రహ్మశిరోనామకాస్త్రము నెవ్వఁడు ప్రయోగింప వాఁడు బ్రహ్మచర్య మనుష్ఠించియుండెను. ప్రయోగించిన దాని మరల్చుట దుస్సాధ్యము. అట్లుమరల్చినచో నది ప్రయోగించిన వానినే నశింపఁజేయును. అధికతపోబలవిశుద్ధాత్ముఁ డగుటచేఁ బార్థుఁడు దాని నుపసంహరింపఁ జాలెను.

అశ్వత్థామ యాదివ్యాస్త్రము నుపసంహరింపఁ జాలక పాండవవంశవధూజనగర్భములన్నియు దగ్ధము గావించి యియ్యస్త్రము శమించుఁగాక యనుచు నస్త్రప్రమోచనము సేసెను. అప్పుడు కృష్ణుఁడు "ద్రోణనందనా! ఉత్తరగర్భమునఁ బెరుఁగుచున్న యభిమన్యుని దేహమును మాత్రము గాపాడి పాండవవంశము నుద్ధరింపు" మని వచింప, నద్దురాత్ముఁ డందుల కంగీకరింపకుండెను. అంతట మధుసూదనుఁడు కోపాయత్తచిత్తుఁడై "దురాత్మా! నీవంగీకరింపకున్నను మత్స్యరాజనందనగర్భం బేను రక్షించి పాండవవంశము నుద్ధరించెద. బాలఘాతి

వగు నీకు నశనము దుర్లభమై, సహాయరహితుఁడవై దుర్గంధ రక్తమున నంగము దిగ్ధమగుచుండ మూఁడువేల వర్షములు దిరుగుచుండు" మని యాతనిని శపించెను.

అశ్వత్థామ శిరమున నొక్క దివ్యరత్నము గలదు. దానిఁ దాల్చిన వారలు విషజంతుసంతాపమును, దేవదానవభయమును, క్షుత్పిపాసలను నెఱుఁగక సుఖజీవనము సేయుదురు. అశ్వత్థామ చిరజీవి యగుటచేఁ బారాశర్యుఁ డాదివ్య శిరోభూషణమును పాండవుల కిప్పించి వారల కాతని యెడఁగల క్రోధము నుపశమింపఁజేసెను. పిమ్మట నశ్వత్థామ తపోవనమున కేగెను. పాండుసూను లారత్నముఁ గైకొని, సాత్యవతేయునకుఁ బ్రణామము సేసి యామునీంద్రునిచే నాశీర్వాదము వడసి కృష్ణ సహితులై ద్రౌపదిపాలికిఁ బోయి యాసాధ్వీమణి కమ్మణి నొసఁగి జరిగిన వృత్తాంతమంతయు నెఱిఁగించిరి. ద్రౌపది సంతుష్టాంతరంగయై యారత్నమును ధర్మతనయుని శిరమునఁ బెట్టెను.

అశ్వత్థామచేఁ బ్రయుక్తమైన బ్రహ్మశిరోనామకాస్త్రము పాండవవంశవధూజనముల గర్భములు దగ్ధము గావించి ప్రశాంతి నొందెను. కృష్ణుఁడు పాండవవంశనాశనము గాకుండ నుత్తరగర్భము నందున్న యర్భకుని మాత్రము రక్షించెదనని చెప్పి పాండుసూనులకును, బాంచాలరాజనందనకును దుఃఖోపశమనము సేసెను.

## —* స్త్రీ పర్వము *—

తమ తనయులందఱును శాత్రవులచే వధింపఁబడుటఁ దలఁచి గాంధారీధృతరాష్ట్రులు శోకసంతప్తమానసులై ధరణి పయిఁబడి రోదనము సేయుచుండ విదురుఁ డరుదెంచి

తే. "యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములు గావె
వీని హానికి వగపవివేకమగుటఁ
బండితులు వగఁ గూరరు పౌరవేంద్ర.

సీ. బిరుసుల నైనను బిఱికివాండ్రను నైనఁ
జంపుచోఁ గడపఁడు జముఁడు నేర్పు
లావున మర్త్యునిచావు మాన్పఁగ లేవు
రణ మొనర్చినఁ గాని రాదె మరణ
మెయ్యదియవధి యిందెల్లవారును
దెగువార కాకది గడవంగ వశము
గాదింతయుమ్మలికం బేల యట్లును
గాక నీ సుతులు సంగ్రామకేళి
సలిపి యింద్రుని కతిథులై చనిరి యజ్ఞ
దాన విద్యాతపోలబ్ధమాననీయ
గతులు సమరాని వర్త నమ్మృతులయరుగు
నట్టి గతులకుఁ జాటిగా వండ్రు బుధులు.

పాండిత్యసంపన్నుఁడవగు నీవు వీరస్వర్గము నొందిన కుమారులకై యిట్లు విలపింపఁదగునె? శోకముడిగి పోలికలని కరుదెంచి పుత్రాదిజ్ఞాతులకు నౌర్ధ్వదైహికములు సేయింపు" మనుచు నాతని నూరడించుచుండెను.

అప్పుడు కృష్ణద్వైపాయనుఁ డరుదెంచి "పుత్రా! ప్రాజ్ఞుఁడ

వగు నీవు చేలవలె నిట్లు దుఃఖింపఁదగునె? ఇప్పుడు దుఃఖించిన నేమిప్రయోజనము గలదు? నీసుతుఁడపినీతుఁడై పాండుసూనులఁ జిక్కిడుములు బెట్టి వారిరాజ్యము నపహరించి సంధి కొడఁబడఁడయ్యె! నీవును సుయోధనుని దుర్మంత్రమున కామోదించి పాండవులకు రాజ్య మీయనొల్లక, శ్రీకృష్ణగాంగేయ విదురాదుల సదుపదేశము చెడచెవిం బెట్టితివి. దాన నిట్లు కులక్షయము సంప్రాప్తమయ్యె! ధర్మమూర్తియైన పాండవుల యెడ నించుకయుఁ దప్పులేదు. ధర్మనిరతుఁడగు యుధిష్ఠిరుఁడు నిమ్మధికభక్తితోఁ బోషింపఁగలవాఁడు. కావున నీవిఁక దుఃఖముడిగి సకలగాంధవులకుఁ బరలోకక్రియల నాచరింపుము.

క. భూతము లనిత్యములు నీ
వీ తెరువెప్పుడును విం దహీన ధృతిన్ నీ
చేతోగతినల కింపుము
భూతానిత్యత్వమదియు పుమ్చను కగలన్.

అనుచు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనము సేసెను. ఇట్లు వ్యాసవిదురులచేఁ బ్రబోధింపఁబడి ధృతరాష్ట్రుఁడు కొంచె మూఱటనొందిన మనముగలవాఁడై పొలికలనికి బయలుదేరెను. అతనివెంట గాంధారియుఁ, గుంతియుఁ, గౌరవవధూజనములును సకలపౌరులును నాక్రందనము సేయుచు బయలుదేరిరి.

మార్గమధ్యమునఁ గృతవర్మకృపాశ్వత్థామలు వారల నెదుర్కొని, తామానాఁటిరాత్రి పాండవశిబిరమునఁ గావించిన సాహసకృత్యమును గాంధారీధృతరాష్ట్రుల కెఱింగించి దుఃఖో

ప్రశమనవాక్యములచే నా రాజదంపతుల నూఱడించి, పాండ
వులకు నెఱిచి మేమెందైన దాగియుందు" మని చెప్పి వారి
యనుజ్ఞ వడసి వెడలిపోయిరి. పిమ్మటఁ గృతవర్మ నిజపురము
నకును, కృపాచార్యుఁడు గజపురమునకును, గురుపుత్రుఁడు
తపోవనమునకును జనిరి.

యుధిష్ఠిరస్వామి[illegible] ధృతరాష్ట్రుఁడు [illegible]లనిక వచ్చు
చుండె[illegible] [illegible] తమ్ములతోడను
[illegible] నగరో[illegible] [illegible]. పుత్రశోకార్తుఁడైన
యజాతశత్రుఁడు పుత్రశోకార్తిం బొగలుచున్న ధృతరాష్ట్రు
[illegible] [illegible] నాభూపాలుఁడు దక్కుమారు
[illegible]ంచెను. పిమ్మట భీమార్జున నకుల
సహదేవు[illegible] వచ్చి ప్రణామము సేయుచుండఁ
బార్యవర్తు[illegible] వారలఁ బేరుపేరున నెఱిం
గించిరి.

భీముఁ డను మాట చెవిసోకిన తోడనే ధృతరాష్ట్రుని
మనంబునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్ల నతఁ డక్కుమారునిఁ జంప
నెంచి తన క్రోధము నతిగుప్తముగ నునిచి, యాతని నాలిం
గనము సేసికొనఁ దలఁచినటుల నటించెను. త్రికాలవేదియగు
వాసుదేవుఁ డాతని దురాలోచనము మున్నే యెఱింగి
యయోమయంబుతో భీముని ప్రతిరూపము సేయించి యచ
టికిఁ దెచ్చి నిగూఢముగ నుంచి యున్నవాఁ డగుటచే నపుడ
య్యనుపభీము నక్కురుపతి సమీపమునఁ బెట్టి భీమసేను

నీవలకుఁ దోడ్కొనివచ్చెను. అంతట దశసహస్రసామజసమాన బలుఁడగు నయ్యంధనృపాలుఁ డ య్యినుపబొమ్మను నాలింగనము సేసికొని తనబల మంతయు వినియోగించి దానిఁ బొడిపొడి గావించి విడిచి మనమున నానందించుచుఁ దన దుష్కృత్యము నొరు లెఱుఁగకుండుటకై భీమునిఁ జేరఁ్కొని హాహాకారము లెసఁగ రోదనము సేయఁ దొడఁగెను.

అప్పుడు కమలనాభుఁడు మందస్మితముఖారవిందుఁడై "కౌరవేశ్వరా! నేను నీదుర్మంత్రము నెఱిఁగియే యినుపభీముని నీసమీపమునఁ బెట్టించితిని. నీవు దానిఁ బొడిపొడి గావించితివి. నీవు చంపనెంచిన గంధవహనందనుఁడు సుఖుఁడై యున్నవాఁడు. కావున నాతనికై దుఃఖింపవలదు. నీ తనూజు లాచరించిన దుష్కృత్యముల నెఱింగియు, వాయునందనుఁడు వారలఁ బరిమార్చెనని కుపితుఁడవై యాతనిఁ జంపనెంచుట ధర్మమే? సకలధర్మవిదుఁడవగు నీవిట్టి పాపకృత్యము సేయ నేల సమకట్టితివి? ఇఁకనైనఁ బశ్చాత్తప్తుఁడవై పాండవులయెడఁ గ్రోధము విడిచి శాంతుఁడవై యుండు" మని వచింప ధృతరాష్ట్రుఁడు సిగ్గునొంది "మధుసూదనా! హృదయమును క్రోధశోకములు తల్లడింపఁ జేయుటచే మందబుద్ధినై యీ యకృత్యము సేయ సమకట్టితిని. నాయపరాధము సైరింపుము. ఇఁకఁ బాండవులయెడఁ బుత్రవాత్సల్యమున వర్తించువాఁడ" నని పలికి పాండవుల నాశీర్వదించెను.

పిమ్మటఁ బాండవులు గాంధారికడకుఁ బోయి వినయమునఁ

ప్రణామము సేయ న ద్దేవి మనంబు తనూజుల మరణమునకుఁ
దాపమునొందుచుండుటచే వారలఁ దీవింపనొల్లక యుధిష్ఠిరుని
శపింపఁ దలఁచెను. అప్పుడు సాత్యవతేయుఁ డామెతలఁపు
నెఱిఁగి వచ్చి "కుమారీ! నీ తనయులు దుర్వర్తను లగుటచే
నిట్టిముప్పు వాటిల్లెఁ గాని పాండవులయెడ నించుకైన నేరము
గలదే? నీయెడ మాతృభావమున మెలఁగు వీరల దెసఁ
గారుణ్యము వహింపు" మని యుపదేశింప నా సాధ్వి
"మునీంద్రా! భీమసేనుఁ డన్యాయముగ సుయోధనునిఁ
దొడలు విఱుఁగఁగొట్టుటయు, దనుజుని చందమున దుస్సేనుని
యురముఁజీల్చి రక్తపానము సేయుటయుఁ దలఁప, నామనము
క్రోధసంతాపానలములచే దగ్ధమగుచుండె" నని పలికెను.

అప్పుడు భీమసేనుఁ డామెకు నమస్కరించి "తల్లీ! మున్ను
కౌరవసభాంతరమునఁ బాంచాలినిఁ దన యూరువు నెక్క
రమ్మని సుయోధనుఁడు సైగసేయ నే నద్దురాగతమునకు
సహింపక నాతని తొడలు గదాయుధముచే భగ్నము సేయుదు
నని ప్రతినఁ గావించితి. దుశ్శాసనుఁ డప్పుణ్యచరిత వసనములు
నూడఁదీసినప్పుడు, నేనాతని వక్షముఁ జీల్చి రుధిరము నాస్వా
దింతునని శపథము సేసితి. ఈ రెండుకార్యము లానాఁడె
యాచరింపవలసిన వైనను, ధర్మతనూజుని ధర్మమునకు హాని
సేకూరునని నేను శాంతివహించి కాంతారవాసము సేసి వచ్చి,
బంధువధము సేయ నొల్లకఁ బుడమిపాలడుగ సుయోధనుఁ
డీయ నొల్లక సంగ్రామమునకుఁ గడఁగె. ఉత్తమ క్షత్రియులకుఁ

ప్రతిజ్ఞాపాలనము పరమధర్మమగుటచే నే నీ సమరమున నా
రెండు ప్రతిజ్ఞల నెఱవేర్చితిని. సువిచార వగు నీవెఱుఁగని
ధర్మములు గలవె ? " అనుచు సౌమ్య వాక్యముల యుధిష్ఠిరుఁ
డామెకుఁ బ్రణామము సేసి "జననీ ! నీతనయుల సంహరించిఁ
జంపించి నిన్ను దుఃఖసాగరమున ముంచిన పాపాత్ముఁడనగు
నన్ను నీ కోపానలముచే దగ్ధము సేయు" మని వచించెను.
అంత నామెకు వానిని శపింప నోరాడనందునఁ గ్రోధముఁ
నిగ్రహించి మాతృభావముతో నిలిచెను.

అప్పుడు పాండవజనము లెల్లను నా సమరప్రదేశమునఁ
బడియున్న తమవారి కళేబరములపైఁ బడి ప్రలాపింపఁ
దొడఁగిరి. గాంధారియు వ్యాసవరప్రసాదమునఁ బ్రాప్తమై
తాత్కాలికమైన దివ్యదృష్టి విభవమున సజ్ఞత హానిలేని
తెఱంగున సమరాంగణము నవలోకించి, యందుఁ బడియున్న
తనవారి నందఱినిఁ గలయఁజూచి దుఃఖావేశితమానసయై
కృష్ణు నుద్దేశించి "దేవకీనందనా ! అన్నదమ్ములు సమరము
నకుఁ దొడఁగుచుండ నీవు వారింప సమర్థుఁడనయ్యును వారింపక
యుపేక్షించి కలహముఁ బెంచి మాకుఁ గులక్షయము సేసితివి.
కావున మీ యాదవవంశముగూడ నిట్లే యిఁక ముప్పదియాఱు
వత్సరముల కన్యోన్యకలహమున నశించుఁ గాక ! మీ వధూ
జనములు గూడ నిట్లే శోకాక్రాంతలై యడలుదురుగాక !
నీవు దిక్కులేనివాఁడవై కుత్సితంపుఁదెఱంగునఁ గూలుదువు
గాక " యని శపించెను.

ఆశాపము నాలకించి పాండవులు భయావేశితులై వడకు చుండఁ గృష్ణుఁడు చిఱునగవుతో నామె నుద్దేశించి "యాదవులన్యులచేఁ జచ్చువారలు గాకుండుటచే వారల కెల్లను నన్యోన్యకలహానాశనము సంభవించును. నీవు నిష్కారణముగా నన్ను శపించితివే గాని నీ శాపమున నధిక మేమియు లేదు. నే నెన్నివిధముల నదుపదేశము సేసినను, నీ కొడుకు సంధి కొడఁబడఁడయ్యె. దానికి నే నేమి సేయఁగలవాఁడ" నని వచించెను.

పిమ్మట యుధిష్ఠిరుఁడు రణనిహతులైనవారి కందఱికిని విధ్యుక్తముగ నగ్నిసంస్కారము సేయించి ధృతరాష్ట్రాది బాంధవులఁ గూడి భాగీరథీతీరమున కరిగెను. ఆపుణ్యనదీ జలమున నందఱును స్నాన మాచరించి బాంధవులకుఁ దిలోదక ప్రదానములు సేయుచుండఁ గుంతి దుఃఖాక్రాంతయై వచ్చి "కుమారా! కర్ణుఁడు జను లెల్లఱును భావించునట్లు రాధాసుతుఁడు గాఁడు. అతఁడు భాస్కరుని వరమున నాకు జనించినవాఁ డగుటచే మీ కగ్రజుఁడు! కావున నా శూర వరేణ్యునకుఁ దిలోదకప్రదానము సేయువలయు" ననుచు నాతని జననవృత్తాంతమును యుధిష్ఠిరునకు నవిస్తరముగఁ జెప్పెను.

దుస్సహములగు నవ్వాక్యముల నాలకించిన తోడనే పాండవులు పరమదుఃఖావేశమానసు లైరి. అప్పు డజాతశత్రుఁడు జనయిత్రినిఁ గాంచి "తల్లీ!

సీ. అనిలజార్జునుల మార్కొనఁజేర్చ నెవ్వని
యుత్సాహమూఁది సుయోధనుండు
తైదేహపాంచ్రాది వసుధేశులెవ్వని
కడిమిసొంపున నరిగాఁపులైరి
మనసైన్యకోటి యెవ్వని బాహువీర్య సం
పదఁ గోడి యంతంత నొదుగుచుండు
నద్భుతంబొనరించె నమరుల కెవ్వని
యసమాన వివిధ దివ్యాస్త్రమహిమ
మమ్మనందఱ నెవ్వని మహితశక్తి
యొక్కఁడై సంగరంబునఁ జిక్కఁపఱిచె
నట్టికర్ణునిఁ గొంగున నగ్నిఁ దాఁచి
నట్టు లెమ్మెయి దాఁచితో యమ్మ చెపుమ.
ఆ. అతఁడు మాకు నన్నయని మున్న యెఱుఁగంగ
నన్నఁ గురుకులంబు గలఁగఁబడక
మనుదుముట్టులైన మనుజలోకమునకుఁ
గలుగదడలు మాకుఁ గలుగదడలు.”

అనుచు విలపించి యాదిత్యనందనునకుఁ దిలోదకప్రదానంబు సేసెను. పిమ్మట బాంధవు లెల్లఱు నాతనికి నుదకకర్మం బాచరించిరి. యుధిష్ఠిరనృపాలుఁడు కర్ణహితార్థంబుగ ననేక పుణ్యకర్మల నాచరించి, యాతని వతుల ననేకవిధముల గారవించి సకలబంధుసహితముగా గంగనముత్తరణం బాచరించెను.

## — శాంతిపర్వము —

ఆశుచిత్వనివృత్తికై యుధిష్ఠిర నృపాలుఁడు గంగాతీరమునఁ బటకుటీరంబులు నిర్మింపఁజేసి సకల బాంధవులతో నచ్చట

నోకమానసము నివసించెను. అప్పుడు నారద, దేవల, వ్యాసాది మహామును లరుదెంచి యమ్మహీపతిచేఁ బూజితులై

శా. "గోవిందుం డనిశంబు శోభనమెదంగోరంగఁ బార్థుండు ద
ర్పావేశోజ్జ్వలబాహుసార మహనీయస్ఫూర్తి సంక్షోభి గాం
డీవోల్లాసవిభాసియై సమరపాండిత్యంబు వాటింప సం
భావింపన్ జగమెల్ల రాజ్యమిటు లొప్పంగొంటె రాజోత్తమా."

అనుచుఁ గుశలప్రశ్నము సేసిరి. "తాపసోత్తములారా! వాసుదేవుని కృపవలనను, మీయనుగ్రహమువలనను, భీమ పార్థుల భుజబలమువలనను రాజ్యము సేకూరె! అయినను భరతకులభూషణులగు నభిమన్యుద్రౌపదేయులఁ గోల్పడుట వలనను, సకలజ్ఞాతివధము సేయుటవలనను, మదీయాగ్రజుఁ డగు కర్ణునిఁ గూల్చుటవలనను నామనము సంతాపాగ్నిచే దగ్ధమగుచుండె! అమ్మహానీయుఁ డగ్రజుఁడని యెఱింగినచో నిట్టి దుష్కృత్యము సేయక, రాజ్యముఁ గాంక్షింపక విపినంబున నైన సుఖముగ నుండెడివాఁడ" ననుచు గద్గదకంఠుఁడై ధర్మ తనూజుఁడు వారికిఁ బ్రత్యుత్తర మొసఁగెను.

అప్పుడు కుంతి యాతని నోదార్పనెంచి "కుమారా! కర్ణునకు నేను జననక్రమ మెఱిఁగించి, సుయోధనుని విడిచి మిమ్ముఁగూడి మహీవలయము నేలుమని యుపదేశింప నతఁడది వినఁడయ్యె! కావున నీవాతనికై మిక్కుటముగఁ బరితపింపకు" మని వచింప, యుధిష్ఠిరుఁ డవ్వచనముల కసహ్యమొంది యద్దేవి నవలోకించి "భవదీయ మంత్రకార్యగోపన మున నిట్టి ప్రమాదము సంభవించె! కావునఁ నిఁకమీఁద స్త్రీ

జనముల మనములకు రహస్యరక్షణశక్తి లేకుండుఁగాక" యని శపించెను.

అనంతరము యుధిష్ఠిరనృపాలుఁ డుభయపక్షముల మృతి నొందిన బంధుమిత్రవర్గముఁ దలఁచియు, భానుసూనునిఁ దలఁచియు శోకవిహ్వలమానసుఁడై నిజానుజులఁగాంచి "తమ్ములారా! నిజాగ్రజవధమును, బంధువధమును సేసి గైకొన్న యీపుడమిని నేఁ బరిగ్రహింపనొల్ల! విపినమున కేఁగి కందమూలఫలాశనుఁడనై తపముసేయుచుండెద. మీర లీరాజ్యముఁ బాలింపుఁ" డని దగ్గుత్తికతోఁ బలికెను. "క్షోణీవల్లభా! దుర్నీతిపరులైన ధార్తరాష్ట్రులను ధర్మమార్గమున జయించి రాజ్యముఁబాలింప నొల్ల ననుట పేలతనముగాదె? బంధువధమునఁ బాతకముఁ సేకూరెనను చింతగలదేని యశ్వమేధాదిక్రతువుల నాచరించి పాపవిమోచనము సేసికొని, దిలీపమాంధాతాది మహీపాలుర వలె ధరణీచక్రము నేలి యశముఁగాంచుము. అట్లుగాక నీవరణ్యమున కేఁగెదేని మేమును నీతో నరుదెంతుముగాని, నిన్ను విడిచి పుడమీపాలనము సేయుదుమె! ధరణి యరాజకమైనచోఁ బ్రజలధర్మవర్తనులగుదురు. అకిల్బిషము మహీపాలునిఁ జుట్టుకొనదే? నీవెఱుఁగని నృపధర్మములు గలవే? కావున నీపేలతనము విడిచి రాజ్యభారము వహింపు"మనుచు భీమార్జున నకులసహదేవులును ద్రౌపదియు నాతని కనేకవిధములఁజెప్పిరి.

ఎవ్వరెంత సెప్పినను ధర్మాత్మజుఁడు "పూజనీయులగుభీష్మ ద్రోణకర్ణాదుల నన్యాయముగ వధించిన పాపము నాకు

తపమునఁ గాని శమింప"దని దృఢనిశ్చితుఁడై పుడమి నేలనొల్ల కుండెను. అప్పుడు కృష్ణుఁడును, వ్యాసనారదాది మహర్షులును "పాండవాగ్రజా! కాలము దీరుటచే భీష్మద్రోణకర్ణాదులు సమసిరి గాని నీవలనఁ జచ్చినవారలుగారు. గాన నీకుఁ బాపముఁ జేకూరదు. నీవు ధర్మముగ క్షాత్రవులఁగెలిచి రాజ్యమును వడసితివి. కావున నిఁక సింహాసనాసీనుఁడవై, నీ పాలనమునకు నిరీక్షించుచున్న ప్రజలనేలి వారలను సంతుష్టాంతరంగులఁజేయుము. నీకింకను బాపభయము గలదేని సకల పాపక్షయకరమగు నశ్వమేధయాగముఁ జేయు" మనుచు ధర్మనందనునకుఁ బెక్కువిధముల నుపదేశించిరి.

అంతట ధర్మతనూజుఁ డమ్మహనీయుల యాజ్ఞ నుల్లంఘింపఁజాలకఁ బట్టాభిషేకమున కంగీకరించి యొక్క శుభదివమున గాంధారీధృతరాష్ట్రాది సకల బాంధవులతోడను మునివర నికరములతోడను గజపురమునకుఁ బయనమయ్యెను.

ఆరాజచంద్రుని రాకకుఁ బౌరులెల్లఱును ప్రమోదభరితమానసులై కస్తూరికలయంపులతోడను, గర్పూరపు ముగ్గుల తోడను, పచ్చలతోరణములతోడను బురము నతిరమణీయముగ నలంకరించి, రాజమార్గమునఁ బాండునూనులు రథారూఢులై యరుగుచుండ, సురభికుసుమములును, మౌక్తికసేసలును వారలపైఁ జల్లుచు, గర్పూరనీరాంజనముల నొసఁగిగౌరవించిరి. ధర్మనందనుఁ డట్లు పురప్రవేశముఁ జేసి, రాజమందిరము సొచ్చి, గృహదేవతారాధనము సలిపి, బ్రాహ్మణసంఘములకు గో,భూ,

హిరణ్యాది మహాదానము లనేకములొసఁగి, కృపాచార్యుని రావించి యాతనిఁ బూజించి, గాంధారీధృతరాష్ట్రుల యనుజ్ఞ వడసి నవరత్న ఖచితసింహాసనమున నాసీనుఁడయ్యెను.

అప్పుడు దుర్యోధన సఖుఁడగు చార్వాకుఁడను దనుజుఁ డొకఁడు విప్రవేషమున నరుదెంచి "పాండవాగ్రజా! ఇటనున్న భూసురులందఱును 'ఈనృపాలుఁ డెక్కడి ధర్మవర్తనుఁడు? రాజ్యకాంక్షియై, సుతులనకే, సహోదరులనకఁ దనవారి నందఱిని౯ జంపి, తన్ను లోకులేమనెదరో యనిరైన శంకింపక రాజ్య మేల నరుదెంచె' నని నిందించుచు నివ్వచనములు నీకుఁ జెప్పు నన్నుఁ బనిచిరి. ఇట్లు శిష్టజనములెల్లఱు నిందించుచుండ నీకింకను రాజ్యమేల" యని పలికెను. కర్ణకఠోరములగునవ్వచనము లాకర్ణించి ధరణీసురులెల్లఱు నివ్వెరఁగంది "భరతకుల ప్రదీపా! ఈదుర్వచనములు మావలనఁ బుట్టినవిగావు. దుర్యోధనుసఖుఁడగు దానవుఁడు సన్యాసివేషమున నరుదెంచి యిట్టి యప్రియోక్తులాడె. ఈనీచుఁడు ప్రలాపించిననేమి? ఉత్తమక్షత్ర ధర్మమున నీవు సముపార్జించిన "యుజ్జ్వలశ్రీ సుస్థిరత నొందెడు" మని యాశీర్వదించి, కోపారుణితలోచనులై యాదనుజునిఁ జూడ, భూసురకోపాగ్నికి వాఁడు విగతజీవుఁడై ఘోరాకారముతో నేలఁగూలెను. అంతట ధర్మతనూజుని చిత్తము కలంకదేరెను.

పిమ్మట ధౌమ్యుఁడు కృష్ణానుమతమున నొక కనకకలశమున భాగీరథీజలముఁ దెచ్చి సమంత్రపూర్వకముగ సకల

జనానందకరముగఁ బట్టాభిషేకసంస్కారము నిర్వర్తింప, ధృతరాష్ట్రుఁడు ప్రసన్నచిత్తుఁడై యాపవిత్రతోయములతో నానృపతిలకు నభిషేకించెను. అప్పుడు వేద ఘోషమును, విప్రాశీర్వాదములును, మంగళతూర్యారవములును మిన్నుముట్టెను.

అంతట ధర్మతనూభవుఁడు పౌరులఁ గృపారసదృష్టి నవలోకించి "పౌరులారా! నాకుఁ దండ్రియు, గురుఁడునగు నీకురునాథునియెడ మీరెల్లరు నెప్పటివలె భక్తితోఁ జరించుచు నమ్మహానీయు నాజ్ఞల నాచరించుచు మీమీ నిలయముల సుఖముగనుండుఁ"డని పలికి, సమరనిహతులైన రాజకుటుంబముల కనేక బహుమానముల నొసఁగి, వారి వారి రాజ్యముల వారివారి సంతతిఁ బ్రతిష్ఠింపఁజేసి, యువరాజపదమున భీమసేనుని నిలపి, దర్పితుల మర్దింపను, బరచక్రములాక్రమింపను నర్జును నిర్దేశించి, సేనలకొలందులు గనుఁగొనుటకు, భృత్యులకు జీవితములు వెట్టుటకుఁ, గర్మకలాపములు సేయించుటకు నకులు నాజ్ఞాపించి, సర్వావస్థలయందుఁ దనసమీపముననుండి రక్షణము సేయ సహదేవుని నియమించి, కర్తవ్యవిచారమునకును, సంధివిగ్రహాదిషాడ్గుణ్యచింతనమునకు విదురుని నియోగించి, బ్రాహ్మణకార్యములకు, శ్రౌతస్మార్తకృత్యసమనుష్ఠానమునకు ధౌమ్యుని నియోగించి కొలువుఁ జాలించి యన్నదానముతో సకల జనములఁ దృప్తులఁజేసెను.

ఇట్లు ప్రాప్తసామ్రాజ్యుఁడై పాండవాగ్రజుఁడు గాంధారీధృతరాష్ట్రులకుఁ బ్రణామము సేసి "ఇప్పుడమికిఁ బాలకులు

మీరలు: నేను మీపనుపు సేయుచు, మీరు చెప్పినయట్లుఁ గుడిచి యుండఁ గలవాఁడ" నని భక్తిపూర్వకముగఁ బలికి, పతివిహీనలైన వారి కోడండ్ర నతిగౌరవముగ నాదరించి, వాసుదేవు నవలోకించి వినయమునఁ గేలు మొగిచి,

తే. "అమలభవదీయ సుప్రసాదమునఁ జేసి
పితృపితామహాక్రమయోగ్య పీఠమైన
వినుతసామ్రాజ్యమున నేను విభుఁడనై కృ
తార్థతానందపూర్ణుఁడనైతి కృష్ణ."

అనుచుఁ బ్రియభాషణములచే న ద్దేవునిఁ బ్రీతునిఁ జేసి, నిజానుజుల నవలోకించి,

మ. "అటవీదేశము లందు గాఢబహులాయాసంబులం గంది దు
ర్ఘటము ల్వైశ్యరు సేవఁగుంది బహుసంగ్రామంబులన్ విద్విష
త్పటునానాస్త్రమహోగ్రశస్త్రచయ నిర్భగ్నాంగతం బొంది యు
త్కటదుఃఖంబుల మీరలొందితి రభేద్యస్థైర్యులై నాకుఁగాన్."

నన్నుఁ గృతకృత్యుఁ జేసితిరి. కృష్ణప్రసాదలబ్ధమైన యీ జయశోభనము నిజేచ్ఛాకలిత సుఖావాప్తిలీల ననుభవించుచు నాత్మప్రియప్రకారముల వర్తించుచు నవధానముతో రాజ్యాంగ సప్తక మరయుం" డనుచు వారల నభినందించెను.

అనంతర మొక్కనాఁడు ప్రభాతసమయమున నజాతశత్రుఁడు వాసుదేవుఁడు శయనించిన మందిరమున కరిగి, హేమపర్యంకమున శయనించి యున్న యా జలధరశ్యాము నవలోకించి ముకుళితకరకమలుఁడై "అంబుజాక్షా! రాత్రి సుఖనిద్ర నొందితివా? త్రిభువనవ్యాప్తవిక్రముఁడవగు నీ కటా

క్షమ కలిమిగాదే జగత్త్రయసంభావనీయుఁడనై వెలింగితి” ననుచుఁ జేరఁబోయి, తన వచనముల కద్దేవుఁడు మాఱు పలుక కనివాతనిశ్చలదీపప్రకారమున నుండుట నుపలక్షించి విస్మితుఁడై “ఈ పరమపురుషుఁ డిట్లుండుటకేమి కారణ” మని యోజించుచుండెను. కొంతతడవునకుఁ బాంచజన్య ధరుఁడు చిఱునగవుతో యుధిష్ఠిరనృపాలు నవలోకించి,

సీ. “గంగ యెవ్వనిఁ దనగర్భమునం దతి
శ్లాఘాసమేతయై సంభరించె
భార్గవుఁ డెవ్వనిఁ బరమశిష్యుఁడుగాఁగఁ
బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె
నారాముఁ డెవ్వనితోఁ బోరి యిరువది
మూఁడుదినములకు వాఁడిదొలఁగెఁ
గాశీశుకన్యలు కారణంబుగఁ బోరి
యెవ్వనికోడి రనేకనృపులు
వేదములు నాలుగును ధనుర్వేదమును మ
హాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె
నట్టి భీష్ముండు నన్నిప్ప డాత్మఁ దలఁచు
చునికిఁ దద్గతమయ్యె నామనము నధిప.

క. శరతల్పగతుం డతఁడే
శరణంబుగ నాశ్రయించి సద్భావవ్యా
ప్తిరతుండగుటను వినుత
త్పరత నతనియందు నాదుభావం బెలసెన్.

అక్కారణమున నీ రాక నెఱుఁగనైతి” నని పలికి యానృపతి సందియము వాపి “ధర్మనందనా! ఉత్తరాయనముఁకొఱకు వేచియున్న గాంగేయుని పాలికి నీ వరిగి, సర్వవిద్యాధార

ఖ్యాతుఁడగు నమ్మహాపురుషునిచే సకల ధర్మములు దెలిసికొని, విశ్లేషనిరస్తసంశయుఁడవగు" మని చెప్పెను. అంతట ధర్మతనయుఁడు పితామహుని పాలికిఁ దన బంధువర్గములోడను, శ్రీకృష్ణునితోడను బయలుదేరెను.

అప్పుడు శరతల్పగతుఁడై యున్న యా దేవవ్రతుఁడు తన మనమున ముకుందుని చరణారవిందములు నిలిపి,

సీ. "శుచియును హంసుండు శుచిషత్తుఁబరముఁడుఁ
బరమేష్ఠియును నగు ధవ్యుఁ గొలుతు
మునులును సురలు నెవ్వనియున్న రూపెఱుం
గరు సర్వవిదుని నప్పురుషుఁగొలుతు
శ్రుతులు సెప్పఁగ మహామతులు దుఃఖౌషధం
బుగ నెఱింగెడు పుణ్యమూర్తిఁ గొలుతు
లోకంబులెల్లఁ గల్గుట నిల్చుటొందుగుట
తనయందయగు మహోత్తరునిఁ గొలుతుఁ
బక్షిరత్నచయంబుఁ బుష్పవ్రజంబుఁ
బంజరము త్రాడునారయుపాశ్రయముగ
నందుచాడ్పున విశ్వంబు నుండుటకు సు
ఖాస్పదంబగు పుండరీకాక్షుఁ గొలుతు.

మ. యదువంశంబున వాసుదేవుఁడనఁ గ్రీడార్థంబు జన్మించి దు
ర్మదదైత్యావలిఁగూల్చి పార్థునకు సారథ్యంబు త్రైలోక్య స
మ్మదమారంగ నొనర్చి దేవముని సమ్మానోద్ధృతిఁ భూధరం
బుఁదొలంగించిన చక్రి నంబురుహనాభుంగొల్తుఁ గృష్ణాత్మునిన్."

అని ధ్యానించుచుండ, కృష్ణ యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవ విదుర ధృతరాష్ట్రాదులచటి కరుదెంచిరి.

అప్పుడు కృష్ణుఁ డమ్మహానీయు నవలోకించి "కురువంశ
శేఖరా! మేనినిండ శరములు గ్రుచ్చుకొని పీడించుచుండ
నంపశయ్యపైఁ బరుండియు, నుత్తరాయనము వచ్చువఱకుఁ
బ్రాణము విడువననుట మహాపురుషుఁడవగు నీకుఁగాక నొరు
లకు శక్యంబే? ఇఁక నేఁబదియాఱుదివసములకు నుత్తరాయ
నము ప్రవేశమగు. నీవప్పు డిత్తనువు విడిచి పరమపదవి
నొందుదువు. వసువులు గగనమున విమానారూఢులై నీరాకకుఁ
బ్రతీక్షించుచున్న వారలు. సకల విద్యాధారభూతుండవగు
నీ వస్తమించిన నీ ధాత్రి యస్తమితసుధాగభస్తియగు
రాత్రియుఁ బోలెనగు; సమస్తజ్ఞానములు ననాశ్రయములై
పొనుంగు పడుఁగావున నీ విప్పుడు, బంధువధము సేసినందులకు
శోకసంతప్తమానసుఁడై యున్న యీపాండవాగ్రజునకు సర్వ
ధర్మములు నుపదేశించి దుఃఖోపశమనము సేయువలయు"
నని పలికెను. దేవవ్రతుఁడు కృష్ణసందర్శనమునకుఁ బ్రమోద
భరితమానసుఁడై కరకమలములు మొగిడ్చి "వాసుదేవా!
భక్తవత్సలా! భవదీయవచనామృతపూరములఁ గ్రోలుటచే
హర్షపూరితాంతఃకరణుఁడనైతి; విషానలసదృశములగు శర
ములు నిరతము పీడించుచుండుటచే నా సర్వాంగములు,
నంతరంగమున వశములై యుండె; ఇట్లు శరపీడితగాత్రుఁడనై
సంభాషణశక్తిహీనుఁడనై యున్న నాయెడఁ బ్రసన్నుఁడవై
యుధిష్ఠిరునకు బోధింపవలసిన ధర్మములు నీవే బోధింపుము.
నీవుండ నేనుబోధించుట, గురుఁడుండ శిష్యుఁ డుపదేశించిన

విధముగాదె ?" అని వచింపఁ గృష్ణుఁడు "అనఘా! నీకు శర ములవలన బాధయు, క్షుత్పిపాసలును లేకుండునటుల నేను వర మొసఁగుచుంటి. సుఖాత్ముఁడవై ధర్మతనూజునకు సకల ధర్మములు నుపదేశింపుము. ఈ పరమయశము నీకుఁ గలిగింప నెంచి ధర్మోపదేశమునకు నియమించితిని. నీ యుపదేశ వాక్యములు వేదతుల్యములై ఘనకీర్తి నెలయుచుండు" నని చెప్పెను.

అంతట భీష్ముఁడు కృష్ణవరప్రసాదమునఁ దన్ను శరములు బాధింపకుండుటకుఁ బరమానందము నొంది, యాదేవునిఁ గీర్తించి, తనకు నమస్కరించిన యుధిష్ఠిరు నతి ప్రీతి నాదరించి యాతనికి ధర్మోపదేశము సేయ నుపక్రమించి "ధర్మ నందనా! దుర్యోధనాదు లవినీతులై నిన్ను నేక శ్రమలనొందించి, రాజ్యముఁ బంచి యీయ నొల్లనందున నీవు క్షత్రియోచిత ధర్మమార్గము నవలంబించి రణమొనరించి వారలఁ జయించి రాజ్యముఁ గైకొంటివి. దీన నీకేమి పాపముగలదు ? క్షత్రియులు బాహుబలమున రాజ్యము వడసి ప్రజల నేలుట ధర్మముగాని, భిక్షాటనమున జీవించుట ధర్మమే ? మఱియు నృపధర్మములు వివరించెద నాకర్ణింపుము.

చ. యజనము దానకర్మమును నధ్యయనంబును దస్యుహింసయుం
బ్రజ కనురాగమొందఁ బరిపాలనసేఁతయు సంగరంబున
న్విజితనిమిత్తమై నురరక్షించుటయున్ నృపధర్మముల్ గదా
ప్రజలకు నాయువృద్ధి ఘనరంబు సుధర్మున నెల్లిలోపలన్.

క. తరణిశశాంకుల తేజ
స్స్ఫురణము లేకున్న యట్లు భూజనములు ని
ర్భరదురితతఁ జేడ్పడుదురు
నరపాలక విహితపాలనము లేకున్నన్.

క. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ గాన రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్యవి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్.

చ. జనకుఁడువోలె నర్మిలిఁ బ్రజం బరికించుచు షష్ఠభాగముం
గొనునది వారిచేత నరిఁగోటిశుభంబుల నాప్తదత్తులం
గని వనగోకులాకరనగప్రముఖార్థకరంబు లారయం
జనుచు నన్నిటన్ ధరణిపాలుఁడు గన్నిడియున్నఁ బెంపగున్.

క. చోరులచేఁ జెడకుండం
గ్రూరులచేఁ జావకుండఁ గువలయజనులన్
జారులచేఁ జెడకుండ ధ
రారమణుఁడు నేర్పుకలిగి రక్షింపఁదగున్.

క. అరి మిగులఁగొనుట క్రేపులఁ
బోరివాలం బిదికినట్లు భూవరకదుపున్
జెఱవుఁ బెనిచినయట్లగు
నరపతి ప్రజచేత నప్పనముఁ దగఁగొనినన్.

తే. భూతవృద్ధులు ధనలాభములునుగలుగు
ధర్మమునను రాజనువాఁడు ధర్మరక్ష
కై జనించెను గావున నతఁడరోష
కాముఁడై ధర్మనిరతుఁడు గాఁగవలయు.

మ. పరనారీగమనాదిదోషములు భూపాలుండు సేయంగఁ ద
ద్ధరకున్ వర్షము లేకయుండుఁ బ్రజకున్ దైన్యంబువాటిల్లుఁ జె
క్కుఱజల్ సైకొను [illegible]
ద్ధురసైన్యంబుల శత్రులొత్తుదురు బంధుశ్రేణికిం జేటగున్.

క. కాని చెయిదములు సేయక
సూనృతధర్మమున నడచు నుర్వీశుఁడు సం
తానము బంధులుఁ బ్రజయును
దానును సేమలును శుభము దలకొనఁ జేర్చున్.”

అనుచు వివిధరాజధర్మములును, ననేక యితిహాసములును నుపదేశించెను.

## —* అ ను శా స ని క ప ర్వ ము *—

ఇట్లు దివ్యజ్ఞాన దేదీప్యమానుఁడైన శాంతనవునిచే ననేక ధర్మముల నాకర్ణించియు ధర్మతనూజుఁడు “పితామహా! నాకింకను ధర్మోపదేశము సేయు” మని యడిగెను. దేవవ్రతుఁ డా భూమీశుని యెడఁ బ్రీతుఁడై,

సీ. అఖిలజగత్ప్రభు వగు దేవదేవు న
నంతునిఁ బురుషోత్తమాభిధాను
నంచిత నామ సహస్రకంబున సంస్తు
తించుచు సంతతోద్ధితమనస్కుఁ
డై యజమానుఁ డవ్యయుఁడైన యాతని
నర్చించుమను దృఢధ్యాననిరతుఁ
డగుచు నమస్కృతి యాచరించుచు ననా
ద్యంతు నవ్విష్ణు నధ్యక్షు నెల్ల

తే. లోకములకు బ్రహ్మణ్యుఁ ద్రిలోకకీర్తి
వర్ధనుని సర్వధర్మజ్ఞవరను లోక
నాథు భూతభవోద్భవు నమ్మి భక్తిఁ
గొలిచి సర్వదుఃఖంబులం దొలఁగఁద్రోచు.

తే. ప్రస్తుతులఁ బుండరీకాక్షుఁ బరమభక్తిఁ
దలఁచి యర్చించుట యనాకులతంబు సర్వ
ధర్మములకును సమధికతమము నైన
ధర్మ మింతయెఱుంగుము ధర్మతనయ.

తే. వినుము దానంబుఁ దపమును వృద్ధసేవ
నమున హింసయు నియతకృత్యములు సర్వ
జనుల కిమ్మహాగుణములు మనమునందు
దృఢముగా నిల్పి నడపుము ధీరవర్య.

సీ. ఎప్పుడు ధర్మంబు నెడ నాదరముగల
వానికిఁ గాలంబు దాన యిచ్చు
ధర్మతత్త్వప్రబోధముఁ బరిస్ఫుటముగాఁ
గావున సుస్థిరభావశుద్ధి
సహితతపశ్శ్రుతస్నానదాన జపంబు
అను దేవతాపూజలను నమోఘ
కాలుఁడై వర్తింపఁగా ధర్మయోగంబు
సమకూరు ధర్మంబు సాధనత్వ

తే. మొంది చేయించికొని చెప్పఁబొందు నిర్మ
లాత్మకుండు సంసారపారాత్మకంబు
సత్యమజరామరము బోధనిత్య మవ్య
యము పరానందమగు నప్పదంబు ననఘ.

తే. కను వెలుంగు వేదవ్యాసమునివరుండు
నధిప కృష్ణుండు నీకుఁ బరాయణంబు
చింత దిగఁద్రావి పాలింపు శాంతవృత్తిఁ
బ్రజల సర్వంబునందును విజయివగుము.

నే నెఱిగిన ధర్మము లన్నియు నీ కుపదేశించితిని. నీ వింక గజపురమున కరిగి, యయాతి, మాంధాతాది చక్రవర్తుల వలెఁ బెక్కుమఖముల నాచరించుచు యశోవంతుఁడవై, ధర్మైక నిష్ఠుఁడవై, ప్రజారంజకుఁడవై మహీపాలనము సేయుము. అర్కుఁ డుత్తరాయణగతుఁ డైనతోడనే మరల నాకడ కరుదె" మ్మని సప్రేమముగఁ బలికెను. అంతటఁ బాండు

సూను లా దేవవ్రతునకుఁ బ్రణామము సేసి, యమ్మహనీయు ననుజ్ఞవడసి, కృష్ణ, ధృతరాష్ట్రులఁగూడి కరిపురమున కేఁగి సుఖముగఁ గాలము గడపుచుండిరి.

ఇట్లుండఁ బంచాశద్దినానంతరమున వాసరపతి యుత్తరాయణగతుఁడుగా, ధర్మనందనుఁడు మరల సకలబాంధవులఁ గూడి భీష్మునిఁ శరశయనస్థానమున కరిగెను. భీష్మనిర్యాణ కాలము నెఱిఁగి నారద, దేవల, వ్యాసాదిమహామునులును నచటి కరుదెంచిరి.

అప్పుడు మందాకినీనందనుఁడు ధృతరాష్ట్రు నవలోకించి "కుమారా! నీసుతు లతినీతులై యుధిష్ఠిరునకు రాజ్యముఁ బంచి యీయనొల్లనందున నిట్లు కులక్షయము సంప్రాప్త మయ్యె! కృష్ణద్వైపాయన మునీంద్రునిచే నీవు సమస్తధర్మములు నెఱిఁగినవాఁడవు గావునఁ గడచినదానికిఁ జింతిల్లక, నీయెడ భక్తితోఁ జరించుచున్న యీపాండునందనులనే నీతనయులుగ నెంచి వీరియెడఁ గరుణాళుఁడవై వర్తింపుచుండు" మని చెప్పి, వాసుదేవు నవలోకించి కృతాంజలియై

తే. "దేవదేవ జీవాత్మక దేవవంద్య
శంఖచక్రగదాపద్మ చారుహస్త
వాసుదేవ త్రివిక్రమ వరద పరమ
పురుష ప్రణుతిసేయు నర్చెదఁ గరుణఁ జూడు.

ఆ. బలము నీవ నాకు భక్తుండ నీయెడ
నాలుబిడ్డలేని యట్టివాఁడఁ
గాన నన్ను నధిక కారుణ్యమున నిమ్మ
నుజ్ఞఁ గమలదళమనోజ్ఞనయన."

అని వేడఁ, గృష్ణుఁ డా దేవవ్రతు వదన మత్యాదరమున నాలోకించి "మహాపురుషా!

ఆ. కీడొకప్డు లేదు కృతపుణ్యుఁడవు తండ్రి
వలని భక్తిపెంపు గలవు దానఁ
గాన బంటుఁబోలె గాంగేయమృత్యువు
నీవశమున నిలిచె నిర్భరముగ."

నీకనుజ్ఞ నొసఁగుచుంటి. ఇఁక దివమున కరిగి వసువులఁగూడి సుఖింపు" మని పలికెను. అంతట గాంగేయుఁడు ప్రమోదిశాంతఃకరణుఁడై, విదుర ధృతరాష్ట్ర యుధిష్ఠిరార్జునాదుల నందఱిని జేరఁదీసికొని "మీయందఱిచే ననుజ్ఞాతుఁడఁగదా" యనిపలికి, తొల్లి తాను భూపాలుర జయించి తెచ్చిన ధనమును భూసురోత్తములకొసఁగి, ధారణానుక్రమమున సమాహితాత్ముఁడై వాయువుల సన్నిరుద్ధము సేయ నవి యూర్ధ్వగతిం గైకొనియె. ఆమహాత్ముఁ డవయవములఁ బ్రాణములు వాసికొనుచు నేఁగుచుండ నాయాచోట్లు శల్యరహితములగుచుండెను. అచ్చటివారెల్ల అదిగాంచి విస్మయావేశితమానసులై యా తపోధనసత్తముని మహిమం బ్రస్తుతించిరి. అంత నా సంయమచతురునిచే నర్వాయతనసన్నిరుద్ధంబై యాత్మ మూర్ధము భేదించి మహోల్కాకారమున నాకసమున కెగసి కొంతదవ్వేగి యంతర్హితమయ్యె! ఆసమయమునఁ గుసుమవర్షము గురిసెను. దేవదుందుభులు మొరసెను. అంబరమున సిద్ధసాధ్యులు హర్షపూరితమానసులై కీర్తించుచుండ మాఘమాసమున శుక్లపక్షమున నేకాదశీ పుణ్యదివసమున నద్దేవ

వ్రతుండు పరమపదము నొందెను.

అంతటఁ బాండుసూను లామహాత్ముని పుణ్యశరీరము నత్యంతభక్తితోఁ దీసికొనిపోయి, చందనాగరుకాష్ఠములతో దహనసంస్కారము సేసి భాగీరథీతీరమునకుఁజని, భీష్మహితార్థముగా నచ్చట విప్రసమూహమున కనేక మహాదానముల నొసఁగి, సకలబాంధవులఁగూడి యమ్మహానుభావున కచ్చటఁ దిలోదకప్రదానము సేసిరి.

అప్పుడు భాగీరథీదేవి తనపుత్త్రునిఁ దలఁచి శోకవిహ్వలయై "పితృభక్తిపరాయణుఁడును, దృఢవ్రతశీలుఁడును, నార్యసమ్మతుఁడును, విద్యాపరిశ్రమఘనుఁడును నగు శాంతనవుఁడు సమరమున శిఖండివలన నిట్టులగుటఁ గాంచియు, వజ్రమయమగుటచే నాహృదయము వ్రయ్యలుగాక నిలిచి యుండె" ననుచు విలపింప, వ్యాస, వాసుదేవు లద్దేవి నుద్దేశించి

తే. "నీవు శోకంబుదక్కుము నీసుతుండు
పరమగతినొందె శాపసంప్రాప్తిఁజేసి
వసువు మర్త్యుఁడై వర్తించె నసదృశప్ర
భావుఁ డాతఁడు వగపేల దేవినీకు.

చ. అతనిశిఖండిచేఁ గెలుప నమరాధిపుఁడైన సమయింపఁజాలఁ డా
యతఁడు నిజేచ్ఛఁజేసి నరునంచితదివ్యశరంబు లంగసం
గతములుసేసి పాన్పుగ సుఖస్థితి మృత్యువుమాన్చియుండి
ప్ర్యతిశయమొంది తావలచినప్పుడు వోయె విషాదమేటికిక్"

అని చెప్పి యూరడించిరి.

## —॥ అశ్వమేధపర్వము ॥—

యుధిష్ఠిరనృపాలుఁడు పితామహునకుఁ బరలోకక్రియల

నాచరించి యాతుచిత్వ నివృత్తికై గంగాతీరమునఁ బటగృహ నిర్మాణముసేయించి యచ్చట నివసించుచు, భీష్మ, ద్రోణ కర్ణాదులఁ దలఁచి యింకను దుఃఖాక్రాంతచిత్తుఁడై యుండ వ్యాసవాసుదేవు లానృపచంద్రు నవలోకించి "పాండవాగజా! బంధువులు శోకించిన మృతకోటికిఁ బరితాపము వాటిల్లు. పితామహునిచే సమస్తధర్మములు నెఱిఁగియు నిట్లు చింతింపఁదగునే? ఇంకను నీకుఁ బాపశంకగలదేని యశ్వమేధ యాగముఁ జేసి, శ్రీరామ, పూరు, భరతులఁబోలె సద్యశోవంతుఁడవుగ" మ్మని యుపదేశించిరి. అప్పుడు ధర్మతనూజుఁడు అశ్వమేధయాగ మధికదక్షిణాన్వితముగఁ జేయవలసి యుండె; నాకడ నిప్పుడు ధనములేదు. దుర్యోధనుఁడు ధనమంతయు దుర్వ్యయముసేసి బండారమును బాడుసేసె; మహీవలయమునఁ గల రాజులెల్లరు నీమహాసంగ్రామమున నిహతులగుటఁ జేసియు, వారి సంతతివారలు పిన్నవయస్కులై, దుఃఖాక్రాంతచిత్తులై పుడమినేలుచుండుటఁ జేసియు వారలవలన ధనాహరణం బత్యంతాకరణీయమును, దుర్లభమునై యుండె. కావున నేనిప్పుడు క్రతువునకుఁ జాలిన ధనము నెవ్విధమున నార్జింపఁగలవాఁడ" నని వచింప వ్యాసుఁడు "ధర్మనందనా! తొల్లి మరుత్తుఁ డను మహీపాలుఁ డొకఁ డశ్వమేధయాగముఁ జేసి భూసురనికరమున కనేక ధనరాసులను దానమీయ వారలాధనమంతయుఁ దమ గృహములలో దాచుకొనఁజాలకఁ దమకు వలయునంత

గృహములకుఁ దీసికొనిపోయి కడమ ధనమంతయు హిమ
వన్నగమున నొక్కచోట నిధిగా నిక్షేపించి "కాలాంతర
మున నీనిధి నెవ్వరు కనుగొనెదరో వారిదే యీ ధన" మని
యొండలు నేక గ్రీవముగఁ బలికియుండిరి. కావున నీవిప్పు డా
ధనముఁ దెచ్చి సుఖము నాచరింపు" మని చెప్పి నిజాశ్రమ
మున కరిగెను. పిమ్మట యుధిష్ఠిరుఁడును తన వారలఁగూడి
హాస్తిపురమున కరుదెంచి సకలబాంధవులు మోదముఁ బొంద,
జనులు సభినందింప వసుంధరాపరిపాలన ధురంధరుఁడయ్యెను.

కృష్ణుఁడును కొన్ని దినములు ధనంజయునితో నిచ్ఛావిహా
రములు సలిపి, పిమ్మటఁ దారుకిఁ ద్వారకానగరమున కేగ
వలయు నని చెప్పి పాండవుల నంగీకరింపఁ జేసి సాత్యకీసహి
తుఁడై నిజపురమున కరిగెను.

పిమ్మట యుధిష్ఠిర నృపాలుఁడు నిజానుజులఁగూడి హిమ
శైలమున కరిగి భక్తిపూర్వకముగఁ గృష్ణద్వైపాయనునిం
దనమనమునఁ బ్రార్థింప నమ్మునీంద్రుఁ డరుదెంచి యాధన
నిధి నా నృపవరేణ్యునకుఁ జూపించెను. యుధిష్ఠిరనృపాలుఁ
డా సువర్ణరాసిని భక్తియుక్తముగఁ బూజించి యనేక వాహ
నములపయిఁ బెట్టించి గజపురమునకుఁ దెచ్చి, "అశ్వమేధ
యాగము సేయింప సకలబాంధవ యుతముగ విచ్చేయు"
మని కృష్ణునిఁ బిలువఁబనిచెను.

ఆశుభవార్త నాలకించినతోడనే మధుసూదనుఁడు వసు
దేవ బలభద్రసాత్యకి కృతవర్మాది సకలబాంధవులఁగూడి.

గజపురమున కరుదెంచెను. అప్పుడు మత్స్యరాజనందనయగు నుత్తరకు విగతప్రాణుఁడై సుతుఁడు జనింపఁ గుంతీ ద్రౌపదీ సుభద్రలు శోకాక్రాంతలై విలపించుచు, కృష్ణునిపాలికిఁ బోయి "వాసుదేవా! పరమపురుషా! భక్తవత్సలా! నీవు మున్ను "ఉత్తరగర్భమునుమాత్రము రక్షించి యీభరత వంశము నుద్ధరింతు" నని మాకభయ మిచ్చియుంటివి. దురా త్ముఁడగు ద్రోణాత్మజుని బాణాగ్నిచే విగతప్రాణుఁడై జనించిన యిబ్బాలునకుఁ బ్రాణదానము సేసి కురుకులము నిలువఁ బెట్టి మమ్మానందింపఁజేయు" మని బహువిధములఁ బ్రార్థించిరి. అంత నప్పుండరీకాక్షుఁడు సూతికాగృహమునకుఁ జని, యబ్బాలశవమును శయ్యాతలమునఁ బెట్టఁ బనిచి, యెల్లఱును వినుచుండ,

క. "నరునియెడ నామనంబున
విరోధ మెన్నఁడును నేవిధముననైనం
బొరయమి నిజమేనియు సు
స్థిరముగ నిబ్బాలుఁ డీన జీవము వొందున్.

తే. మహితసత్యంబుఁ బరమధర్మంబు గాఢ
నిర్మల బ్రహ్మచర్యంబు నిత్యసుప్ర
తిష్ఠితంబులై నాయందుఁ దేజరిల్లు
నేని యిబ్బాలునకు జీవమిపుడ వచ్చు."

అని వచింపఁ దోడనే యబ్బాలుఁడు సజీవుఁడై బాంధవుల నందఱిని హర్షపరిప్లుతాంతరంగులఁ జేసెను. కృష్ణుఁ డాబాలునకుఁ బరీక్షితుఁ డని పేరు పెట్టెను.

అనంతరము యుధిష్ఠిరనృపాలుఁడు కృష్ణు నానతిచొప్పునఁ

దగినవారలచే యజ్ఞోపకరణతతు లన్నియు సిద్ధము సేయించి, మునివరేణ్యులు నిర్ణయించిన శుభలగ్నమునఁ దాను సవన దీక్షితుఁడై యజ్ఞాశ్వరక్షణమునకు విజయుని నియమించి "తమ్ముఁడా! మహీచక్రమునఁ గల నృపతులెల్లను మన సంగ్రామమున నిహతులైరి. కావున నీ విప్పు డీ యశ్వముఁ బట్టవచ్చినవారిని సాంత్వవచనములచే మరలింపుము గాని, శౌర్యముఁ జూపి వధింపకు" మని చెప్పి పంపించెను.

అనంతర మా హయరత్నము ధనంజయుఁడు తనకు రక్షకుఁడై వెంట వచ్చుచుండ ధరణిఁ బ్రదక్షిణాకారమునఁ దిరుగుచు త్రిగర్తదేశము సమీపింప సుశర్మ పుత్రులు పూర్వవైరముఁ దలఁచి ధనంజయునితోఁ బోర నెంచి యుద్ధ రంగమున కడ్డము వచ్చిరి. సవ్యసాచి వారితో నని సేయ నొల్లకఁ దన యగ్రజు నాజ్ఞ సాంత్వనవచనములతోఁ దెలిపెను. వా రవ్వచనముల నాకర్ణింపక రణమున కుపక్రమించి, యమ్మ హాభుజుని పరాక్రమమున కోర్వఁజాలక నాతని శరణుఁ జొచ్చిరి. గాండీవి వారల కభయ మొసఁగి "మఖావలోకన మునకు రం" డని చెప్పి యజ్ఞాశ్వము ననుసరించి వెడలెను.

పిమ్మట న య్యశ్వరాజము ప్రాగ్జ్యోతిషపురపరిసరమున కరుగ భగదత్తతనయుఁడు దానిఁ బట్టి వచ్చె. కవ్వడి సాంత్వన వచనములకు మరలక దర్పమునఁ గొంతతడ వాయోధనము సేసి విజితుఁ డయ్యెను. అప్పుడు ఫల్గునుఁడు కరుణాతరంగిత స్వాంతుఁడై యాతని నవలోకించి "ఓ యీ! యుధిష్ఠిర నృపాలుఁ

డశ్వమేధయాగదీక్షితుఁడై యి త్తురంగము పజ్జ నన్నుఁ బుత్తెంచునప్పుడు,

క. "చంపకు మీ రాజుల నను
కంపాతిశయంబు మెఱయఁగా నడపుము నీ
పెంపను కుసుమమునకు నా
పం పొనరించుట యసౌరభముగ నెఱుఁగుమీ."

అని యాజ్ఞాపించెఁ గావున నీయెడ నాకుఁ గ్రోధము లేదు. వైరము విడిచి బంధుజనములఁ గూడి క్రతువీక్షణమున కరుదె" మ్మని పలికి యశ్వము వెంట నేఁగెను

అనంతర మా హయము సింధుదేశప్రాంతమున కరుగ జయద్రథుని బాంధవులు దాని కడ్డువచ్చి పాండవమధ్యముని వచనముల నాకర్ణింపక సమరమున కుపక్రమించి, యాశూర వరేణ్యుని ధాటి కాఁగఁజాలకఁ జిందరవందరలై పోయిరి. అప్పుడు దుస్సల దుఃఖావేశితమానసయై యడలుచుఁ దన పౌత్రునిఁ దోడ్కొనివచ్చి "సోదరా! నీ మేనల్లుని సుతుఁ డగు నీ బాలునెడఁ గరుణాళుఁడవగు" మని వేఁడ నర్జునుఁడు "సోదరీ! ఇప్పుడు నా యల్లుఁ డెచ్చట నున్నవాఁ" డని సప్రేమముగ నడిగెను. "సోదరా! నీరాక వినినతోడనే, మున్ను తన జనకుఁడు నీచేఁ జెడుటఁ దలఁచి భయావేశితమానసుఁడై మరణించె" ననుచు దుస్సల దుఃఖింప గాండీవి దుఃఖపూరితాంతఃకరణుఁడై యామెమస్తకముఁ దన యక్కునఁ జేర్చి "సోదరీ! ఈ రాజ్యకాంక్ష సమస్తపాపములకు మూలమని చింతించుచున్నవాఁడ! దుర్యోధనుఁడు దుర్బుద్ధియగుటచే

మున కిట్టి యిక్కట్లు వాటిల్లె. నీ విఁక నూరడిల్లి యీ బాలు నితోఁ బురి కేఁగి సుఖముగ నుండుము. మఖావలోకనమునకు హస్తిపురమున కరుదె" మ్మని చెప్పి యూరార్చి పంపించి తాను ఘోటకమువెంట వెడలెను.

పిమ్మట నా తురంగరత్నము మణిపూరపురప్రాంతమున కరుగ నా నగరపాలకుఁడైన బభ్రువాహనుఁడు జనకుని రాకకుఁ బ్రమోదితాంతఃకరణుఁడై యెదురు సని భక్తి పూర్వకముగఁ బ్రణామము సేయ ధనంజయుఁ డాతని నాదరింపక "యాగదీక్షయై చనుచున్న యశ్వముఁ బట్టి బాహుబలము సూపక బేలవలె నిట్లు సనుదెంచు నృపతి నృపతియే? ఛీ ఛీ" యని నిరాకరించి పలికెను.

అంత నక్కుమారుఁడు భిన్నాంతఃకరణుఁడై నిజమందిర మున కరుగుచుండ, నురగరాజపుత్రియగు నులూపి మార్గ మధ్యమున నక్కుమారు నెదుర్కొని "కుమారా! నీతండ్రి నీ పరాక్రమము జూడ నభిలషితుఁడై యుండె! కావున నీ విప్పుడు క్షత్రియోచితమైన ధర్మము నవలంబించి యీ కురు సత్తమునితోఁ బోరి మెప్పు గాంచుము. నీ కీయంశము నుప దేశింప నే నిప్పుడు నాగలోకమునుండి వచ్చితి" నని బోధించి సమరమున కాతనిఁ బురిగొల్పెను. ఆ వచనముల నాలించి బభ్రువాహనుఁడు సమరోత్సాహుఁడై హంసధ్వజవిరాజిత మైన తన యరద మెక్కి నిజజనకునితోఁ బోర నేఁగి యశ్వ మున కడ్డుపడెను. అంత నా ధనంజయ బభ్రువాహను లతి

ఘోరముగఁ బోరఁ దొడఁగిరి.

కొంత తడవునకు బభ్రువాహనుఁ డొక తీక్ష్ణశరముఁ బ్రయోగింప ధనంజయుఁడు ధరణిం గూలెను. అంతకు మున్నే ధనంజయుఁడు ప్రయోగించిన శరఘాతమునకు బభ్రువాహనుఁడును మూర్ఛితుఁ డయ్యెను. ఇట్లు తన పతియును, కుమారుఁడును భండనమునఁ బడుట విని యులూపీ సమేతయై చిత్రాంగద యచటికి వచ్చి శోకాతిశయమున నాక్రందనము సేయుచు భుజంగరాజదుహిత నవలోకించి "హా! సోదరీ! నీవు కుమారుని సమరమున కేలఁ బ్రేరేపించితివి? సాధ్వీమణీ! నీ తలంపు పండెనా? ఇమ్మహాపురుషుని సత్వరమునఁ బునర్జీవితుఁ జేయుము. లేనిచో నేను నిమ్మహాత్మునితోఁ బరలోకమున కేగుదాన" ననుచు ననేక రీతుల నడలుచుండ బభ్రువాహనుఁడు మూర్ఛఁదేరి నిజజనకునిపైఁ బడి యనేక విధముల విలపించుచు "పితృహంతకుఁడనగు నాకిఁకఁ బ్రాయోపవేశమే యాచరణీయ" మని నిశ్చయించుచుండెను. అప్పు డులూపి "మీరిట్లు విలపింపవలదు. నేనిమ్మహాశయుని కొఱకు ప్రియము సేయనెంచి యిట్లు గావించితి" ననుచు నొక్క సంజీవనమణిని బభ్రువాహనుని హస్తమున నునిచి "కుమారా! నీవు దీనిని జనకుని వక్షమునఁ బెట్టు" మని చెప్పెను. అంతట బభ్రువాహనుఁ డట్లు సేయఁ బార్థుఁడు ప్రత్యుజ్జీవితుఁడై తన వారలం గృపారసదృష్టితోఁ గలయఁ జూచి కుశలప్రశ్నము సేసెను. అంతట నులూపి గాండీవి

నవలోకించి "జీవితేశా! నే నొక్కనాఁడు గంగాస్నానమున కేఁగిన సమయమున నచ్చటికి వసువులును వచ్చి "అర్జునుఁడు శిఖండినిఁ బురస్కరించుకొనివచ్చి భీష్ము నన్యాయముగఁ బడవైచెను. అట్లు కుత్సితజయార్జనం బొనర్చిన యోధనం జయుని మేము శాపసంతాపితుఁ జేయుదు" మని వచింప నవ్వచనములు భాగీరథియు నంగీకరించెను. నేను వారి పలుకుల నాలకించి తోడనే మదీయజనకుని పాలికిఁ బోయి యవ్వృత్తాంతముఁ దెలుప నతఁడు వసువులకడ కేగి వారిని శాంతింప ననేక విధములఁ బ్రార్థించెను. అంత నా వసువులు ప్రసన్నులై "బభ్రువాహనుఁ డొక్కనాఁడు సమరమున విజయునిఁ గూల్చినంత నాతని కిల్బిషము వాయును. పిమ్మట నతఁడు సంజీవనమణిచేఁ బ్రత్యుజ్జీవితుఁడగు" నని చెప్పిరి. అక్కారణమున నేనిప్పుడు తగిన సమయము సేకూరెనని తలఁచి బభ్రువాహనుని నీతో రణము సేయఁ బురిగొల్పితి నిన్ను విగతకిల్బిషుఁ జేసితి. పితామహుని నధర్మముగ వధించిన పాతకము నీకు నేటితోఁ దీరె" ననుచు సమస్తవృత్తాంతము ను విశదీకరించెను. అప్పుడు చిత్రాంగదా బభ్రువాహన ధనంజయు లయ్యురగరాజపుత్రి ననేక విధములఁ గొనియాడిరి. పిమ్మటఁ బార్థుఁడు బభ్రువాహను నాలింగనము సేసికొని "కుమారా! నీవు జననీ ద్వయముతో మఖావలోకనమునకు ర" మ్మని ప్రియభాషణములతోఁ జెప్పి సప్రేమముగా నానతీద్వయమును వీడ్కొని తురంగము వెంటఁ జనెను

పిమ్మట నాయజ్ఞాశ్వము మగధ, చేది, గాంధారాది సకల దేశములఁ దిరుగుచుండ నాయాదేశపాలకులు సమరమున కరుదేర గాండీవి వారలనందఱి నోడించి ధరణీచక్రమునఁ గల నృపతులనందఱి నధ్వరమునకుఁ బిలిచి తురంగరత్నముతో హాస్తిపురమున కరుదెంచెను. ఇట్లు జయశ్రీవిభాసితుఁడై వచ్చిన యప్పాండవ మధ్యముని గాంచి కృష్ణ, యుధిష్ఠిర, భీమాగులెల్లఱుఁ బరమానంద భరితమానసులై యాతని పరాక్రమమును బెక్కువిధములఁ గీర్తించిరి.

పిమ్మటఁ బౌత్రసమన్వితయై దుస్సలయు, జననీద్వయ సమేతుఁడై బభ్రువాహనుఁడును హాస్తిపురమున కరుదెంచి యుధిష్ఠిరాదులచే మన్ననలనొందిరి. మఱియు మఖావలోక నోత్సుకులై మహీవలయమునఁ గల సకల రాజులును, ముని శ్రేష్ఠులును, దిక్కులఁగల జనములును నరుదేర ధర్మాత్మజుఁ డందఱినిఁ దగురీతిని సత్కరించి మహాఋత్విక్కులు నిర్ణయించిన శుభలగ్నమునఁ దాను వాజిమేధయాగముఁ గ్రమముగఁ జేయ నుపక్రమించెను. వ్యాస ధౌమ్యాద మహనీయు లమ్మహా ధ్వరమును విధ్యుక్తముగ నమ్మహీవల్లభునిచేఁ జేయించిరి. అప్పుడు మంగళ తూర్యములతోడను, బుణ్యాహక రవములతోడను, సంతోషధ్వానములతోడను, విప్రాశీర్వాద నాదముల తోడను దిశలు మాఱుమ్రోగెను.

ఇట్లు ధర్మతనూభవుఁడు నక్రమముగ నశ్వమేధయాగము నిర్వర్తించి పరమపావనమును, సమస్తదురితహరణమును నగు

యవభృథస్నాన మాచరించి, హిరణ్యరజతరత్న రుచిరాంబరాది మహాదానములచేతను, యిష్టాన్న దానముచేతను, సమస్త జనములఁ దృప్తులఁ గావించెను. క్రతువీక్షణార్థ మరుదెంచిన సకల మహీపతులును, కృష్ణ బలదేవాది సమస్త బాంధవులును యుధిష్ఠిరుఁ డొసఁగిన సత్కారములకుఁ బ్రీతులై యానృపాల తిలకు ననుజ్ఞవడసి తమతమ దేశముల కరిగిరి. పిమ్మట దుస్సలయు, బభ్రువాహనుఁడును నిజపురముల కేఁగిరి. ఉలూపియుఁ, జిత్రాంగదయు మాత్రము హాస్తిపురముననే నివసించుచుండిరి.

## —* ఆశ్రమవాసపర్వము *—

యుధిష్ఠిరమహీపాలుఁ డిట్లు పితృపితామహ క్రమప్రాప్తమైన సామ్రాజ్యము జగత్పూజ్య ప్రకారమునఁ గైకొని కుంతీగాంధారీ ధృతరాష్ట్ర కృప విదురులయెడ వినమ్రుఁడై వర్తించుచు, ద్రౌపదికి సౌమనస్యము సేయుచు, ధృతరాష్ట్రుని కోడండ్ర నందరిని గౌరవముగ నాదరించుచు, కన్నబిడ్డలఁబోలె బ్రజలఁ గాపాడుచు ధర్మమార్గమున వసుధాపాలనము సేయుచుండెను. జయలక్ష్మీవిరాజితుఁడై సకలజనానురక్తుఁడై ధరణి నేలుచున్న యా రాజచంద్రునిఁగాంచి కుంతీవిదురాదులు హర్షపరిప్లుతాంతరంగులైరి. ధర్మతనూజుఁడు గాంధారీ ధృతరాష్ట్రులయెడఁ బరమగౌరవము సూపుచు "మీరెల్లరుఁ గురువృద్ధుని పనుపు సేయుచుండవలయు" నని సమస్తజనముల కాజ్ఞాపించుచుండుటచే

సకలజనులు నాతని యాజ్ఞానువర్తులై మెలఁగుచు, దుర్యోధనుని దుశ్చేష్టితముల నెన్నఁడును నాక్రువ్వకుండిరి.

గాంధారీ ధృతరాష్ట్రులేకతంబ యుండు సమయమున వృకోదరుఁడు మాత్రము "మహిమ్మదుములఁ బెట్టిన దుర్యోధనాదులను నిశ్శేషముగఁ బరిమార్చితిని. నాబాహుబలము నెఱుఁగక యీవెఱపటులు కయ్యమునకుఁ గడఁగిరి గాని మదీయ బాహుపంజరము సొచ్చిన నైరిపింహములు మరల వెడల నేర్చునే" యనుచు వారికి వినవచ్చునటులఁ బలుకుచుండెను. గాంధారీ ధృతరాష్ట్రు లవ్వచనములకు మనమున దుఃఖించుచు నూరకొనుచుండిరి. ఇట్లు పంచదశవత్సరములు గడచెను.

పిమ్మట ధృతరాష్ట్రుఁడు వనమున కరిగి తపము సేయ నిశ్చితుఁడై ధర్మనందను యుధిష్ఠిరునిఁ జేరఁ బిలిచి "కుమారా! ఇంతకాలమునుండియు నీవు మాకేలోటియుఁ గలుగనీకుఁ గాపాడుచుంటివి. నీకు నామీఁదఁ గలభక్తికిఁ బ్రీతులమైతిమి. ఉత్తమ రాజవంశజులకు సమరమునఁ జచ్చుటయైనను, లేనిచో వనమునఁ దపము సేయుచు దేహత్యాగము సేయుటయైనను కర్తవ్యములగుటచే నేనిప్పుడు గాంధారీయుతముగ విపినమున కేఁగి తపము సేయ నిశ్చితుఁడనై యుంటి. కావున నీవు మేము తపోవనముకేఁగ నంగీకరింపవలయు" నని చెప్పెను.

ధర్మాత్మజుఁ డవ్వచనముల కులికి "తండ్రీ! ఇంత కాలమునుండియు నీవు దుఃఖములేనివానివలె నాకుఁ గనఁబడుచు మనసమున గాఢపరితాపము నొందుచుండుటచే నిప్పుడు విపినమున

కేఁగెదనని పలుకుచుంటివి. విధివశమున దుర్యోధనాదులకును నాకును గలహము ప్రాప్తమయ్యె! నేనిప్పుడు వారల దుశ్చేష్టితముల నెంతమాత్రమును మనమునఁ దలఁపక, నాకుఁదల్లియుఁ దండ్రియు, గురుఁడును, దైవమును నీవయని నమ్మి నిన్ను సేవించి నాచిత్తతాపము నుపశమింపఁ జేసికొనుచుంటిని. నీవు వనవాసము సేయ నేఁగిన నేనిటనుండి రాజ్యముఁ బాలింపనొల్లను. నీకు వైశ్యాసతియం దుద్భవించిన సుతుఁడును, ధర్మశీలుఁడునునైన యుయుత్సుని రాజ్యాభిషిక్తుని జేయుము. నేనును నీకంటెఁ గాంతారమున కరుదెంచి నీకు శుశ్రూష సేయుచుండెద" ననుచు నాతని చరణద్వయముఁ బట్టుకొనియె. ధృతరాష్ట్రుఁ డాతనిని లేవనెత్తి కౌఁగిలించుకొని "కుమారా! నీవు మనోలోపమును గలుగకుండఁ బెక్కుకాలమునుండియు శుశ్రూషఁ జేయుచుంటివి. వృద్ధుఁడనగుటచే నాకిఁక వానప్రస్థాశ్రమస్వీకరణము కర్తవ్యము. కావునఁ దపోవనమున కేఁగఁ గోరుచుంటిని. నీవు ధర్మమునఁ బ్రజాపాలనము సేయుచు నిటనుండి, నావనగమనము నంగీకరింపు" మని గద్గదకంఠుఁడై పలుకుచు దుఃఖాతిశయమున మూర్ఛిల్లెను. "నావలనఁ గదా యీకురువృద్ధున కిట్టి దురంతసంతాపము సంభవించె" నని యుధిష్ఠిరుఁ డధికపరితాపము నొందుచు శీతోదకముచే నాతని యవయవములఁ దడుపఁ గొంత తడవునకు ధృతరాష్ట్రుఁడు తెలివినొంది "ధర్మనందనా! నాకుఁ బెక్కుమాటలాడ శక్తి లేదు. నీవిఁక నన్ను లజడిఁబెట్టక తపోవనము కేఁగ నంగీకరింపు" మనియె.

అప్పుడు పారాశర్యమునీంద్రుఁ డచ్చటి కరుదెంచి సకల జనముల వినతులఁగైకొని దీవనలిచ్చి యజాతశత్రు నవలోకించి "ధర్మతనూజా! గాంధారీధృతరాష్ట్రులు పుత్రశోకాగ్ని సంతప్తమానసులై తపోవనమున కేఁగఁ దలఁచియుండిరి. తపమువలననే గాని యీదంపతులకుఁ జిత్తశాంతి కలుగదు. పెక్కుకాలము నీవు వీరికిఁ బరమభక్తితో శుశ్రూషఁ జేసియుంటివి. ఉత్తమ రాజవంశజులు సమరమునఁ జచ్చుటయైనను దృఢసమాధిని తనువు త్యజించుటయైనను సమంజసముగాని, వృద్ధులై రోగ తల్పమున మరణించుట యనుచితము గదా! కావున నీవిఁక యీయుంటితలంపు విడిచి గాంధారీధృతరాష్ట్రులు వనవాసమున కేఁగ నంగీకరింపుము." అని చెప్పి యాతని నొడంబఱచి తాను నిజాశ్రమమున కేఁగెను.

పిమ్మట యుధిష్ఠిరపృథ్వీపాలుఁడు ధృతరాష్ట్రునిఁ గని "తండ్రీ! నీవు కడుబడలిక నొందియున్నాఁడవు. ముందు నా ప్రార్థన నాలించి భుజించి పిమ్మట నీ యిచ్చవచ్చినటుల నాచరింపు"మని వేఁడ ధృతరాష్ట్రుఁడు గాంధారీ సమన్వితుఁడై యభ్యంతరావాసమునకుఁ జని దైవసత్కృత్యముల నాచరించి యాహారతంత్రము నిర్వర్తించెను.

అనంతరము ధృతరాష్ట్రుఁడు పురజనులందఱిని రావించి "పౌరులారా! వృద్ధుఁడనగు నాకిఁకఁ దపశ్చరణము కర్తవ్యమగుటచే విపినమున కేఁగ నభిలషితుఁడనై మీయనుజ్ఞ వేఁడుచుంటి"నని పలుకఁ బౌరులెల్లలు దుఃఖాక్రాంత మన

న్కులై కన్నీటితో యాకురువృద్ధున కనుజ్ఞ నొసఁగిరి. పిమ్మట ధృతరాష్ట్రుఁడు రణనిహతులైన బాంధవుల కందఱికిఁ బుణ్యలోకములు సేకూరఁ ననేక మహాదానము లాచరించి గాంధారీసమన్వితుఁడై వల్కలాజినములు ధరించి సర్వపదార్థములుఁ బరిత్యజించి నగరు వెడలెను. కుంతీవిదురసంజయులు వానితో విపినమున కేఁగ దృఢనిశ్చితులై బయలుదేరిరి. యుధిష్ఠిర, కృప, యుయుత్సులును శాసనమునకు బయలుదేర ధృతరాష్ట్రుఁడు వారిని వారించెను. అప్పుడు పాండవులు కుంతీదేవికిఁ బ్రణామములు సేసి "జననీ! నీవు కాంతారమున కేఁగవల" దని పెక్కువిధములఁ బ్రార్థింప నా సాధ్వి "నందనులారా! మాననీయులగు నీవృద్ధదంపతులు వనమున కేఁగుచుండ నే నిటనుండఁ జాలను. వనమున కేఁగి వీరికి శుశ్రూష సేయుచు, తప మాచరించి యుత్తమలోకము వడసెద. మీరలు నాకొఱకు చింతింపవలదు. ఏను తొల్లి దినకరతనూజుని జననము గోపనము సేసి యమ్మహానీయుని కన్యాయము సేసితి. అద్దురాగతము నామనమును నిరంతరము గలంచుచుండె. కావున మీర లమ్మహాత్మునియెడ భక్త్యావేశమానసులై మదీయదోష పరిహారార్థముగ ననేకదానముల నొసఁగుచు, ద్రౌపదికి సౌమనస్యము సేయుచు, ధర్మము నెడబాయక ధరణి నేలుచుండుఁ" డని చెప్పి తాను గాంధారీహస్తముఁ బట్టుకొని నడువసాగెను. గాంధారీధృతరాష్ట్రులును కుంతిని వనమునకు రావలదని వారించిరి గాని, ఆమెవ రెన్ని విధములఁ జెప్పినను నామె దృఢనిశ్చితయై వెనుదిరుగ

దయ్యో! అప్పుడు ద్రౌపదీసుభద్రాది కోడండ్రెల్లరు నశ్రుపూరిత నయనలై కుంతీ గాంధారీధృతరాష్ట్రులకుఁ బ్రణామముసేయ, వారలు తమకోడండ్ర ననునయించి యాశీర్వదించి ముందుకు నడువఁ దొడఁగిరి. ధృతరాష్ట్రుఁడు గాంధారి కరమును, గాంధారి పాండురాజ మహిషికరమును బట్టుకొని నడిచిపోవుచుండ, విదుర సంజయులును, వనమున నగ్నిహోత్ర కార్యముల నాచరింపఁ గొందఱు ఋత్విగ్జనములును వీరివెంట నేఁగిరి. అప్పుడు పౌరులును, బరిచారకజనములును మున్ను పాండవులు విపినమున కేఁగిననాఁడు దుఃఖించినటుల దుఃఖించిరి. పిమ్మటఁ బాండు నందను లశ్రుప్లావితవదనులై వనితాజనములతో మరలి రాజ మందిరము సొచ్చిరి. అంబికేయుఁడు తనవారలతో భాగీరథీ తీరమునకుఁ జని యానాఁటిరాత్రి యట విశ్రమించెను.

ప్రభాతమైన పిమ్మట ధృతరాష్ట్రాదులు కాలోచితకృత్యముల నాచరించి గంగానది యుత్తరించి కురుక్షేత్రమున కరిగి యొక్క యాశ్రమసమీపమున నున్న తరుచ్ఛాయను విశ్రమించిరి అయ్యాశ్రమమున నున్న శతయూపనాముఁ డగు రాజర్షి వారలఁ గాంచి సవినయముగఁ దనపర్ణశాలకుఁ దోడ్కొనివచ్చి యుచితాహారముల నొసఁగి గౌరవించెను. అనంతర మాంబికేయుఁ డచ్చటఁ బర్ణశాలలఁ గట్టించి తన వారితో నచ్చట నివసించుచు తప మాచరించుచుండెను.

ఇట్లు కొన్ని దినములు గడచిన పిమ్మటఁ బాండునందనులు కుంతీ గాంధారీ ధృతరాష్ట్ర విదురులఁ దలఁచి మిక్కుటముగ

దుఃఖించుచు వారల కుశలము నరయు దలంపు గలవారై కురుక్షేత్రమునకు బయలుదేర, దుర్యోధనాదుల పత్నులును ద్రౌపదీ సుభద్రాది కాంతలును వారివెంటఁ బయనమైరి.

పాండవులు సకల బాంధవులఁ గూడి కురుక్షేత్రమున నున్న ధృతరాష్ట్రు నాశ్రమమున కరిగి కుంతీ గాంధారీ ధృతరాష్ట్రులకు నమస్కరించి యశ్రుజలములచే వారి పాదములఁ గడుగఁ గుంతి ప్రేమాతిశయమునఁ దనూజులఁ జేరఁ దీసికొని శిరములు మూర్కొనుచు కన్నీటిచే వారల మస్తకములఁ దడిపి దీవించెను. గాంధారీ ధృతరాష్ట్రులును ప్రేమపురస్సరముగా వారలను దీవించిరి. పిమ్మట ద్రౌపది సుభద్రాది వధూజనము లెల్లను వారికిఁ బ్రణామము లాచరించి యాశీర్వాదములఁ బడసిరి. అనంతర మాంబికేయుఁడు యుధిష్ఠిరు నుద్దేశించి,

సీ. "కుశలివై యుండుదే కురువంశసత్తమ
పౌరజనులు జానపదులుఁ దెఱఁగు
తో నిన్ను ననుసరింతురె తమ్ములందఱు
సుఖముందురే నీకు సఖులు సుఖులె
బంధులు సంతోషభరితులే యిష్టభృ
త్యులు దమకైన కోర్కులు ఫలింపఁ
గ్రాలుదురే హర్ష లీలలఁ బూర్వరా
జన్యుల నడవడి సలుపఁబడునె
నయముతోడి యప్పనముల భండారంబుఁ
బెనుతె యగ్రహార జనులమీఁద
గాలిపైన సుడియుఁగానీక యరయుదే
యనఘ పుణ్యకీర్తు లతిశయిల్ల."

అని కుశలప్రశ్నము సేసెను. "తండ్రీ! నీ కృపావిశేషమున
నన్నియు యుక్తముగ నెఱవేరుచుండె. ఆగానమునకు
సహింపఁజాలని మీశరీరములు తపఃక్రియల నాచరింపనోర్చు
చుండెనే? ధీశాలియగు విదురుఁ డెచటి కరిగె? అనుజన
వరేణ్యునిఁ జూడ నామనము తత్తరఁబడుచుండె" ననుచు ధర్మ
నందనుఁడు బలుక, వైచిత్ర్యవీర్యుఁడు "కుమారా! మే మం
దరముఁ దపోనిష్ఠ నోర్చి సుఖముగ నుంటిమి. విదురుఁ
డీ ప్రాంతమున నిచ్చవచ్చిన స్థానమునఁ జరియించుచు ననిలా
హారుఁడై ఘనతపము సేయుచు నెన్నఁడైన నకస్మాత్తుగ
మాకుఁ గానఁబడుచుండు" నని చెప్పుచుండెను.

అంతలోఁ గాంతారధూళీమలినాంగుఁడును, జటీభూత కేశ
పాశుఁడును, దిగంబరుఁడును నగు విదురుఁ డయ్యాశ్రమ
సమీపమునకు వచ్చి, యచట నున్న జనముల నవలోకించి
మగిడిపోవఁ దొడఁగెను. అజాతశత్రుఁ డమ్మహామహు నవ
లోకించి తా నొక్కరుఁడును సత్వరముగా నవ్వినుతప్రభావుని
వెంటఁ బోవఁదొడఁగెను. విదురుఁడు గుల్మాంతరితుఁ డగుచుఁ
బోవుచుండఁ బాండవాగ్రజుఁ డెలుఁగెత్తి "విదురా! యో
విదురా! నిలువుము. నిలువుము. నేను యుధిష్ఠిరుఁడ; నిన్నుఁ
జూడవచ్చుచుంటి" ననుచుఁ బరుగెత్త సాగెను. విదురుఁ
డవ్వచనముల నాలకించి యొక్క పాదపము సేరి యర్ధ
నిమీలితలోచనుఁడై నిలువ, యుధిష్ఠిరుఁ డచ్చటికి వచ్చి
"నిర్మలాత్మా! నన్నుఁ గనువిచ్చి చూడవే" యని పలికెను.

అంత నత్తపోధనుఁడు కన్నులు విచ్చి యాతనిఁ గాంచి, యుదాత్త యోగబలమున నత్తనువుఁ ద్యజించెను. యుధిష్ఠిరుఁ డది గాంచి యా మహాత్ముని తపోబలమునకు విస్మితుఁడై, యాతని కళేబరమును దహనము సేయ నుద్యమించెను. అప్పు డశరీరవాణి "ధర్మనందనా! యోగి కళేబరమున కగ్ని సంస్కారము సేయఁ జనదు; కావున నీ వి ప్పరమతపోధనుని దేహమును దహనము సేయకు" మని పలికెను. అజాతశత్రుఁ డ వ్వచనముల నాకర్ణించి యా యుద్యమము విడిచి, యాశ్రమమున కరిగి, విదురుఁడు దేహత్యాగముఁ జేసిన విధముఁ దన వారల కెఱిఁగించెను

అనంతర మొకనాఁడు వ్యాసమునీంద్రుఁ డచ్చటికి వచ్చి ధృతరాష్ట్ర యుధిష్ఠిరాదులచే సన్మానితుఁడై యందఱి కుశలము నరసి కుంతీ గాంధారీధృతరాష్ట్రుల నుద్దేశించి "వత్సలారా! మీ మనముల నేమైనఁ గోర్కెగల దేని నాకెఱిఁగింపుఁడు. మీ రెట్టి దుస్తరమగుదానిఁ గోరినను మదీయతపోబలముచేఁ దీర్పఁగలవాఁడ" నని వచింప, వారలు భారతరణమున మృతులైన తమ బంధువర్గమును జూడఁగోరిరి.

అంత నత్తపోధనుఁడు సకలజనములను భాగీరథీతీరమునకుఁ దోడ్కొనిపోయి "మీర లీ నలిలావగాహనము సేసి చూడఁ దలఁచినవారి నందఱిసి జూడుఁ" డనిపలికెను. తోడనే యచ్చటి వారెల్లరు నదిలోనికిఁబోయి దుర్యోధన దుశ్శాసనాది కురుకుమారశతమును, విరాట ద్రుపద ధృష్టద్యుమ్న

ద్రౌపదేయాభిమన్యు కర్ణాది సకల బాంధవులను గాంచి ప్రమోదభరితాంతఃకరణులై యిష్టాలాపములచే నాఁటిసమయముఁ గడపిరి. మఱునాఁడు శూరజనములు మరలఁ దమలోకమున కేగుచుండఁ బాదరాయణుఁడు "పతుల ననుగమింపఁదలఁచిన వారలీగంగాతోయములఁ గ్రుంకుఁ"డని పలికెను. అంతట ధృతరాష్ట్రుని కోడండ్రు నూర్వురును, మత్స్యరాజనందనయుఁ దక్కుంగల విధవాంగనలెల్లరు నప్పవిత్రతోయముల మునింగి మానుష దేహములఁ ద్యజించి దేవతనువులు దాల్చి తమతమ పతులఁగూడి నాకలోకమున కేఁగిరి.

అనంతరము సాత్యవతేయుఁడు, బంధుసందర్శనమునఁ బ్రమోదితాంతఃకరణులై యున్న ద్రౌపదీ సుభద్రాది కాంతలను, పాండునందనులను, కుంతీ గాంధారీ ధృతరాష్ట్రులను దోడ్కొని యాశ్రమమునకువచ్చి "యుధిష్ఠిరుఁ డిచ్చటికివచ్చి నెలదినములు గడచె. ఇఁకఁ దడయక నీతని హస్తిపురమున కంపు"మని ధృతరాష్ట్రునకుఁ జెప్పి తానునిజాశ్రమమున కేఁగెను. పిమ్మటఁ గుంతీగాంధారీధృతరాష్ట్రులు తమ్మువిడిచిపోవఁ జాలకయున్న పాండవులను, ద్రౌపదీసుభద్రాది కాంతలను బుజ్జగించి కరిపురమునకుఁ బంపించి, అగ్నికార్యములు ఋత్విగ్జనములు సక్రమముగ సేయుచుండఁ దామెప్పటియట్లఁ దపముసేయుచుఁ గాలముఁ గడపుచుండిరి.

ఇట్లుకొన్ని దినములు గడచినపిమ్మట నారదమునివరేణ్యుఁ డొక్కనాఁడు గజపురమున కరుదేర యుధిష్ఠిరుఁ డత్తాప

సోత్త్రము సర్వారీతిఁ బూజించి "మునీంద్రా! ఎందుండివచ్చు చుంటిరి? తపోవనమునను్న కుంతీగాంధారీధృతరాష్ట్రుల కుశలవృత్తాంతము మీ కేమైనఁ దెలియునే" యని యడిగెను. "నృపకుంజరా! మీతండ్రి తనవారలఁగూడి మున్న నివసించు చున్న యాశ్రమము విడిచి, గంగాద్వారపరిసరారణ్యమున కరిగి యచ్చట నాశ్రమ మేర్పఱచికొని వాయుభక్షణుఁడై కొన్ని దినములు యుగ్రతపము సేసెను. ఇట్లుండి యొకనాఁడు వారలు గంగాద్వారమునఁ గృతస్నానులై యాశ్రమమునకు వచ్చుచుండ మహాదావాగ్నిదూ్భతమై యనల మావ్రిపినమును జుట్టుముట్టెను. నిరాహారులగుటచే వారలమ్మహానలమును దప్పించుకొని పరుగిడ శక్తిలేనివారై యుండిరి. సంజయుఁడు వారిని విడిచిపోవనొల్లకుండ ధృతరాష్ట్రుఁడు "సంజయా! నీ వీ యనలముఁ దప్పించుకొనిపోవఁజాలియుఁ బోకున్నఁ బాపము సేకూరు; గావున నీ వెచ్చటికైన బరుగిడి ప్రాణముఁగాపాడు కొను"మని చెప్పి పంపించెను. సంజయుఁ డొక్కతెఱపిఁ జూచి హిమశైలము నధిరోహించి ప్రాణముఁ గాపాడుకొనియె. అంతట మీతల్లులుఁ దండ్రియుఁ బ్రాఙ్ముఖాసీనులై సమాహితచిత్తులై రి. తోడనే యగ్ని వారలఁ బొదివి దహింప నమ్మువ్వురుఁ బరమపదవి నొందిరి. అనంతర మీ వృత్తాంతము నాకవ్వనమునసుండు మునులు దెలుప విని వారల కళేబరముల నవలోకించి వచ్చితి" ననుచు నారదుఁడు ధృతరాష్ట్రప్రభృతుల మరణవృత్తాంతము యుధిష్ఠిరునకుఁ దెలి

వెను. ఆదుఃఖవార్త నాలించి పాండునందనులును వనితా జనములును శోకవిహ్వాలమానసులై యాక్రందనము సేసిరి.

పిమ్మట యుధిష్ఠిరుఁడు నారదు నవలోకించి

సీ. "ఎఱుఁగంగవచ్చునే యెవ్వరి కెత్తఱి
నేదపయగునో మునీంద్ర యేము
గలుగంగ దెసలేని పేదమానిసికిఁబోలె
నక్కురువృద్ధున కట్టిచావు
పాటిల్లె సముదీర్ణబాహువరోజ్జ్వలు
లైనపుత్త్రులు నూర్వురట్లు గలిగి
బలము నాగాయుతప్రాణసమంబగు
నమ్మహారాజట్టి యడవిచిచ్చు
వలనఁ దెగటారె నేమనఁగలదు కమల
ముఖులతాలవృంతానిలముల సుఖించు
ప్రభువె కంకగృధ్రావళీ పక్షవాయు
వసర నిలఁబడియున్నవాఁ డకటకటా.

సీ. "వల్లభుఁ డొక్కసద్వ్రతముఁ బూనినఁ దానుఁ
దద్వ్రతమూని గాంధారి యతని
పోయినగతిఁబోయె నాయమకై యుంతె
వరసఁ బుత్త్రుల రాజ్యవైభవంబు
విడిచి యేమోమక యడవికిఁబోయిన
తల్లికి వగచెన ధర్మసుతుఁడు
భిమసేనుండును బీభత్సుఁడును దన
కడుపునఁబుట్టిన కొడుకులట్టె
యునదతనమునఁ దాను గార్గిఁగాలె
నట్లె యనాథయై దీనికి నంతరంగ
మలఁదురకతల్లడిల్ల కీయూరటమున
నడుక కలమటఁ బడక యెట్లుండుఁజెపుమ.

మఱియు సమ్మాననీయులు కార్చిచ్చుచే దగ్ధులైరిగదా! తదీయ దోషపరిహారార్థముగ నే నేమిసేయవలయు నని పలుక నమ్మునీంద్రుఁడు "రాజోత్తమా! ధృతరాష్ట్రుఁడు తనకు శాంతి యొక్కటైనఁ గానమిఁ దొలిదినముననే యగ్ని నుచిత రీతి నుపాసించి యిష్టిసేసి వీడ్కొనియెను. యాజకజనము లయ్యగ్నిచయము నరణ్యమున నుద్వాసించి యథేచ్ఛం జనిరి. ఆయగ్నియే ప్రజ్వరిల్లి వనమును, కుంతీగాంధారీధృతరాష్ట్రులను దహనముసేసెను. ఇవ్విధమున నమ్మువ్వురు నాత్మాగ్నిచే దగ్ధులై పుణ్యలోకమున కేఁగిరి గావున నీవు తదీయ శాంతికై యేమియుఁ జేయఁ బనిలేదు. చింతవిడిచి వారలకుఁ దిలోదకప్రదానము చేయు"మని చెప్పి దుఃఖోపశమనము సేసి యథేచ్ఛం జనియె.

పిమ్మట యుధిష్ఠిరుఁడు "మూఁడు వత్సరములు కుంతీగాంధారీధృతరాష్ట్రులు విపినమునఁ దపముసేసి పరమపదము నొంది"రని పౌరులకుఁ దెలియఁజఱచి, సకలబాంధవులతో భాగీరథీతీరమున కరిగి వారికిఁ దిలోదకప్రదానముసేసి, భూసురోత్తముల కనేక మహాదానముల నొసఁగి పరలోకక్రియల నాచరించి, రాజ్యముఁ బాలించుచుండెను.

## — మౌసలపర్వము —

ఒకనాఁడు ద్వారకానగరమునకుఁ గణ్వ, నారద విశ్వామిత్ర మహర్షులు హరిసందర్శనార్థము వచ్చి రాజమార్గమున నేఁగుచుండ యదుకుమారులు కొంద ఱవలోకించి, విధిప్రేరితులై

దుండగమునకుఁ దొడఁగి, కృష్ణుని తనూజుఁడగు సాంబునకు స్త్రీవేషము వేసి తెచ్చి, కపటవినయముతో సన్మునులకు నమస్కరింపఁజేసి "మహామహులారా! ఈకాంత బిడ్డలఁ గనునే!" అని యడుగ సన్మునులు క్రోధాత్ములై "ఈసాంబుని కడుపున, సకలయాదవ క్షయాపాదనకల్యమగు ముసలము జనించు" నని శపించి యాథేచ్ఛం జనిరి.

మునులాడు సాంబునికడుపున మహాభయంకరముగ నొక ముసలము జనింప యాదవులెల్లరు భయభ్రాంతులై యావార్త వసుదేవున కెఱింగించిరి. వసుదేవుఁ డది విని విన్నఁబాఁగంది "మీరంద రాముసలమును బొడిపొడిఁ గావించి సముద్రిలోఁ జల్లుఁ" డని యాజ్ఞాపింప వారట్లు గావించిరి.

అనంతరము ద్వారకానగరమునఁ జిలుకలు గూబల యెలుఁగులతోడ నఱచుటయు, మేఁకలు నక్కలవలెఁ గూయుటయు, గోవులకడుపున గాడిదలు పుట్టుటయు నున్నగు మహోత్పాతము లనేకములు పుట్టసాగెను. యాదవు లందఱును దుర్మార్గవర్తనులై విప్రసమూహములకు బాధసేయుచు, గురువులఁ దిరస్కరించుచు నిచ్చవచ్చినటుల సంచరింపఁదొడఁగిరి. కాంతలు భర్తలఁ దిరస్కరింపనారంభించిరి. సర్వవిదుండగు వాసుదేవుఁ డీదుశ్శకునము లన్నియుఁ గాంచి, గాంధారి శపించి ముప్పదియాఱు వత్సరములయ్యెనని తలఁచి, యిఁక నన్యోన్య కలహమున యాదవులందఱు నశింతురని నిశ్చయించి, తన వారెల్లరుఁ దీర్థసమీపప్రదేశమున మృతులగుట యుచితంబని

యోజించి "సకలజనులును రేపు రత్నాకరతీరమున కరు దెంచి యచ్చట జాతర సేయవలయు" నని పురమునఁ జాటఁ బనిచెను.

ఆరాత్రి సకలజనములును, దమతమ యాయుధములను, భూషణములను గొందఱు రాక్షసులపహరించినట్లును, నొక నల్లని స్త్రీవచ్చి తమతమ కాంతలనీడ్చికొనిపోయినట్లును దుస్స్వప్నములఁగాంచిరి. మఱునాఁ డెల్లవారలు గనుఁగొను చుండ, శైబ్య సుగ్రీవ మేఘ పుష్పబలాహకములను నశ్వము లతోడను, గరుడ కేతనముతోడను ప్రకాశించు శ్రీకృష్ణుని స్యందనమును, జక్రాయుధమును నద్భుతముగ మింటికెగసి యదృశములయ్యెను. పిమ్మట దేవకీనందనుఁడు వేఱొక్క యరదము నధిరోహించి యాదవులనందఱిఁ దోడ్కొని సముద్రతీరమున కరిగెను.

అప్పుడు బలరాముఁడు కృష్ణు నవలోకించి "తమ్ముఁడా! నేను తపముసేయ విపినమున కేఁగెద" నని చెప్పి వెడలిపోయెను. పిమ్మట యాదవులందఱును సముద్రునిఁ బూజించి యిష్టాహారములఁ దనివిదీర భుజించి మిక్కుటముగ సురాపానముసేసి మదోన్మత్తులై కేకిసలాడుచు విరసభాషణము సేయఁదొడఁగిరి.

అప్పుడు సాత్యకి, రుక్మిణీతనూజుఁడైన ప్రద్యుమ్నుని భుజ మువ్విఁ జేయివైచి యాతనికిఁ గృతవర్మం జూపి నవ్వుచు "ఈతఁడు గురుపుత్త్రునితోఁ బాండవశిబిరమున కేఁగి నిద్రా

పక్షులై యున్నవారలఁ జంపెను. ఇది శూరజనేక్షణమే!" అని యెకసక్కెమాడఁ గృతవర్మ రోషపరవశుఁడై "సాత్యకీ! కిరీటిచేఁ జేయి నరుకఁబడిన భూరిశ్రవునిఁ దెగటార్చిన శూరాగ్రేసరుఁడవగు నీ వాన న్న పహసించునది? నీపరాక్రమమును నేనెఱుఁగనిదా" యని పలికెను. ఇట్లు వాగ్వివాదము ప్రబలముకాగా నిరువురుఁ గయ్యమునకుఁ గడఁగిరి.

మున్ను సాంబుని కడుపునఁబుట్టిన ముసలమును, యాదవులు పొడిసేసి సముద్రమునఁ గలుప నదియంతయుఁ దత్తీరమున దుంగలై పుట్టి పెఱుఁగుచుండెను. సాత్యకి యాతుంగఁబెఱికి దానితోఁ గృతవర్మం గొట్ట నాతనిమస్తకము పుడమిఁగూలెను. అంతటఁ గృతవర్మ యాప్తులెల్లఱును సాత్యకిం జుట్టుముట్టి పోరఁదొడఁగిరి. సాంబ, ప్రద్యుమ్నాదికుమారులు సాత్యకికే సహాయులై యని సేయనారంభించిరి. కృష్ణుఁడు తనయనుజుని రక్షింపఁజాలినవాఁడయ్యును, విధికృతమును దలఁచి మిన్నకుండెను. అంత నుభయపక్షములవారును నచ్చటి తుంగఁబెఱికి యొండొరులఁ గొట్టుకొనుచుండ, మునుల శాపప్రభావమున నాతుంగ వాడినారాచములవలె వారలశరీరములను ఛేదించుచు ప్రాణములఁ బోరిగొనుచుండెను. అమ్మహాకలహమున సకలయాదవులును నొండొరులం గొట్టుకొనుచు మరణించిరి. సాత్యకి సాంబప్రద్యుమ్నప్రముఖులు మృతులైనపిమ్మటఁ, గృతవర్మపక్షమునఁబోరినవారిలో నింకను గొందఱుమిగులఁ గృష్ణుఁ

డాతుంగఁ గైకొని వారిని నిరవశేషముగ వధించెను.

పిమ్మటఁ గృష్ణుఁడు దారుకునిఁ బిలిచి "నీవతిశీఘ్రముగఁ గరిపురమున కేఁగి యాదవక్షయము పాండవుల కెఱిఁగించి యర్జును నిచటికిఁ దోడ్కొనిర" మ్మని చెప్పి పంపించి తాను వనితాజనములను, గరితురంగములను దోడ్కొని నిజ మందిరమున కరిగి, వసుదేవునకు సకల యాదవక్షయము నెఱిఁగించి, "జనకా! బంధువిహీనమై యీపురమున నేనిఁక నివసింపఁజాలను. బలరాముఁడు మున్నె తపము సేయ నిశ్చితుఁడై కాననమున కేఁగియుండెను! నేనును నాతనికడకుఁ బోయి తపమాచరించుచుండెదను. దారుకుని హస్తిపురమునకుఁ బంపించితి. అతఁడు ధనంజయుని శీఘ్రముగ నిటకుఁ దోడ్కొని వచ్చును. ఆ కురువరేణ్యుఁడు మీ పనుపు సేయఁగలవాఁడు; మీరీ వనితాజనములను, గరితురంగములను నరయుచు నిచ్చట నుండుఁ" డని చెప్పి దండప్రణామము సేసెను. ఆ ఘోర వార్త నాలించినతోడనే వసుదేవుఁడు దుఃఖాతిశయమున నిశ్చేతనుఁడయ్యెను. వధూజనములెల్లరు రోదనము సేసిరి. "కురుకులదీపకుఁడగు విజయుఁడు సత్వరమున నిచటికి వచ్చి మీ వంతలన్నియుఁ దీర్చుఁగావున మీరెల్లరు ధైర్యమూని యుండుఁడు. విధికృత మిట్టుండెను! దీనిం దప్పింపనలవిగా" దని కృష్ణుఁడు వారి కందఱికి యుపశమనవాక్యములు సెప్పి తాను నగరువెడలి బలదేవుఁ డేఁగినమార్గమునఁ బోయి యొక్క మహీరుహము చెంగట నాతనిఁ గాంచి వందన

మాచరించి జరిగిన వృత్తాంతమంతయు నెఱిఁగించెను.

పిమ్మట నా బలదేవుఁడు యోగమునఁ దనువుఁ ద్యజించి సహస్రఫణములు గల మహాభుజంగరూపముఁ దాల్చి దివమున కరిగెను. అనంతరము కృష్ణుఁ డచ్చోటుఁ బాసి యించుక దూర మరిగి, తాను భూలోకమునఁ జేయవలసిన పను లన్నియు నెరవేరుటఁ దలఁచి, యిక నిస్తనువుఁ ద్యజించుట సముంజసమని నిశ్చయించి యొక్క తరుచ్ఛాయను శయనించి నిశ్చలచిత్తుఁడై గాఢసమాధి నొందియుండెను.

అప్పు డా విపినమున సంచరించుచున్న వేఁటకాఁ డొకఁ డద్దేవునిఁ గాంచి, హరిణ మని తలఁచి, విధిప్రేరితుఁడై యొక్క బాణముఁ బ్రయోగించెను. ఆ తీక్ష్ణసాయకము దనుజభంజనుని శ్రీపాదతలముఁ దూఱి నొప్పించెను. అంత నవ్వేటకాఁడు మృగంగముఁ బట్టు తలఁపున నచ్చటికివచ్చి యమ్మహాపురుషు నవలోకించి, భయకంపితగాత్రుఁడై యద్దేవుని చరణారవిందములపై వ్రాలి "ఆర్యా! జింకయను తలపుతో నేనీ పాపకృత్యము నాచరించితి" ననుచు దుఃఖించెను. "ఓయీ! విధికృత మిట్లుండెఁ గావున నీవు చింతింపఁ బనిలే"దనుచు నప్పరమపురుషుఁడు వాని ననూరడించి తన మానుషదేహముఁ ద్యజించి, దివ్యరూపధరుఁడై దివమున కరిగెను.

అప్పుడు బ్రహ్మరుద్రపురందరాది బృందారకు లద్దేవదేవు నెదుర్కొని దండప్రణామము లాచరించి "అనంతా!

నీవు కంస, శిశుపాలాది దుష్టజనసంహారము సేయ భూలోక
మున నవతరించి పెక్కు కాలము గడచె! మే మెల్లరము నీ
రాకకుఁ బ్రతీక్షించుచుంటిమి. నీ విఁకఁ బరమపదమునకు
విచ్చేసి జగములఁ బాలింపు" మనుచు న ప్పరమేశ్వరుని
వైకుంఠమునకుఁ దోడ్కొనిపోయిరి.

అట దారుకుఁడు పాండవుల పాలికిఁ బోయి యాదవ
నాశము తెలుఁగు వారల కెఱిఁగింప వారలు పరమ దుఃఖితు
లైరి. తోడనే యర్జునుఁడు బయలు దేరి ద్వారకానగరమున
కరుదెంచెను.

దారుకసమేతుఁడై వచ్చిన యా ధనంజయునిఁ గాంచి
యాదవకాంతాజనములును, వసుదేవుఁడును, సేవకజనము
లును, పౌరులును శోకాతిశయమున నాక్రందనము సేసిరి.
అర్జునుఁడును కొంతతడవు విలపించి "మురమర్దనుఁ డెప్పు
డెచటి కరిగె" నని వసుదేవు నడిగెను. "భరతాన్వయ
ప్రదీపా! నీ ప్రియశిష్యులగు సాత్యకి ప్రద్యుమ్నులును, సకల
యాదవులును మడిసిన పిమ్మటఁ గృష్ణుఁడు వనితాజనములను,
గజాశ్వనివహములను దోడ్కొని నా కడకు వచ్చి "తండ్రీ!
విధివశమున యదువంశ నాశనము సంభవించె! బంధుజన
శూన్యమైన యీ పురమున నేను వసియింపఁజాలను. మదీ
యాగ్రజుఁడు మున్నే తపోవనమున కేఁగి యుండె! నేనును
దపము సేయ నరిగెద! ఇఁకఁ గొలఁదిదినములలో నీ పుర
ము నంబుధిముంచి వైవఁగలదు. విజయుఁడు నేఁట రేపట

నిచటికి వచ్చి మిమ్మందఱిని రక్షింపఁగలవాఁ" డని చెప్పి
తాను విపినమున కరిగెను. ఇఁక నిక్కాంతలను, సామజ
హయబృందములను, పౌరులను రక్షించు భారము నీయది."
అనుచు వసుదేవుఁడు గద్గదకంఠుఁడై యాతనికి సమస్త
వృత్తాంతము విశదముగఁ జెప్పెను.

పిమ్మట ధనంజయుఁడు వారల నందరిని నింద్రప్రస్థపుర
మునకుఁ గొనిపోవ నిశ్చయించి ప్రజల నందరిని రావించి
"పౌరులారా! దైవకృతమున నిట్లు సకల యాదవక్షయము
ప్రాప్తమయ్యె! నేఁటి కేడవదినమున నిప్పురము నంబుధి
ముంచివైవఁగలదు కావున నేను మిమ్ములనందరిని సురక్షిత
ముగ నింద్రప్రస్థపురమునకుఁ గొంపోవఁ దలఁచి యుంటి.
కృష్ణుని పౌత్రుఁడైన వజ్రదేవుని నింద్రప్రస్థపురమున కధిపుఁ
జేసెద. ఆతఁ డప్పురమున మిమ్ముల నందరిని ధర్మముగఁ
బాలింపఁగలవాఁడు కావున నెల్లరు శీఘ్రముగ నింద్ర
ప్రస్థమునకుఁ బయనము గం" డని చెప్పి యారాత్రి తాను
విశ్రమించెను.

తెల్లవారుజామునకు వసుదేవుఁడు నిర్మలయోగసిద్ధిచేఁ
దన శరీరముఁ బరిత్యజించి యూర్ధ్వలోకమున కేఁగెను.
అర్జునుఁడ మ్మహానీయునకును, సంగ్రామమున నిహతులైన
సకల యాదవులకును యథావిధిగ దహనసంస్కారము సేయిం
చెను. వసుదేవుని సతు లందఱు నప్పు డగ్ని సొచ్చి దేహ
త్యాగము సేసిరి.

పిమ్మట ధనంజయుఁడు తానొక్కరుఁడు రామకృష్ణులను సందర్శింపఁ గుతూహలముగలవాఁడై యాప్తజనులు కొందఱు వెంటరా విపినమున కరిగి యమ్మహానుభావుల వెదకి యొక్కచోటఁ గృష్ణుని కళేబరముఁ గాంచి దుఃఖాతిరేకమునఁ బడలుచు నప్పుణ్యాత్ముని యధికప్రేమమునఁ గౌఁగి యాలింగనము సేసికొని, మేను ఘూర్ణిల్లుచు "మహాపురుషా! నన్నుఁ బిలువఁ బనిచి, నాతో నొక్కమాటయైనఁ జెప్పకయే పరమపదమున కరిగితివా" యనుచు విలపింప సాగెను. అట్లు కొంత తడవు ప్రలాపించి, తన సహోదరులచే నుపదేశింపఁబడినవాఁడై వారి సహాయమున నమ్మహానుభావునకు దహనసంస్కారము సేసి, వేదోక్తప్రకారముగ నడవిలోనున్న బలరాముని కళేబరమును గూడఁ దెచ్చి యథావిధిగ నగ్నిసంస్కారము సేసెను.

అనంతరము ధనంజయుఁడు ద్వారకానగరము సముద్రము ముంచు దినము సమీపించెనని యోచించి యతిత్వరితముగఁ బయలుదేరి, రామకృష్ణుల మరణవార్త దెలిసినతో నచ్చటి వారలు సత్వరముగ [illegible]రని తలఁచి యాదుర్వార్త నెవరికిఁ జెప్పకయే, రామ, కృష్ణ, సాత్యకి, ప్రద్యుమ్న ప్రముఖుల పత్నులను, సకల యాదవాంగనలను, సమస్త పౌరులను, గజాశ్వనివహములను దోడ్కొని యప్పురము వెడలెను. తోడనే యమ్మహాపట్టణము సముద్రముచే ముంచఁబడెను. విజయుఁడు తన వారలఁ గొంత

దూరము తోడ్కొనిపోయి యప్పటికిఁ బ్రొద్దుగ్రుంకుటచే
నొక్క యుచితప్రదేశమున విడియించెను

అప్పుడు కొందఱు కిరాతులు వారలఁగాంచి "వీరికి
రక్షకుఁ డొక్కవిజయుఁడే గావున మనమీతనిని సులభముగ
జయించి వీరి ద్రవ్యమంతయు నపహరింత" మని తలఁచి
యానసమూహములఁ జొచ్చి కాంతామణుల భూషణముల
నపహరింప నారంభించిరి. అర్జునుఁ డది గాంచి యుగ్రుండై
యస్త్రశస్త్రములఁ బారఁద్రోలనెంచి బాణములఁ బ్రయోగింప
నవి యక్కిరాతుల బాధింపఁజాలకుండెను. అంత నతఁడు
మహాస్త్రములఁ బ్రయోగింపఁబోవ నవియును శక్తిఁ దప్పి
యుండెను. అప్పు డాశ్చర్యవిషాదనిమగ్నమానసుఁడై గాండీవి
మఱికొన్ని వాఁడినారాచములఁ బ్రయోగించి యెట్టకేల
కాబోయలఁ బారఁద్రోలి, ప్రభాతమైన పిమ్మటఁ దనవార
లతో నచ్చోటుఁ బాసి కురుక్షేత్రమున కరిగెను.

అనంతరము విజయుఁడు రామకృష్ణుల నిర్యాణము నెఱిఁ
గింప నెల్లరును శోకవిహ్వలమానసులై యాక్రందనము సేసిరి.
అప్పుడు బలరాముని సతులును, రుక్మిణీప్రభృతి కాంతామణు
లును కొందఱగ్నిప్రవేశముసేసి యూర్ధ్వలోకమున కరిగిరి.
సత్యభామయు మఱికొందఱు వనితామణులును దపమాచ
రింప విపినభూమి కేఁగిరి. ధనంజయుఁడు కృష్ణుని పౌత్రు నిం
ద్రప్రస్థమునకును, సాత్యకీతనూజుని సరస్వతీపురమునకును
నభిషిక్తులఁ జేసి, వస్తువాహన నివహముల నిరువురకుఁ బంచి

యిచ్చి తాను సాత్యవతేయు నాశ్రమమున కరిగెను.

కృష్ణద్వైపాయనుఁడు వివర్ణవదనుఁడై వచ్చిన ధనంజయు నవలోకించి "కుమారా! నీవిషాదమునకుఁ గారణమే" మని యడుగ నతఁడు, సకల యాదవనాశమును, రామకృష్ణుల నిర్యాణమును, కిరాతులు తన్నెదిరించుటయుఁ, దన శస్త్రాస్త్రముల శక్తి దప్పుటయు నాదిగా సమస్త వృత్తాంతమును సవిస్తరముగ సత్తపోధనున కెఱిఁగించెను. అంత నమ్మునీంద్రుఁడు "ధనంజయా! దైవ నిర్ణయ మివ్విధమున నుండుటచేఁ గృష్ణుఁడు స్వజనరక్షణమున కుపేక్షించె!

చ. ధరణిభరంబు వాప నవతారము నొందిన కృష్ణుఁ డత్తఱిం
గడుఁగ నిర్వహించి యజరామరనిష్కల నిర్వికార భా
స్వరనిజసత్పదంబు నుపశాంతిపరుండయి పొందె దానికిం
గురుకులవర్య శోకమునఁ గుందుదురే మిముబోఁటి బోధనుల్

మ. అవనీభారము వాపి తా హరికిఁ దోడై భీమసాహాయ్యగా
రవదుర్దాంతపరాక్రమంబునఁ గృతార్థత్వంబునం జేసి యా
స్త్రవితానంబును నిన్నుఁ బాసి చనియెన్ తాన్ దైవప్రకారజ్ఞ నీ
దు వరస్థానగణంబునన్ సురలు సంతోషించి రప్పౌరులన్.

క. బలమును బుద్ధియుఁ జేవయు
నలఘుమతీ యుల్లసిల్లునగు కాలమునం
బొలియుం గాలవిపర్యయ
కలనంబున బుధుల కిబ్బుగలఁకయుఁ గలవే.

తే. కాలమూలంబు సర్వంబు గాన దీని
కొందుతలఁపులు దక్కి మీ రుత్తమంపు
గతికిఁ జనుఁడు నిశ్చింతవికారతనులు
విడిచి యార్యజనంబుల వినుతిసేయ."

అని యుపదేశించెను. అంతట విజయుఁ డమ్మునివర్యునకుఁ బ్రణామముసేసి యాతని యనుజ్ఞవడసి కరినగరమున కేఁగెను.

## —* మ హా ప్ర స్థా ని క ప ర్వ ము *—

అర్జునుఁడు, యుధిష్ఠిరు పాలికిఁబోయి రామకృష్ణుల నిర్యాణమును, దనశస్త్రాస్త్రములు శక్తిహీనములగుటయు, సాత్యవతేయుని హితబోధయు సవిస్తరముగఁ దెలిపెను. అంతట యుధిష్ఠిరనృపాలుఁడు తానికఁ బ్రస్థానమున కేఁగుట యుక్తమని తలఁచి తన యూశయము ననుజులకును, ద్రౌపదికిని దెలుప వారును నందుల కంగీకరించిరి.

పిమ్మట ధర్మనందనుఁడు పరిక్షితునిఁ బట్టాభిషిక్తునిజేసి, యతనికిఁ బూజ్యసామ్రాజ్యపరిపాలన ప్రకారము లుపదేశించి, ధర్మశీలుఁడై తన్ను సేవించుచున్న యుయుత్సునిఁ బిలిచి, యాతనికి రాజ్యతంత్రములు బోధించి "నీవీపరిక్షితునకు రక్షకుఁడవై రాజ్యతంత్రము నడుపుచుండు" మని చెప్పి, సుభద్రను రావించి,

మ. "భవదీయాత్మజు నాత్మజుండు కురుబారోద్వహుండెయ్యె యా
దవవంశోత్తరుఁడైన వజ్రునకు నింద్రప్రస్థరాజ్యంబు గా
రవదీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రాగిత్రణీయుంబులై
నవి యీయిండులు రెండుఁనీవు దృఢధైర్యంబొప్ప రక్షింపుమీ.

క. విను శేషించిన యాదవ
జనులకు స్వామి జనృపతి సంరక్షకుఁడా
తనిఁ బోషించుట ధర్మం
బనఘా యదిలేమి ధర్మహాని యగుఁజుమీ."

అని యుపదేశించి యామె నందుల నంగీకరింపఁజేసి, కృపా
చార్యునకుఁ బరీక్షితుని శిష్యునిఁగ నప్పగించి, పౌరజానపద
ప్రవరజనముల రావించి వారల కందఱికి నక్కుమారసిం
హునిఁజూపి "పౌరులారా! మీరందఱు మాయెడ్ల
మాఱుగ నిక్కుమారునిఁ గైకొని, యాతని యాజ్ఞాను
వర్తులై మెలఁగుచు ధర్మనిరతులై యుండుఁడు. మేమిపు
డము ద్రౌపదీయుతముగ విపినమునకుఁ దపముసేయ నేఁగు
చుంటి" మని చెప్పెను. పౌరులందఱు నవ్వచనముల నాలించి
దుఃఖసంతప్తచిత్తులై "అవనీతలేంద్రా! మమ్మందఱిని విడ
నాడి విపినభూమి కేఁగుట సముచితమే?" అనుచు గద్గద
స్వరములఁ బలుక, ధర్మనందనుఁడు తగు వచనముల వారల
నోడఁబఱచి, యనేక దానముల నొసఁగి యెల్లజనులఁ బ్రీత
చిత్తులఁ జేసెను.

పిమ్మట సవ్యసాచి యులూచిని భుజగేంద్రునికడకును,
చిత్రాంగదను బభ్రువాహనునికడకును బోవ నంగీకరింపఁజేసి
పంపించెను. అనంతరము పాండునందనులు ద్రౌపదీసమేతులై
సర్వాభరణములుఁ బరిత్యజించి, వల్కలాజినములు ధరించి
రాజమందిరము వెడలి వనమార్గమునుబట్టి నడువసాగిరి.
అప్పుడు సమస్తబాంధవులును, సకలపౌరులును దుఃఖావేశిత
మానసులై యుడలుచుఁ జాలదూరము పాండవులవెంట నేఁగి
పిమ్మట వారిచే నివారితులై మరలి పురికేఁగిరి. ఒక్క శున
కముమాత్రము వారివెంటఁ బోవుచుండెను.

ఉపవాసవ్రతపరులై పాండవులు యోగబలమున నడు
చుచు ననేక గిరిసరిదరణ్యములు గడచి పూర్వసముద్రతీరము
నకుఁ బోయిరి. అప్పు డగ్ని దేవుఁడు వారికిఁ బొడసూపి
"ధనంజయా! దేవకార్యమునకుగాను నేనీ గాండీవమును
వరుణదేవునిచే నీకిప్పించితిని. దీని కార్యము నెరవేరె. ఇంకను
నిమ్మహాధనువు నీకేల? దీని నీ యంబుధిని విడువు"మని చెప్ప
విజయుఁ డా ధనువు నా సాగరజలముల విడిచెను. పిమ్మటఁ
గృశానుఁ డంతర్ధానుఁడయ్యెను.

అనంతరము పాండవులు భూప్రదక్షిణము సేయుచు మేరు
పర్వతసమీపమునకుఁ బోవుచుండ మార్గమధ్యమున నొక్క
చోటఁ బాంచాలరాజనందన యోగ మెడలుటచేఁ బుడమిఁ
బడి విగతజీవిని యయ్యెను. వాయుతనూజుఁ డదిగాంచి విష
ణ్ణుఁడై "అగ్రజా! ఈ సుదతీమణి వర్తనమున నధర్మ
మెన్నఁడుఁ గానము. ఇప్పుడిట్లు పడుటకుఁ గతమెద్ది" యని
యడుగ "ఇత్తన్వి విజయుని దెసఁ బక్షపాతిని అంతనాఁగ
నిట్లయ్యె" నని పాండవాగ్రజుఁడు ప్రత్యుత్తర మొసఁగి స్థిర
చిత్తముతో ముందు కేగుచుండెను. అట్లు వారు మఱికొంత
దూర మరిగినపిమ్మట సహదేవుఁ డపగతప్రాణుఁడై యవనిఁ
బడియె. అప్పుడు పవననందనుఁడు "అగ్రజా! అనహంకారుఁ
డును, మాయందఱికంటె నీయెడ భక్తుఁడునునైన యీ
యనుజుఁ డిట్లు పడుటకుఁ గారణమే"మని యడుగ "ఈతఁడు
జగతిలోఁ దనకంటెఁ బ్రాజ్ఞుఁడు లేఁడని మనమునఁ దలఁ

చెడివాఁడు. అందువలన నిట్లయ్యె" నని యుధిష్ఠిరుఁ డాతనికి బదులు సెప్పి యరుగుచుండెను మఱికొంతతడవునకు నకులుఁడు పుడమిఁగూలె, భీమసేనుఁడు ధర్మతనయునిఁ గారణ మడిగెను. "ఈతఁడు తనకంటె సురూపవంతుఁడు లేఁడని గర్వించెడివాఁడు. అక్కారణమున నిట్టులఁ బడిపోయె" నని చెప్పెను. మఱికొంతదవ్వేగునకుఁ గోయిన పిమ్మట ఫల్గునుఁడు విగతాసుఁడై ధరణిఁగూలెను. భీముఁ డదిగాంచి వగచుచు "అన్నా! ఈ యమలచరిత్రుఁడు పడుటకుఁ గారణమే"మని యడుగ "ఈతఁడు తనకంటె ధనుర్విద్యయందు నిపుణులు లేరని తలఁచి యుండెడివాఁడు గర్వించుచుండుటచే నిట్లయ్యె" నని ధర్మనందనుఁడు బదులు సెప్పి యేగుచుండెను. మరికొంత దవ్వరిగినపిమ్మట భీమసేనుఁడును ధరణిఁగూలుచు "అనఘా! నేనిట్లు పడిపోవుటకుఁ గతమెయ్యదియో తెల్పు" మని యడుగ "తమ్ముఁడా! నీవు నేనే మహాబలశాలినని గర్వించి యితరులఁ దృణీకరించుచుండుటచే నిట్లయితి" వని ధర్మాత్మజుఁ డాతనికిఁ బ్రత్యుత్తర మొసఁగి స్థిరచిత్తుఁడై ముందున కేఁగుచుండెను. పాండవులు పురము వెడలినప్పటినుండి యువారి ననుసరించి వచ్చుచున్న సారమేయము మాత్రము ధర్మతనయుని యెడ నధికభక్తిగలదై యాతనివెంట నేఁగుచుండెను.

అట్లు నిస్తారగరిష్ఠుఁడై యుధిష్ఠిరనృపాలుఁడు మేరుశైల సమీపమునకుఁ బోవ వాసవుఁడు రథారూఢుఁడై వచ్చి "ధర్మనందనా! నీవీ దివ్యస్యందనము నధిరోహించి నాకలోక

మునకు రమ్ము. నేను నిన్నుఁ గొంపోవచ్చితి” నని పలికెను. యుధిష్ఠిరుఁ డాతనికిఁ బ్రణామమొనరించి, శోకసంతప్తమానసుఁడై “అమరేశ్వరా!

శా. తోడంబుట్టువు లందఱుం బడిన యాదుఃఖంబు చిత్తంబునం
బీడం బెట్టెడు శోకమార్యులకు దప్పింగాలెఁ బాంచాలి వా
ర్తోడై వచ్చిరి వారు లేక యిట మీతో రాను వారెల్ల నా
తోడం గూడఁగ వచ్చునట్లుగఁ గృపాధుర్యాత్మ కావింపవే.”

అని పలుకఁ, బాకశాసనుఁడు “అవనీతలేంద్రా! నీయనుజులును, ద్రౌపదియు మానుష దేహములఁ ద్యజించి దివమున నున్న వారలు. వారికొఱకు దుఃఖింపఁబనిలేదు. నీవిన్నందనారూఢుఁడవై దివమున కరుదెంచి వారలఁగాంచు మని” చెప్పెను. అంతట యుధిష్ఠిరుఁడు “నిర్జరవల్లభా! నేనిలువెడలినదాది యీశునకమీయము నన్నాశ్రయించి వచ్చుచుండెను. ఇప్పుడు నావెంట దీనిని గూడఁ దోడ్కొనిపోవలయు” నని పలుకఁ, బురందరుఁడు నవ్వుచు “భరతాన్వయవార్ధిచంద్రా! శునకమునకు నాకలోకసుఖమునెట్లు గూర్పఁగలవాఁడ” నని వచించెను. ధర్మతనూజుఁ డదివిని “శచీనాథా! భక్త పరిత్యాగము సేసి బ్రదుకు సిరివలన నాకు సంతసము గలుగ” దని పలుక, సంక్రందనుఁ డతని నవలోకించి

చ. “అలుకహరించు ధర్మముల నట్లుగుటం గురువంశవర్య నీ
వలుగక విన్ము కుక్కలకు నాకసదంబు త్రివిష్టపంబునం
గలుగదు నీవు నిష్ఠురతగల్గదు దీనిఁబరిత్యజించినం
జలముకొనంగ నేల శుభసంగతమునం జెడనేల కృత్యమే.”

అని వచించెను. అంత నప్పాండురాజాగ్రనందనుఁడు

చ. "అనఘచరిత్ర విన్ము శరణాగతుఁ జేకొన కున్కి శుద్ధమి
త్రునియెడఁ జేయు ద్రోహము వధూటి వధించుట విప్రసర్వముం
గొనుట యనంగఁగల్గు నివి గూడి సమంబగు నాకుఁ జూడ భ
క్తు ననపరాధునిన్ విడుచు దోషముతో నిదియార్యవచ్చనే.

ఉ. కావున నాకలోకపుసుఖం బటులుండఁగనిమ్ము దేవ నీ
భావము నిల్పి నాదెసఁ గృపాభరితంబుగ సారమేయ సం
భావనసేఁత దోసముగఁ బట్టమి నాకు వరంబు నీవు పా
ప్మావనధూమకేతు నుండెద సమిద్ధతపంబున నిన్నుఁ గొల్చుచున్."

అని దృఢనిశ్చితుఁడై పలికెను.

అంత నాసారమేయ మారూపము ను బాసి దివ్యపురుష మూర్తిం దాల్చి "వత్సా! నేను ధర్మదేవతను, నీకు సర్వభూతముల యెడఁగల సమభావమును బరీక్షింపనెంచి శునకరూపమును దాల్చివచ్చి నీయెడఁ బ్రీతుఁడనైతి. ఇఁక నీవీదివ్యరథము నధిరోహించి దేవలోకమునకు విచ్చేయుము" మనుచు యుధిష్ఠిరుని హస్తముఁ బట్టుకొని యాస్యందనము నెక్కించెను.

అట్లు దివ్యరథారూఢుఁడై యుధిష్ఠిరుఁ డమరలోకమునకుఁ బోవ బృందారకులెల్ల రాన్నృపతిలకు నాదరపూర్వకముగ నెదుర్కొని యభినందించిరి. అప్పుడు నారదమునీంద్రుఁడు వచ్చి,

ఉ. "దానములం దపంబులను దద్దయుఁ బేర్కొల యట్టివారలన్
మానవసాధులన్ వినమె మాసెఁ దదీయయశంబులెల్ల నీ
మానితకీర్తి కీర్తులు సమస్తజగంబులయందుఁ బర్వ్వట
స్మేనులతోడ వారిటులు సేర్చిరె రా నమరత్వసిద్ధికిన్."

అనుచు నారాజోత్తమునిఁ బ్రశంసించెను.

పిమ్మటఁ బురుహూతుఁ డమ్మహీపాలునకు దేవలోకము
నఁగల మహనీయ పదార్థములఁ జూపుచు "కురుకుంజరా !
నీవిచ్చట సమస్తభోగములఁ దనివి దీర ననుభవింపు" మని
పలుక యుధిష్ఠిరనృపాలుఁడు "అనిమిషనాథా ! ద్రౌపదీభీమా
ర్జున నకులసహదేవులును, భారతరణమున మృతులైన బంధు
మిత్రులను గనుగొనిన పిమ్మటఁ గాని నాకిచ్చటి సౌఖ్యములు
సంతోషదాయకములు కాఁజాలవు. కావున నన్నతి శీఘ్రముగ
వారి కడకుఁ దోడ్కొని పొమ్మని వేఁడెను.

## —* స్వర్గారోహణపర్వము *—

అంతట దేవేంద్రుఁడు ఒక దూతను బిలిచి "ఈనృపాలు
నకు బంధుమిత్రవర్గముఁ జూపు"మని యాజ్ఞాపించెను. ఆ దేవ
దూత యుధిష్ఠిరునిఁ దోడ్కొనిపోవుచుండ నారదాదిమునీం
ద్రులును కొందఱాతని వెంట నేగిరి.

ఆ దేవదూత యాతనిఁ దోడ్కొనిపోవుచు నొకచోట
దివిజభామినీపరివృతుఁడై, సుఖాసనాసీనుఁడై స్వర్గలోక
సౌఖ్యముల ననుభవించుచున్న దుర్యోధనునిఁ జూపించెను.
ధర్మనందనుఁ డాతనిఁ గాంచి యసూయాపరుఁడై "నారద
మునీంద్రా ! ఈతఁ డతిలోభియై రాజ్యముఁ బంచి యీయ
నొల్లక పోవుటచే నీతని మూలమునఁ బెక్కండ్రు భూనాథులు
భారతరణమున నిహతులైరి. మఱియు నీతఁడు సాధ్వీమణియైన
ద్రౌపదిని సభకుఁ బిలిపించి పెక్కు దుష్కృత్యము లాచరించి

యుండె. ఇట్టి దుస్స్వభావునకు నాకలోకసౌఖ్య మెట్లు సేకూరె" నని యడుగ నమ్మౌని "రాజోత్తమా! వీర మరణము నొందిన కారణముచే నీతఁ డీ లోకసుఖముల నను భవించుచుండె; ఇది పుణ్యలోకము గావున నిచ్చట దుష్కృత్యముల నుగ్గడింపరాదు. కావున నీ విప్పు డీతని పాపకృత్యములఁ దలఁచి యసూయ నొందకు" మని చెప్పెను. "సంయమివరేణ్యా! ఈతని కష్టసుఖములతో నాకుఁ బనిలేదు. శీఘ్రముగ నన్ను నావారలకడకుఁ దోడ్కొని పొం" డని ధర్మతనయుఁడు వచించెను.

అనంతర మా దేవదూత రక్తప్రవాహములును, నస్థిపుంజములును గలిగి దుర్గంధయుక్తమై నడువ నశక్యమై యున్న యొక దుష్పథమున నమ్మహీనాథునిఁ దోడ్కొనిపోయెను. ఆమార్గమునఁ గొంతభాగము సనిన పిమ్మట నాతనికి సలసలఁ గాగిన నూనియవోలెఁ దెరలుచున్న జలములు గలిగి, వైతరణియను పేరఁ బరఁగుచున్న యొక్క ప్రవాహమును, దత్సమీపప్రదేశమున ననేక ప్రకారములఁ [illegible] ననుభవించుచున్న కొందఱు పాపకర్ములును గానఁబడిరి. ధర్మతనయుఁ డచ్చటి దుర్గంధమునకు సహింపఁజాలక యాదూత నుద్దేశించి "మన గమ్యస్థాన మింకెంత దవ్వుగలదు? ఇచ్చట నిలువ నశక్యమైయున్న" దనుచు వెనుకకు మరల నుద్యుక్తుఁ డయ్యెను.

అప్పు డచ్చట యాతనల ననుభవించుచున్న వారందఱును యుధిష్ఠిరు నుద్దేశించి,

తే. "భవ్యజనవ నీ గాత్రము దివ్యసౌర
భంబు వెరసిన గాడ్పు మాపైఁ గరంబు
హృద్యమై వీచుటయు దుఃఖమెల్లఁ బాసె
భూరిసౌఖ్యంబు నొందుచున్నార మేము.

క. నినుఁ జూడఁగనుటఁ బటుయా
తనలందో ఱఁగితిమి పరమధర్మాత్మక నీ
తనయము దయ నిచ్చట నిలి
చిన బ్రదుకుదు మింకఁ గొంతదవు నిలువవే."

అని యెలుఁగులెత్తిపలుక నారంభించిరి. ధర్మనందనుఁడు వారియెడఁ గరుణార్ద్రుఁడై నిలిచి "ఘోరనరకము ననుభవించు మీర లెవ్వరో యెఱిఁగింపుఁ"డని యడుగ, వారలు "నేను కర్ణుఁడను, నేనుభీమసేనుఁడను, నేనర్జునుఁడను, నేను నకులుఁడను, నేను సహదేవుఁడను, నేను ద్రౌపదిని, నేను ధృష్టద్యుమ్నుఁడను, మేము ద్రౌపదేయుల" మనుచుఁ దమతమ నామధేయములఁ జెప్పసాగిరి.

అవ్వాచసముల నాలకించినతోడనే ధర్మనందనుఁడు, శోకవిహ్వలమానసుఁడై "అక్కటా! సత్యపరులు, దయాఢ్యులు, సత్యదానరతులు నగు వీరి కెట్టి నరక మేలసంభవించె? దేవతలు ధర్మపరులైనను నింకెట్టి దుస్థితిఁ గలిగింతురో, లేక నాకిది చిత్తభ్రాంతియా, స్వప్నమా, నిక్కమా! నిర్ణయింపఁజాల